నా ఱాశ్వాసముల ప్రబంధము రచించి "వసుచరిత్ర"మని పేరుపెట్టి సకలాశ్వాసములును నాయక వసురాజ కథాగుంఫితములే యగునట్లు సందర్భపఱిచెను.

మఱియు నిష్టదేవతాస్తుతి వంశావతారాదులు గాక కేవల వసురాజచరిత్రము వసుశత(800) పద్యములతో వర్ణించుటచే నీగ్రంథమునకు వసుచరిత్ర మను పేరు సార్థక మగుచున్నది. ఇంతియకాక నామైకదేశగ్రహణన్యాయమున "వ=వసురాజుయొక్క, సుచరిత్రము=మంచిచరిత్రము" అను నర్థ విశేషలాభము గలిగియున్నది. ఇట్టి మెఱుఁగు లిట్లుండఁగా;

"శ్లో. సర్గబంధో మహాకావ్యం త త్రైకో నాయక స్సురః,

సద్వంశః క్షత్రియో వాఽపి... ...

ఏకవంశభవాభూపాః కులజా బహవోఽపి వా." యను మహాకావ్యలక్షణము వసుచరిత్రమునకు వర్తించును గాని మనుచరిత్రమునకుఁ జెల్లదుగదా! ఇఁక మనుచరిత్రకు సరియగు వర్ణనముల నుదాహరించెదను.

"సీ. ... ... ... ... ... ...

గీ. ... ... ... ... ... ... సాహిణి యొకండు

కర్త యెదుటికిఁ గొనివచ్చె గంధవాహ, బాంధవం బగు నొక మహాసైంధవంబు."

(మను. ఆ. 4. ప. 28.)

"సీ. ... ... ... ...

గీ. ... ... ... ... అరద మొకటి

మనసుతోనన మెలఁగు సామ్రాణికాశ్వ, రత్నములఁ బన్ని తెచ్చె సారథి యొకండు."

(వసు. ఆ. 1. ప. 144.)

ఇందు వసుచరిత్రపద్యమునందుఁ గల "మనసుతోనన మెలఁగు" నను విశేషణము మిగుల సరసమై యున్నది. మనుచరిత్రపద్యమునఁ గర్త యను పద ముచితముగ లేదు. 'భర్త' యని యుండిన బాగుగ నుండును గాని విశ్రమభంగ మగును.

క్రూరముగ వేఁటాడుచు మనోరమ రోదనము విని యామెం గాంచి క్రమంబున నామెను స్వరోచి పరిగ్రహించె నను మనుచరిత్రసందర్భమునకు వన్నెపెట్టి వసంతర్తు విభాసురము, శృంగార రసోద్దీపకము నగు నుద్యానమున నర్మసచివునితో విహరించుచుఁ గ్రీడాశైలమున కేఁగి యచట గిరికా మధురగానము నాలించి యామెం గాంచి తుద కామెను వసురాజు పరిగ్రహించె నని వసుచరిత్రమున వర్ణించెను.

మనుచరిత్రమునఁ బ్రవరుఁడును, వసుచరిత్రమున నర్మసచివుఁడును, నొక కోనం గని యం దొక కేళీభవనంబున వీణవాయించు నాయికలఁ గని రను నిక్కథపట్టులు మిగుల సరిగా నున్నయవి.

"సీ...గీ. కెరలు పికశారికాకీరకేకిభృంగ, సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత

దరులం బ్రతిశబ్ద మీన గంధర్వయక్ష, గానఘూర్ణిత మగు నొక్క కోనఁ గనియె."

(మను. ఆ. 2. ప. 19.)

"సీ...గీ. బండిగురువిందతీఁగచప్పరము లెనసి, ముడిగొనిన ద్రాక్షపందిళ్ల నడుమఁ గిన్న

రీనినాదానుకారిశారీకులకాది, ఘోషఘుమఘుమితం బైన కోనఁ గనియె." (వసు.ఆ.2.ప.21.)

"శా....పూవుందీవెల నొప్పు నొక్క భవనంబుం గారుడోత్కీర్ణమున్." (మను. ఆ. 2. ప. 22.)

"సీ...గీ. నిరుపమం బైన దివ్యమందిరముఁ గనియె." (వసు. ఆ. 2. ప. 23.)

"క. మృగమదసౌరభవిభవ, ద్విగుణితఘనసారసాంద్ర వీటీగంధ
స్థగితేతరపరిమళ మై, మగువ పొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన్."
(మను. ఆ. 2. ప. 24.)

"క. కనుఁగొని మణిమందిరమున, మునుకొని కలధౌతభిత్తిముకురతలబహి
ర్జనితానుబింబవంబులు, వనితారత్నములు మెలఁగువల నెఱిఁగింపన్." (వసు. ఆ. 2. ప. 24.)

"సీ....గీ. ఇంపు దళుకొత్త వీణ వాయించుచుండి." (మను. ఆ. 2. ప. 27.)

"సీ....గీ. వీణ వాయించు నొక యలివేణిఁ గంటి." (వసు. ఆ. 2. ప. 30)

ఈ వీణావాద్యపద్యములలో వసుచరిత్రపద్యమున రామరాజభూషణుని సంగీతకళా రహస్యనిధిత్వము వెల్లడి యగుచున్నది.

మనుచరిత్రమునఁ బ్రవరుఁ డంగీకరింపకుండుటచే వరూధిని యాతనిపైఁ బడె ననియు, వసుచరిత్రమున శుక్తిమతి యంగీకరింపకుండుటచేఁ గోలాహలుఁ డామెపైఁ బడె ననియు మిక్కిలి సరిగా వర్ణింపఁబడెను.

"మ. మునుమున్ బుట్టెడు కొంకు లౌల్యము నిడన్ మోహంబు విస్తీర్ణతం
బొనుపం గోర్కులు గ్రేళ్లుద్రిప్ప మదిమెచ్చుల్ ఱెప్ప లల్లార్ప న
త్యనుషంగస్థితి ఱిచ్చపాటొసఁగ నొయ్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్." (మను. ఆ. 2. ప. 30.)

"మ. అలఘుశ్రీనిధి యానగేంద్రతనయుం డాసైకతశ్రోణియొ
ప్పులు ఱెప్పార్పక చూచి చన్న మొదలం బొంగారి పైపై రసం
బులు జృంభించు భ్రమించు నాశయముకూర్మల్ మించ దీపించు ను
త్కలికాచాపలముల్ మనోనిబిడచింతాతన్మయత్వంబునన్." (వసు. ఆ. 2. ప. 112)

"మ. అని చింతించుచు మీనకేతనధనుర్జ్యాముక్తనారాచదు
ర్దినసమ్మూర్ఛితమానసాంబురుహ యై దీపించు పెందత్తఱం
బునఁ జేటెత్తినలజ్జ వంఘ్రికటకంబు ల్మ్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁ జని పల్కెన్ వాఁడు విభ్రాంతుఁ డై." (మను. ఆ. 2. ప. 38.)

"ఉ. శైలకులేంద్రుఁ డిట్లు మదశాలిశుకాలిపికాళిశారికా
జాలకనీలకంఠరవసంగతిఁ దాలిమి నిల్పఁజాల కు
ద్వేలకరాళకంతుశరవేదన దీర నదీరసోత్సుకం
దేలక యేల కల్గు ? మహనీయసుఖం బని నిశ్చితాత్ముఁ డై." (వసు. ఆ. 2. ప. 117.)

"క. రుచిరాజితమణిభూషా, రుచిరాజి వెలుంగ దివ్యరూపోజ్జ్వలుఁ డై
యచలాధీశ్వరుఁ డొకనాఁ, డచలామణిహార మగు మహానదిఁ జేరెన్." (వసు. ఆ. 2. ప. 118.)

"ఉ. నిక్కము దాఁప నేల ధరణీసురనందన యింక నీపయిం
జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యములఁ జూఱలఁ బాటలువాడు తేంట్ల సొం
పెక్కిన యల్ల పూఁబొదరిండ్లను గౌఁగిట నాదరించెదో." (మను. ఆ. 2. ప. 51.)

"ఉ. నా విని గట్టుఱేఁడు వదనంబున విన్నఁదనంబు దోఁప నో
శైవలినీశిఖామణి నిజంబు భవత్కమనీయకాంతి ధా
రావళిలో మునింగితి దయామతిఁ బ్రోవక సుళ్లఁ బెట్టెదో
నీ విఁక గ్రుచ్చియెత్తి ఘననిర్వృతిఁ దెప్పలఁ దేల్చెదో యనన్." (వసు. ఆ. 2. ప. 134.)

"క. అనుటయుఁ బ్రవరుం డిట్లను, వనజేక్షణ యిట్లువలుక వరుసయె వ్రతులై
దినములు గడపెడు విప్రులఁ, జనునే కామింప మది విచారము లేదే." (మను.ఆ.2. ప. 52.)

"మ. మతిఁ గ్రీడారతి గల్గెనేని సకలక్ష్మాపుణ్యదేశాళిఁ గాం
చి తపస్స్ఫూర్తిమెయిం గృశించి వనరాశిం జెందు మాబోంట్ల ను
ద్ధతిచేఁ గ్రమ్మఁగ నేల? నీకుఁ గలవే తారుణ్యలావణ్యజృం
భితరంభాదినిలింపభామ లన భూభృన్మౌళి రాగాంధుఁడై." (వసు. ఆ. 2. ప. 136.)

"సీ. వెలివెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి దాశకన్యాకేళిఁ దప్పఁజేసి;
కులములో వన్నె తక్కువయయ్యెనే గాధిపట్టికి మేనకచుట్టఱికము;
ననువుకాఁడై వేల్పునాగవాసముఁ గూడి మహిమఁ గోల్పడియెనే మాండకర్ణి
స్వారాజ్యమేలంగ నీరైరె సుర లహల్యాజారుఁడైన జంభాసురారి;
గీ. వారికన్నను నీమహాత్వంబు ఘనమె......" (మను. ఆ. 2. ప. 73.)

"సీ. అతనుభూతి ఘటింప దయ్యెనే చదలేఱు సిరిఁ దాల్చు నిధానచిత్రకునకు;
వరవంశవైఖరి వదలెనే రవిసుతాపతియైన దైతేయభంజనునకు;
వసులాభసంపత్తి మసలెనే జాహ్నవిఁ జేకొన్న శంతనుక్షితిపమణికి;
గమలోదయఖ్యాతి దెమలెనే నానానదీకాంతుఁడైన రత్నాకరునకు;
గీ. వారికేలాఘవమువచ్చెవనితయెంత, మాఱుమసలెదు పట్టినేమములుచాలు..."
(వసు. ఆ. 2. ప. 137.)

ఇచ్చట రెండు గ్రంథములయందుఁ గల కథపట్టులు లోకోత్తర నీతిబోధకము లయి యున్నవి. అనుకూలకాంతావాప్తి గల్గినను గామింపక, తమ నియమము వీడక యుండవలయు నను నీతి సుబోధ మగుచున్నది.

"గీ. నేరటేటియసల్దెచ్చి నీరజాప్తు, సానఁ బట్టిన రాపాడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో? పద్మభవుఁడు, వీనిఁ గాకున్నఁ గలదె యీమేనికాంతి."
(మను. ఆ. 2. ప. 36.)

"క. సురగరుడోరగనర ఖేచరకిన్నరసిద్ధసాధ్యచారణవిద్యా
ధరగంధర్వకుమారుల, నిరతము గనుఁగొనమె? పోలనేర్తురె వీనిన్." (మను. ఆ. 2. ప. 37.)

"తే. మేటి జమ్మేటియసటుఁ గ్రమ్మించు మించుఁ బోదివి మదనప్రతాపాగ్నిఁ బుటమువెట్టి
తమ్మిగద్దియ దాకట గ్రమ్మి యట్టి, కొమ్మఁ గావింపఁ బోలు నెత్తమ్మిచూలి."
(వసు. ఆ. 2. ప. 32.)

"క. సురరాజకన్యలును గి, న్నరరాజకుమారికలు ఫణాధరవిద్యా
ధరవీణాధరశోణా, ధరలును నాతరుణిఁ బోల్పఁదగరు నరేంద్రా." (వసు. ఆ. 2. ప. 31.)

"ఉ. ఇందునిభాస్య! వాఁ డనఁగ నింద్రుఁడొ! చంద్రుఁడొ! యయ్యుపేంద్రుఁడో!
యిందులకై వగం బొగుల నేఁటికి నేఁటికి నందుఁ బోద తూ

నందనభూమి భూమిసురనందనుఁ డుండకపోఁడు రమ్ము నీ
చందము నందముం గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱి సేయదే." (మను. ఆ. 3 ప. 63.)

"చ. జనపతి యిట్లు పంచశరశాతశరాహతి సంచలింపఁ గాఁ
గని హితమంత్రి వల్కు మహికాంత నిరంతరచింత నింత విం
తసెగులు పూన నేల లలనానలినాస్త్రుఁడ వీవు నిన్నుఁ గ
న్గొనినలతాంగి యీలువు మనోభవుఁ డింతకుఁ గొల్లలాడఁడే." (వసు. ఆ. 3. ప. 87.)

"ఉ. అంచెలుగట్టి కాలితొడుసై చననీవు గదమ్మ ప్రోదిరా
యంచ లివేటిసంగడము లయ్యెను దయ్యమ ! యేటివేడ్క నా
కంచుఁ బదంబున న్మొరయు నందియ యూడఁ గఁ దన్ని పోయి వీ
క్షించె లతాంగి యొర్తు మురజిన్నిభు సాగరమేఖలావిభున్." (మను. ఆ. 5. ప. 6!.)

"ఉ. డించఁ గఁ బ్రొద్దు లే కెద ఘటించిన రత్నవిపంచితో సువ
ర్ణాంచితమూర్తి యొర్తు ముఖరాంఘ్రిసమాశ్రితసత్కలాప యై
యంచల వచ్చు సోయగపుటంచలఁ దోలుచు మిక్కుచేడె యా
నంచు నుతింప వచ్చె వెస నాచతురాస్యునిమోము గన్గొనన్. (వసు. ఆ. 6. ప. 12.)

ఇంకను గొంతవఱకు సాజాత్యముగల పద్యము లనేకములు గలవు. గ్రంథవిస్తరభీతిచే వాని నెల్ల నుదాహరింపలేదు. పద్యములసంఖ్యలు మాత్ర ముదాహరించెదను.

| మనుచరిత్ర | | వసుచరిత్ర | | మనుచరిత్ర | | వసుచరిత్ర | |
|---|---|---|---|---|---|---|---|
| ఆశ్వాసముల సంఖ్య | పద్యముల సంఖ్య | ఆశ్వాసముల సంఖ్య | పద్యముల సంఖ్య | ఆశ్వాసముల సంఖ్య | పద్యముల సంఖ్య | ఆశ్వాసముల సంఖ్య | పద్యముల సంఖ్య |
| 1 | 18 | 1 | 21 | 3 | 17 | 4 | 7 |
| 1 | 28-34 | 2 | 63-69 | 3 | 16 | 4 | 9 |
| 3 | 90-91 | 3 | 49-51 | 3 | 19 | 4 | 12-13 |
| 3 | 71 | 2 | 79 | 3 | 20 | 4 | 16 |
| 5 | 7 | 2 | 102 | 3 | 21 | 4 | 17 |
| 3 | 29-34 | 3 | 116-124 | 3 | 27 | 4 | 22 |
| 3 | 33 | 3 | 121 | 3 | 28 | 4 | 23 |
| 3 | 34 | 3 | 122 | 3 | 36 | 4 | 27 |
| 3 | 73 | 3 | 132 | 3 | 51 | 4 | 47 |
| 3 | 73-82 | 3 | 133-148 | 3 | 54 | 4 | 128 |
| 3 | 75 | 3 | 136 | 5 | 60 | 6 | 10 |
| 3 | 82 | 3 | 138 | 5 | 63 | 6 | 11 |
| 3 | 83 | 3 | 148 | 5 | 64 | 6 | 14 |
| 3 | 84 | 3 | 149 | 1 | 61 | 2 | 87 |
| 3 | 10-14 | 4 | 4 | 3 | 74 | 2 | 26 |

మఱియు నొక్కొక్కకల్పనమే యనేకులు సంగ్రహించుచు నుత్తరోత్తర మలంకరించుచుందురు.

"శా. నల్లిల్లుం గుడియు న్వనంబును నిధానంబుం దటాకంబు రం
జిల్లం గొండొకకాల మేఁగ నవి విచ్ఛేదంబునుం బొందు నే
ప్రొల్లుం బోనిది కీర్తికిం గృతియ పో భూమండలిం దానికిం
దెల్లం బిప్పుడు రామభారతకథాధీనప్రబంధావళుల్." (శృం. శా. ఆ. 1. పే. 3.)

"గీ. సప్తసంతానములలోఁ ప్రశస్తిఁ గాంచి, ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియ కానఁ
గృతి రచింపుము మాకు శిరీషకుసుమ,పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య!" (మను.ఆ.1.ప.14.)

"గీ. తరుతటాకాదిసంతతుల్ ధరణి నెచట, నిలిపి రచటనె యుండు వానికిని గృతిము
ఖంబుననె విశ్వవిఖ్యాతిగానఁగృతియె,సంతతివతంసమది మాకు సంఘటింపు." (వసు.ఆ.1ప.18.)

"సీ. కాననేత్తువుల ముక్తము లైన ముత్యాలు ముదిరి పండిన మంచివెదురుఁబ్రాలు;
దినములోఁ గ్రొత్తయొత్తిన కట్టజవ్వాజి ముక్కలు మురియని మొరళిపప్పుఁ;
జంద్రికారుచిఁ బొల్చు చమరవాలంబులుఁ బొందుగాఁ గాఁచిన పూతిమదువు;
లలఁతి దంతంపుఁగామల పీలిసురఁటులు శోధించి పడిచిన జుంటితేనె;
గీ. ...నాదిగాఁ దెచ్చి పతి కుపాయనము లిచ్చి......" (శృం. శా. ఆ. 1. పే. 15.)

"ఆ. ఒక్కయెఱుకుఁ జేఁడు నక్కకొమ్ముకు నిట్టి, గోఅజంబు జున్నుఁ జాఱపప్పు
పీలిగఱుల యంపకోలలు నెలవిండ్లుఁ, గాను కిచ్చి కరయుగమ్ము మొగిచి." (మను.ఆ.4.ప.14.)

"సీ....గీ. అనుచు నాగంధవహుని ధార్త్యములు దెలుపు, లీల విరిసినవిరులు రాలినరజంబు
లొలికినరసంబు లురిలినఫలములధిపు,మ్రోలనిడిపల్కియుద్యానపాలురపుడు." (వ.ఆ.1.ప.134.)

నాయికకు వివాహ మయినవెనుక నందఱు కవులు నవసరము గల్పించుకొని వధువు నత్తవారింటి కంపునెడల బుద్ధులు గఱపించుచుందురు ... ... ... ... ...

"శ్లో. యాస్య త్యద్య శకుంత లేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠస్తంభితబాష్పవృత్తికలుష శ్చింతాజడం దర్శనమ్,
వైక్లబ్యం మమ తావ దీదృశ మిదం స్నేహా దరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథం ను తనయా విశ్లేషదుఃఖై ర్నవైః." (అభి. శా. అం. 4. శ్లో. 6.)

"శ్లో. శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే
భర్తుర్విప్రకృతాఽపి రోషణతయా మా స్మ ప్రతీపం గమః,
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యే ష్వనుత్సేకినీ
యాంత్యేవం గృహిణీపదం యువతయో వామాః కుల స్యాధయః" (అభి.శా.అం.4.శ్లో.18)

"ఉ. ఎంచ మునీంద్రులందు విజితేంద్రియుఁ డైన తపస్వి మూర్తి గా
వించి శకుంతలం బెనిచి విస్మృతి నొందిన మోహపాశముల్
ద్రెంచుకొనంగ లేక తియతీపులఁ జిత్తముఁ గాసివెట్టె శీ
లించిన నెవ్వఁ డింక వదలింపఁ గ నోపెడు మోహబంధముల్." (శృం. శా. ఆ. 4. పే. 91.)

"సీ. అత్తమామలకు నీయసనేమి వెట్టుచుఁ గనుసన్నఁ జేయుమీ పను లెఱింగి;
ప్రాణమిత్త్రములు గా భావించి యేప్రొద్దు సవరింపుమీ ప్రేమ సవతులందు;
భర్త యొక్కొకవేళ బహుమాన మొనరింపఁ గదియ రానీకుమీ గర్వరేఖ;
పతిచిత్త మెఱిఁగి తత్పరిజనంబులమీఁదఁ జేయుమా మిగుల దాక్షిణ్యగరిమ;

గీ. కలఁక నొందకుమా ధవుఁ డలిగినపుడు, పలుకులను జేరనీకుమా పరుసదనము
మీని వెలి గాఁగఁ దిరుగు నేవేలఁది యైనఁ, గులమునకు నాధియాఁ జుమీ కూఁతుఁగుఱ్ఱ."
(శృం. శా. ఆ. 4. పే. 92.)

వీనియందు సంస్కృతములోని సారస్యము కానరాదు. ఇంక ననేకపద్యములు మూలాతి క్రమణముగా నిందుఁ గలవు. గ్రంథవిస్తరభీతిచే నిట నుదాహరింపలేదు.

"శ్లో. పితాత్మనః పుణ్య మనాపదః క్షమా ధవం మన స్తుష్టి ర థాఖిలం నలః,
అతః పరం పుత్రి న కోఽపి తేఽహా మి త్యుదశ్రు రేష వ్యసృజ న్నిజౌరసీమ్."
(నై. స. 16. శ్లో. 117.)

"మ. గురు వన్నం ధన మన్నఁ బుణ్య మనినం గోత్రోదయం బన్న దే
వర యన్న న్మన మన్నఁ దుష్టి యనినన్ వాత్సల్య మన్న న్నిజే
శ్వరుఁ డన్నం బరమోపకార మనినన్ సర్వంబు నన్నం దలో
దరి! నీకు న్నిషధాధినాథుఁడె సుమీ తథ్యంబుగాఁ జెప్పితిన్." (శృం. నై. ఆ. 7. ప. 8.)

"సీ. పాటించి కొలువు మీధవనదైవతముల సవతులఁ గొనియాడు సఖులఁబోలె;
నారాధనముసేయు మత్తమామల నెప్డుఁ బరిజనంబులమీఁదఁ గరుణగల్గు;
మలుగకు కోపించినప్డు నాథునితోడ మదిలోన నుబ్బకు మన్ననలకుఁ;
దోడికోడండ్రతో కూడిమాడి చరింపు దాసీజనముఁ బ్రోవు తల్లికరణి;
గీ. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు, భక్తివిశ్వాససౌహార్దపరత నెరపు
భవ్యపతిదేవతాచారపరమపుణ్య, ధర్మ మేమరకుండుమీ తల్లికాన." (శృం. నై. ఆ. 7. ప. 9.)

శ్రీనాథుఁ డిట్లు మూలాధికముగా సంస్కృతశాకుంతలమునుండి యభిప్రాయములను సంగ్రహించెను. కొన్ని క్రొత్త యభిప్రాయములను నైతము చేర్చెను. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడును నిట్లే యీవిషయమున మిక్కిలి యధికముగా వర్ణించెను. మీఁద నుదాహరించిన పినవీరభద్రుని సీసములోని మూలాధికాభిప్రాయములీ శ్రీనాథుని సీసమునుండి గ్రహింపఁబడిన వని తోఁచుచున్నది.

పయిరీతిని మక్కీకి మక్కీగాఁ గాక కొంతపఱకు మార్చి సరసముగా రామరాజభూషణుఁడును గిరికకు బుద్ధులు చెప్పుటను వర్ణించెను. ఇందు స్వభావవర్ణనాస్ఫురణమునకు నర్థాంతరమునను సంధించినాఁడు.

"క. నీతమ్ములశుభవాసన, నీతలిదండ్రులగభీరనిశ్చలగుణవి
ఖ్యాతియును దలఁచి మెలఁగుము, నాతల్లీ కులవధూజనమతల్లికవై." (వసు. ఆ. 6. ప. 55.)

"సీ. మాఱుమాటాడదు మఱచి యైనను గురువ్యాహారమున కీయహార్యతనయ;
యాన మ్రగతిఁ బూను మానంపుసవతు లెట్లైన నీదివ్యరత్నానుజాత;
తాఁగ యై మేరమీఱ దొకప్పుడును ఘనశ్రీలఁ బొంగియును నీసింధుకన్య;
యేకాకృతివహించు నిరాగవృత్తికి నపరాగవృత్తికి నబ్జసహజ;
గీ. యచ్చెరువు వింత యబ్బురం బరిది యనుచు, విశ్వధాత్రీశ్వరులు మెచ్చ వెలయవమ్మ!
యమ్మ భవదీయచిత్రగుణాతిశయము,వలన మాకెల్లవన్నెరా మెలఁగవమ్మ!" (వసు. ఆ. 6. ప. 56.)

"క. బెగడవల దనుచు బెట్టిద, మగు నెవ్వగ నగడుపడుచు నాఁడుపడుచులో
పగవారికి వల దన వా, పగవారికి నేల యొసఁగెఁ బద్మజుఁ డనుచున్." (వసు. ఆ. 6. ప. 62.)

"శ్లో. భూత్వా చిరాయ చతురంతమహీసపత్నీ దౌష్యంతి మప్రతిరథం తనయం నివేశ్య,
భర్త్రా తదర్పితకుటుంబభరేణ సార్థం శాన్తే కరిష్యసి పదం పునరాశ్రమేఽస్మిన్."
(అభి. శా. అం. 4. శ్లో. 20.)

సీ. "మెదలు మిటారితుమ్మెదలు ఝుమ్మని మ్రోయఁబొదలు నిచ్చటి పువ్వుఁబొదలు సూడఁ;
దేటి మాధురిఁ గడతేటి పేరివమున వారిసేయు మదీయవారిఁ దేల;
వలనంది దరులక్రేవల నందికొనుచు నావల నగల్పు మహోర్మివలన మరయ;
గములఁ బాయక తరంగములపైఁ తగు సితాంగముల మానసవిహంగములఁ బట్ట;
గీ. నరిది వ్రతముల సరిగంగలాడఁ జైత్ర, శుచినభోబాహుల తపోవిశోభిసకల
సమయములఁ దావకప్రాణసమునిఁగూడి, యిచటనె మెలంగెదు కలంగె దేలతల్లి."
(వసు. ఆ. 6. ప. 61.)

కాళిదాసు ముం దెప్పుడో నీభర్తతోఁ గూడి యిచ్చటికి వచ్చెద వని యోదార్పు వర్ణింపఁగా, రామరాజభూషణుఁడు సర్వదా యిచ్చటనె విహరించుచుందు వని యోదార్పును మిగులఁ బ్రౌఢముగా వర్ణించినాఁడు.

"మ. కమలేందీవరషండమండితలసత్కాంతారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడ నై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతు శాతోదరిన్." (శృం. నై. ఆ. 2. ప. 21.)

"శా. చంచత్పల్లవకోమలాంగుళికరన్ సంపూర్ణచంద్రాననన్
న్యంచచ్చందనగంధి గంధగజయానన్ జక్రవాకస్తనిన్
గించిన్మధ్యఁ దటిల్లతావిలసితాంగిం బద్మపత్రాక్షి వీ
క్షించెన్ రాజు శకుంతలన్ మధుకరశ్రేణీలసత్కుంతలన్." (శృం. శా. 2. పే. 29.)

"మ. అతఁ డావాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చో టని చేరఁ బోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభి న్నవలా నొకానొక మరున్నారీశిరోరత్నమున్." (మను. ఆ. 2. ప. 25.)

"చ. తరుపులపొంతఁ బొంచి వసుధావరమిత్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁ దమోవినీలకచఁ దామరసోదరసోదరప్రభం
దరళవిలోచనం దతనితంబఁ దటిన్నిభగాత్రవల్లరిం
దరుణశశాంకఫాల నొకతన్విఁ దరంగవళిం దలోదరిన్. (వసు. ఆ. 2. ప. 25.)

"శ్లో. అనలభావ మియం స్వనివాసినో న విరహస్య రహస్య మబుధ్యత,
ప్రశమనాయ విధాయ తృణా న్యసూన్ జ్వలతి తత్ర య దుజ్ఝితు మైహత."
(నై. స. 4. శ్లో. 23.)

"సీ. చనుఁ గప్పు దొలఁగ వాసనగాలి కెదురేఁగు బలువొప్పు నలుఁగులఁ బాయుకరణి;
నిదురవేసలి నూనెమిడి వీడఁ జిగురాకుఁ బొద దూఱుఁ గార్చిచ్చు గదియుంకరణిఁ;

బసిఁడిగాజులు పైకి వెసఁ ద్రోసి నునుఁదీఁగఁ దెమలించు నరిత్రాడు సెమకుకరణి;
మొలనూలు బిగియించి వేలఁది వెన్నెలఁ జొచ్చుఁ బిఱుదీయ కేటిలో నుఱుకుకరణి;
గీ. జడియ దళులకుఁ గురియుపుప్పొడుల మునుఁగు, మావికడ నిల్చు విరులనెత్తావిఁ గ్రోలు విషమసాయకు నేఁపుల విసివి విసివి, తనువుదొఱఁగంగఁ దలఁచి యవ్వనరుహాక్షి."
(మను. ఆ. 3. ప. 31.)

"సీ. పవమానమానవప్లవమానకై రవచ్యవమానరజము పైనంటఁ దివురుఁ;
గరసారసాగ్రతామరసాదిసాంద్రసీధురసాప్తిఁ గన్నీరు తుడువఁ గోరు;
మదనానిలప్రభాసదనామ్రకోమలచ్ఛదనార్చిపైఁ జూపు జరపఁ జూచు;
సలయాహితలతాకిసలయాగమలయాగనిలయానిలువ కూర్పు దెలుపఁ దలఁచుఁ,
గీ. గుంజపుటగుంజదళిపుంజశింజితంబు, వెగ్గలం బైనఁ జెవియొగ్గి వినఁ గడంగుఁ బంచశరభూతపరిభూతపంచభూత,ములఁ దదీయస్థలంబులఁ గలుపుకరణి." (వసు.3. ప.118.)

"శ్లో. ఇమా గిర స్తస్య విచింత్య చేతసా తథేతి సంప్రత్యయ మాససాద సా,
నివారితావగ్రహనీరనిర్ఝరే నభో నభస్యత్వ మలంభయద్దృశౌ."

"శ్లో. అథోద్భ్రమంతీ రుదతీ గతక్షమా ... ... ...
... ... ... మృదూని దూనాపరిదేవితాని." (నై. స. 9. శ్లో. 84-87)

"సీ. ప్రవిమలాక్షినభోనభస్యాంబుదములకు నవవృష్టిధార లై యవతరిల్లి;
... ... ... ... ... ... ...
గీ. వేఁడియశ్రులు నిగుడంగ వెక్కి వెక్కి, యేడ్వఁ దొడఁగె లతాంగి పృథ్వీశుమ్రోల మృదులపరిదేవనాక్షరోన్మిశ్రమధుర, కంఠకాకువికారకాకలిక యలర."
(శృం. నై. ఆ. 4. ప. 87.)

"చ. కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చిన భంగి నేడ్చె న
బ్జసరుహనేత్ర కొండచఱిఁ బెద్దయెలుంగున వెక్కి వెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నుల నీరు సోన లై
యుసిరికకాయలంతలు పయోధరము ల్దిగువారునట్లు గాన్." (కాశీఖండము.)

"ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు ద్రోవ ని
చ్చోటఁ భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన నెపం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందఁ గాన్." (మను. ఆ. 1. ప. 70.)

"ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచేఁ
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖ మైన మోముపయిఁ జేలచెఱం గిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్." (పారిజాతాపహరణము. ఆ. 1. ప. 133.)

"శా. ఆజాబిల్లి వెలుంగువెల్లికలు డాయన్ లేక రాకానిశా
రాజశ్రీ సఖ మైన మోమునఁ బటాగ్రం బొత్తి యె ల్గెత్తి యా

రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ రాజత్కరాంభోజ కాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగాన్. (వసు. ఆ. 4. ప. 52.)

ఇట్టి యేడ్పుపద్యము లన్నియు విని తెనాలి రామకృష్ణకవి "యల్లసాని పెద్దన యటునిటు నేడ్చె. ముక్కు తిమ్మన్న ముద్దుముద్దుగా నేడ్చెను. బట్టుమూర్తి బావు రని యేడ్చె" నని పల్కె నను నైతిహ్యము గలదు.

పయి యేడ్పువర్ణనములందు నైషధమున నశ్రుధారలు వర్ణింపఁబడినవి. కాశీఖండమునందును, మనుచరిత్రమునందును, నశ్రువులును, నేడ్చునప్పటి కంఠధ్వనియు సామాన్యముగ వర్ణింపఁబడెను. పారిజాతాపహరణమున నశ్రువర్ణనము విడిచి కేవలరోదనమే సకారణముగ వర్ణింపఁబడెను. ఇందుఁ బద్మసదృశ మగు మోమున గుడ్డ వేసికొని యవ్యక్తమధుర మగు కోకిలధ్వనివంటి ధ్వనితో నేడ్చె నని వర్ణింపఁబడినది. ఈవర్ణనమే రామరాజభూషణునిచే నలంకరింపఁబడినది.

రామరాజభూషణుని యేడ్పువర్ణనము నలంకరింపఁగోరి కావలయును దత్ప్రతిబింబముగా సంవరణచరిత్రమున నొక యేడ్పువర్ణనము గలదు గాని యది రామరాజభూషణునిపద్యమును మీఱఁ జాలదయ్యె.

"మ. బలవద్దర్పకశస్త్రికాహతులు సైఁపన్ లేక యవ్వేళ న
య్యలినీలాలక యంబరాంతపరిణీతాత్మీయఖాన్జాననో
త్పలినీబాంధవ యాచు నేడ్చెఁ గడు భూపాలైకరాగంబునం
గలకంఠీకులకంఠకోమలకుహూకారంబు తోరంబుగాన్." (సంవరణచరిత్రము.)

"ఇందు 'బలవద్దర్పకశస్త్రికాహతుల' కనఁగా బలవంతుం డగు మదించిన మన్మథునియొక్క శస్త్రముల దెబ్బలకుఁ దాళఁజాలక యేడ్చె నని సకారణముగ వర్ణింపఁబడెను. మొదటనే ఖన్నుఁ డగు ముఖచంద్రునకు మఱియు ఖన్నత గల్గునట్లుగఁ గోకిలకలధ్వనివంటి చంద్రవిరోధి యగు కుహూధ్వని మించున ట్లేడ్చె నని చమత్కరింపఁబడెను. ఇంతియకాక భూపాలునియందలి రాగముతో నేడ్చె నను నర్థాంతరము మిక్కిలి ప్రౌఢముగ నున్నది" యని చెప్పుదురు.

కాని బలవద్దర్పకశస్త్రికాహతుల నోర్వఁజాలక యేడ్చుట వింతగాదు. నాయికాశరీరసౌకుమార్యము నంతగా స్ఫురింపదు. కాఁబట్టి రామరాజభూషణుఁడు వర్ణించినట్లు వెన్నెలలకు వేఁగుచున్న దనుటయే స్వారస్యముగ నున్నది. మఱియు రామరాజభూషణుని పద్యమునం దాకాశమందలి చంద్రకాంతుల కోర్వఁజాలకయున్న నాయికను ముఖచంద్రకాంతులు బీడించు నని యామె ముఖచంద్రుని బైఁట చెల్లఁగున గప్పె నని సాభిప్రాయముగా వర్ణింపఁబడినది. మఱియు నాయిక రాజీవానన యనఁగాఁ బద్మమువంటి ముఖము గలది కావుననె చంద్రకాంతికి నోర్వఁజాలక యేడ్చె నను వర్ణనము మిగుల సందర్భముగా నున్నది. ఇఁక నామె యేడ్చుచుండఁగా నట్టి రోదనధ్వని కిన్నరస్త్రీలచే మేళగింపఁబడిన కాంభోజీరూప మగు వీణానినాదమువలె నుండె ననుట సారస్యముగా నుండును గాని భూపాలరాగముతో నేడ్చె ననుట సారస్యముగ నుండదు. రాగ మేళనముచేసి యేడ్చుట యనుభవవిరుద్ధము. అ ట్లేడ్చుటయు నొక యసాధ్యకార్యము గాదు. రాగజ్ఞానము స్వల్పముగఁ గలవారునైత మాపని చేయఁగలిగియుందురు. ఇచట భూపాలునియం దనురాగముతో నేడ్చె నను నర్థాంతరప్రాప్తికై యుట్టి యసంగతార్థము లక్షింపవలసివచ్చెను.

విరహవేదన సహింపలేక మూర్ఛిల్లి నాయిక శీతలోపచారములచేఁ దేఱినట్లు వర్ణించుటయు నొక కవిసమయముగ నగపడుచున్నది.

"శ్లో. స్ఫుటతి హారమణౌ మదనోష్మణా, హృదయ మ ప్యనలం కృత మద్య తే;
సఖి! హతాఽస్మి తదా యది హృ ద్యపి, ప్రియతమ స్సమ మవ్యవధాపితః.

శ్లో. ఇద ముదీర్య తదైవ ముమూర్ఛ సా, మనసి మూర్ఛితమన్మథపావకా;
క్వ సహతా మవలంబలవచ్ఛిదా, మనుపపత్తిమతీ మతిదుఃఖితా.

శ్లో. అథిత కాఽపి ముఖే సలిలం సఖీ, వ్యథిత కాఽపి సరోజదళై స్తనౌ;
వ్యథిత కాఽపి హృది వ్యజనానిలం, వ్యథిత కాఽపి హిమం సుతనో స్తనౌ.

శ్లో. ఉపచచార చిరం మృదుశీతలై, ర్జలజనాళమృణాళజలాదిభిః;
ప్రియసఖీనివహ స్స తదా క్రమా, దియ మవాప యథా లఘుచేతనామ్."

(నై. స. 4. శ్లో. 109-112.)

"వ. అని పలికి లీలోద్యానమందు సరసరసాల కోమలకిసల యాస్వాద కషాయకంఠ కలకంఠకామినీ కుహూకార కోలాహలపంచమంబు వీతెంచిన నప్పల్లవాధర యుల్లంబు జల్లన నొల్లంబోయి మూర్ఛిల్లిన.

ఉ. గొజ్జఁగనీరు సల్లె నొక కోమలి ద్రిప్పె లతాంగి యోర్తు లా
మజ్జికతాళవృంత మొక మానిని చందనకర్దమంబునన్
మజ్జన మాచరించెఁ గుచమండలి నొక్క వధూటి యెంతయుం
బుజ్జవ మొప్పఁ బాదములఁ బుష్పాడి యొత్తె విదర్భకన్యకున్."

(శృం. నై. ఆ. 2. ప. 139-140.)

'చెలియా! నీహృదయమందలి హారమణి విరహాగ్నిచే బ్రద్దలు కాఁగా నీహృదయ మనలంకృత మగుచున్న' దనునర్థముగల సంస్కృతవాక్యమున నీహృదయము నలరహిత మగుచున్న దను నర్థాంతరము స్ఫురించుటచే దమయంతి మూర్ఛిల్లెనని సంస్కృతమున నుండఁగా నట్టి చమత్కారమును దెనుఁగులోనికి శ్రీనాథుఁడు తేలేదు. సంస్కృతముననున్న యనలంకృతశబ్దమే గ్రహించి యెప్పటివాడుకప్రకారము కవి దాఁటి పోఁ దలఁచిన వీలుపడదు గాని యిచట సంస్కృతమునఁ గల యర్థద్వయమును దెప్పించుట మాత్రమంతగా దుర్ఘటము గాదు శ్రీనాథుఁ డీసందర్భమునఁ గల సరసవర్ణనము లాంధ్రీకరింపకున్నను మూర్ఛను మాత్రము విడువక యెట్టెటో తెచ్చిపెట్టెను. ఇట్లె కాళిదాసున కవసరము లేకున్నను బిల్లల మఱ్ఱి పినవీరభద్రుఁడు మాత్రము శకుంతలకు మూర్ఛను వర్ణింప మానలేదు. ఈయాచారమునే పెద్ద నార్యుఁడును, రామరాజభూషణుఁడును నడిపిరి కాని యందు రామరాజభూషణుఁడు వర్ణించిన మూర్ఛావర్ణనము సంస్కృతనైషధమునందువలె మిగుల హృద్యముగా నున్నది.

"వ. ఇట్లు బహుప్రకారంబుల ........అసురుసు రనుచు నుసురసు రనుచు నుల్లం బొల్లంబోయి మూర్ఛిల్లిన నప్పల్లవాధరిం గనుంగొని.

గీ. వరుస ననసూయయును బ్రియంవదయుఁ జేరి, యల్లనల్లన శిశిరకృత్యములు సేయఁ
గ్రమముతోడుత వెడవెడఁ గనులు దెఱచి, సమధికామోదతాళవృంతములు సూచి."

(శృం. శా. ఆ. 3. పే. 72.)

“ఉ. అని పలికి యక్కలికంఠకంఠి దీపించు తాపంబు పెల్లున మూర్ఛిల్లినం దోడిపల్లవోష్ఠ లల్లనల్లన
హల్లకంబుల హిమాంబు............ జలువ పుట్టించ నెట్టకేలకుం దెలిసె.”

(మను. ఆ. 3. ప. 53.)

“చ. అఱిమి కుమారమారుఁ డపు డగ్రతలంబున వచ్చి నిల్చిన
ట్లఱిమఱిఁ దోఁచినం గువలయాక్షి వడంకి కడంకఁ దూలి మై
మఱచి సగంధగంధగిరిమారుతపాతితవల్లికాభ యై
మొఱఁగిన సంభ్రమించి చెలు లుద్గతబాష్పతరంగితాక్షు లై.

సీ. మోహోపదేశతమోముద్రితము లైన కనుదమ్ముల హిమాంబు లునుపరాదు;
శ్రమబిందుతారకాగమఖిన్నకుచకోకములఁ జంద్రనామంబు దలఁపరాదు;
శీర్యదాశావృంతశిథిలశ్వాసలతాంత మసియాడ వీవన ల్విసరరాదు;
పటుతాపపుటపాకపరిహీణతనుహేమ మింకఁ బల్లవ పుటా ర్చిడఁగరాదు;

గీ. లలన కావంగకేలికేలీకలాప, సంతతాలీఢహృదయపాత్రాంతరాళ
పూరితస్నేహపూరంబుపొంగి పొరలఁ, జల్లని పటీరసలిలంబుఁ జల్లరాదు.

క. ప్లీ మంద యేమి సేయుద, మే మం దని మందలింత మే మందమె యిం
దే మంతయాన నడుగుద, మే మందఱ మనుచుఁ దరళహృదయాంబుజ లై.

సీ. జలశాలియడుగులఁ జిగురాకు లంటించి పొలఁతియూరు లనంటిపొరలఁ బొదివి;
కొమ్మచేదోయి చెందమ్ముల హత్తించి లేఁతబాహులు మృణాళికలఁ బెనచి;
యతిశిగుత్తపుగుబ్బ లలరుగుత్తులఁ గూర్చి కాంతచెక్కులఁ జంద్రఖండ మలఁది;
కలికిక్రొంగన్నులు కలువఱేకులఁ గప్పి లలన పెన్నెఱుల వాలంబు ముడిచి;

గీ. నవసేవగుణానుబంధబాంధవము లైన, చలువ లెన్నేనిఁ గావించి చెలువ చెలులు
నెలఁత కీవసులాభంబు నించు మంచు, నించువిల్కాని మరలఁ బ్రార్థించుటయును.

శా. ఆవ్యాకర్ణంబులలో సుధామయసుశైకాయత్తచిత్తేశసం
జ్ఞావర్ణంబు లొకింత వీను లెసయన్ సంజాతచైతన్య యై
పూర్ణుం జోడి సుధాంశుబింబసుషమాపూర్ణాభిషేకప్రమో
దావిర్భూతోత్పలవల్లి వోలెఁ గన్నుగల్వ ల్విచ్చె నాళీజనుల్.”

(వసు. ఆ. 3. ప. 179-183.)

రామరాజభూషణుని యీమూర్ఛావర్ణనము కొంతవఱకు శ్రీహర్షుని నైషధచ్ఛాయ నలంకరించు చున్నది. నైషధకావ్యమున శ్లేషభంగిని దమయంతి కామెహృదయమ్ము నలరహిత మగుచున్న దని స్ఫురించుటచే నామె మూర్ఛిల్లెనని వర్ణింపఁబడినది. వసుచరిత్రమున మన్మథస్ఫూర్తిచే గిరిక మూర్ఛిల్లినదనియు ‘నెలఁత కీవసులాభంబు నించుమంచు’ నను వాక్యమునఁ బదగుంభనచాతుర్యమున సభంగశ్లేషరూపముగ ఘటింపఁబడిన వసులాభశబ్దస్ఫురణముచే మూర్ఛనుండి తేఱె ననియుఁ జమత్కరింపఁబడినది. మఱియు నైషధాదులందు శీతలోపచారములు యథేచ్ఛముగా వర్ణింపఁబడినవి. ఇందట్లుగాక మిగులఁ జమత్కార

ముగ వర్ణింపఁబడినవి. నేత్రాదులందుఁ బద్మాదు లారోపితము లగుటం జేసి తద్బాద్యనిష్టహిమాంబుసేచనాది శిశిరోపచారములు చేయ వలసుపడ దని సయుక్తికముగా నిరాకరింపఁబడెను. పల్లవమేళనాది శిశిరోపచారము లన్ననో పదాదుల కారుణ్యాది గుణసంబంధముచే నర్హతమము లని యుక్తి కల్పింపఁబడెను.

"మోహాపదేశ" యను పద్య మయ్యలరాజురామభద్రకవి దను నైతిహ్యము సకలచరిత్రకారని రాకృత మగుటంజేసి యావిషయ మంతగా నిటఁ జర్చింప నవసరము లేదు కాని యొక్క ముఖ్యవిషయము మాత్రము గ్రహింపవలసి యున్నది "మోహాపదేశ" యను పద్యమునఁ గొన్నివిధము లగు శీతలోపచారముల సయుక్తికముగ నిరాకరించి "జవరాలి" యను పద్యమునఁ గొన్నివిధము లగు శీతలోపచారములు సయుక్తికముగ గ్రహింపఁబడినవి. కాన నీరెండుపద్యములు నేకకవికృతములు. నేకసందర్భగతములు నని చెప్పుట మిగుల యుక్తియుక్తముగ నుండును. ఇట్టిశ్లేషము లనేకముగ వసుచరిత్రమున రామరాజభూషణునిచే రచింపఁబడి యుండుటచే నీమాత్రపు శ్లేషపద్యము నతఁ డొకనివద్దఁ గొని సంగ్రహించుకొనె ననుట యనుచితము.

"సీ. గిరికన్య మేన నేకీభవించినఁ గాని తియ్యవిల్తుని నిరోధింపరాదు;
సింధుజ నెద నుంచి సిరుల మించినఁ గాని మిహికాంశుఁ గనుసన్న మెలఁపరాదు;
శుభవాణి యభిముఖస్ఫురణఁ జూపిన గాని పఱచుటంచలఁ గ్రిందుపఱుపరాదు;
పద్మినిఁ గరముఖ ప్రౌఢిఁ దేల్చినఁ గాని రేల ముమ్మరము వారింపరాదు;
గీ. నేర్పున నటించు నృపతి ధ్యానెలఁతఁ దలఁచి, తలఁచి సగ మగుసాత్త్వికోదయదశాను
భావములఁ జెందు నున్మద ప్రసవబాణ, బాణమగ్నత గాంచుఁ దాపము వహించు."

(వసు. ఆ. 3. ప. 94.)

ఇట్టి యర్థద్వయభాసురరచనములు వసుచరిత్రమున లెక్కకు మీఱియున్నవి. మఱియు నీపయి పద్యమురచనయును "మోహాపదేశ" యను దానిని బోలియున్నది. ఇంతియగాక శుక్తిమతీకోలాహల సమావేశము, కపటయతిప్రసంగము మొదలగు సందర్భములు పూర్తిగ నర్థద్వయవిభాసురములగు నట్లు సంఘటింపఁబడినవి. ఇట్టి మహాకవి వేఱొక కవిచేఁ బద్యము చెప్పించుకొని స్వగ్రంథమున నిలిపె ననుట మిగుల పరిహాసనీయ మగు విషయము.

ప్రకృత మనుసరింతము. వసుచరిత్రమునకుఁ బిమ్మటఁ బుట్టిన ప్రబంధము లన్నియు నిందలి యనేక రచనములతో నలరారుచున్నవి.

"మ. కమనీయాకృతియోగ్యకీర్తనములం గన్పట్టు నాశ్యామ
యాసుమబాణాంబక యాయమూల్యమణి యాచొక్కంపుఁబూబంతి యా
సుమనోవల్లరి యాసుధాసరసి యాసొంపొందుడాల్దీవి యా
కొమరుంబ్రాయపురంధ్రి యాచిగురుటాకుంబోఁడి నీకే తగున్." (వసు. ఆ. 2. ప. 52.)

"మ. తఱచు ల్వేయు నిఁకేల యాతెఱవ యాదానిమ్మపూరెమ్మ యా
నెఱిగ ప్రంపుటనంటికొమ్మొలక యానిద్దంపులేమావి యా
మెఱుఁగుంబంగరుతీవ యాననజిరామేజ్జ్లోదు వాలారునుం
గఱుసుంగైదువునాకడిందినవలాకన్నాకు నీకే తగుఁ." (అచ్చ. రా. బాల. ప. 138.)

"మ. పలుకు ల్వేయు నిఁ కేల భూరమణ ! యాబంగారుకీల్బొమ్మ యా
పలికప్రంపుటనంటికొమ్మొలక యావాల్గంటి యాశ్యామ యా

యలివేణీఘనచూళికాభరణ మయ్యంభోజపత్త్రాక్షి యా
తలిరుంబ్రాయపుఁగల్కి రాచిలుక యాతన్వంగి నీకే తగుర్." (రసిక... రామము. ఆ.2.-పే.26.)

కూచిమంచి తిమ్మకవి యిట్లు తన యితరగ్రంథములలో వసుచరిత్రపద్యముల ననురించుట యు టుండఁగా రసికజనమనోభిరామ మను నీగ్రంథమును కేవలము వసుచరిత్రము ననుసరించియే రచించిన ట్లగపడుచున్నది. ఇందలి యనేకములగు పద్యముల నడకలు, కల్పనములు, కథపట్టులును, వసుచరిత్రము ననుసరించియున్నవి. కొన్నియెడల మనుచరిత్రాదుల యనుసృతులును గలవు. కాని తిమ్మకవికిఁ బద్యములను నింపుగాఁ జెప్పుటలో నున్న చాతుర్యము కథనడపుటలో నగపడదు.

"క. అని కమలజుఁడు ఋతుధ్వజ, జనపాలకుచరిత దివిజసంయమి కెలమిన్
వినిపించిన విని యాతఁడు, మనమున నత్యంతహర్షమగ్నుం డయ్యెన్."

పైపద్యము రసికజనమనోభిరామమునం దుది నున్నది. దీనినిఁ బట్టి చూడఁగా నీగ్రంథమునఁ బ్రధాననాయికానాయకులు సుశ్యామా ఋతుధ్వజులె యని తేలుచున్నది. కాని యిందుఁ బ్రధాననాయకులగు వారి సమావేశముతోఁ గథ ముగింపక వారికి స్త్రీశిశువు పుట్టుటయుఁ బిదప సుశ్యామ యూరకయ ఋతుధ్వజుని విడిచి పోవుటయుఁ బిమ్మట నక్కన్యక పదివేలవత్సరములప్రాయమున నొక కురూపియగు వేయియేండ్లయీడుగల మునిని బెండ్లియాడుటయు మొదలగు నసంగతవిషయములు వర్ణింపఁబడినవి.

గీ. వనజముఖి నేను వేయేండ్లవాఁడ నీవు, బహుసహస్రాబ్దములదాన వహహ ! వృద్ధ
వైన నీకును బాలుఁడనైన నాకు, ఘటన యిం కెవ్విధమునఁ గాఁ గలదు చెపుమ."

అని యి ట్లతివిరసముగ వర్ణింపఁబడెను. ఇట మనుచరిత్రములోని వస్త్వైక్యాభావమును దిమ్మకవి బాగుగఁ జూపఁగ లైను.

శకుంతలాపరిణయ (పినవీరభద్రుని) మనుచరిత్రముల రీతినె యిందును ఋతుధ్వజుఁడు వేఁటకు వెడలినట్లు వర్ణింపఁబడెను. పిదప వసుచరిత్రమునందువలె వనములో విహరించుచు ఋతుధ్వజుఁ డొక సంగీతధ్వని విని యాశ్చర్యపడి యది యెవ్వరిదో యరయుటకై నర్మసచివు నంపఁగా నతఁడు చని మఱలివచ్చి చెలులతోఁ గూడి యొక స్త్రీ పాడుచున్న దని యామెను వర్ణించిచెప్పుటయును, రా జనురక్తుఁడయి యాతనినే యామె సంఘటనమునకై యంపుటయును మొదలగునవి వసుచరిత్ర రీతిని వర్ణింపబడినవి. తుదిదాఁక నిట్లు మక్కీకి మక్కీగాఁ గథ నడపుట బాగుగ నుండదనియో, మూలకథ ననుసరించుతలంపుననో, కవి పిమ్మటఁ గొన్ని మార్పులను జేసియున్నాఁడు. అప్పుడైనను మనుచరిత్రములోని ప్రవరవరూథినీ సమావేశసందర్భమును, వసుచరిత్రములోని కోలాహలశుక్తిమతుల సమావేశ సందర్భమును కేవలము మఱచిన ట్లగపడదు.

వసుచరిత్రమున నాయికయొద్దకు యతివేషముతో నర్మసఖుఁ డేఁగినసందర్భ మతిమనోహరముగ వర్ణింపఁబడియుండ నిం దక్కథపట్టు మిగుల విరసముగా వర్ణింపఁబడెను.

"గీ. దూత వగుటను నోరికిఁ దోఁచినట్లుఁ, దివిరి మోమోడ కాడెదు దిట్ట వగుచుఁ
గటకటా! ధూర్త! మేము నీకంటె కిప్పు, డింతయెల్లిదమైతి మింకేమిచెప్ప." (రసిక.ఆ.3.-పే.32.)

అని యి ట్లతివిరసముగా వర్ణింపఁబడెను. అరయనరయ నిప్పట్టున మనుచరిత్రములోని యాక్రిందిరీతి ననుసరింపఁ బోవుటచే నిట్టివైరస్యము సమకూడిన ట్లగపడుచున్నది.

"ఉ. ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించుటా
గింతియ గాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవచొప్పు నీ
కింత భయంబులే కడుగ నెల్లిద మైతిమె మాట లేటికిన్." (మను. ఆ. 2.)

ఈపద్య మెంత సరసముగా నున్నదో తిమ్మకవిపద్య మంత విరసముగా నున్న దనుటకు సందేహము లేదుగదా !

నర్మసఖున కీరీతి పరాభవము జరుగుచుండు మహావినోదసందర్భమున ఋతుధ్వజుని బ్రవేశ పెట్టుటయు, రాజు తన ప్రేమమును కులుకనగా వెల్లడిచేయుటయుఁ జెలులు రాజునకు బుద్ధిచెప్పి సుశ్యామను దోడ్కొనిపోవుటయు, రాజు వెంబడించి బోధించి ప్రార్థించుటయుఁ జెలులు రాజుం గసరి యచ్చటినుండి నాయికం దోడ్కొనిపోవుటయు మున్నగువిషయము లతివైరస్యముగా వర్ణింపఁబడెను.

"గీ. అవనినాయక ! సుశ్యామయనెడుపేర, నలరు గంధర్వరాజకన్యాలలామ
యివ్వెలందుక దీనికై యిట్లు వగలఁ, దగులఁ దగునయ్య మీవంటి తగవరులకు."

... ... ... ... ... ... ... ...

"క. అనుమాన ముడిగి వినుమా, నను మారునిబారిఁ ద్రోచి ననఁబోఁడి వెసం
జనఁ జూచెద వలవిధి నెక్కొను నిక్కల నిన్నుఁ గట్టికుడిపెడిఁ జుమ్మీ !"

... ... ... ... ... ... ... ...

"క. అని పలుకు నెడలఁ జెలు లెల్ల నిదేమిటి జోలి సరి బళా ! పదపదరే !
యని చెలిఁ దోడ్కొని గొబ్బునఁ, జని రంత విభుండు గుండె ఝల్లన లీలన్."

తుట్టతుద నుభయులను సమావేశపఱుపఁ దలఁచినప్పు డీరీతి విరసప్రసంగము చేయించుట రసికజనమనోభిరామముగా నుండునా ?

మఱియు, నీనాయిక పరకీయ యనియు నిట్టిదానికై యింతవలపు తగదనియు,నర్మసచివుండును నాయికచేఁ దిరస్కరింపఁబడినవాఁ డగుటచేఁ గావలయును రాజునకు బుద్ధిచెప్పినట్లు వర్ణింపఁబడెను.

"క. వేలాగుల నన్యవధూ,లోలుఁడవై నాన యుడిగి లోఁగెదు ధరణీ
పాల విను 'కాముకస్య కు,తో లజ్జా' యనెడు నుడువు తుది నిజ మయ్యెన్."

... ... ... ... ... ... ... ...

"క. పురములు విడిపాఱిరె ? కుల, తరుణులు నెతపడరె ? బుధులు తప్పెన్నరె ? నీ
పరదొరలు నగరె?ఘంతలఁ, గరమడలరె?ప్రజలు నీప్రకారము విన్నన్." (రసిక.ఆ. 3. ప.39.)

ఏనర్మసఖుఁడైన రాజున కీరీతిని బుద్ధిచెప్పెనా ? వసుచరిత్రమున గిరికకై పరితపించు వసు రాజును నర్మసఖుఁ డెట్లూరడించెనో యరయుఁడు.

"చ. జనపతి యిట్లు పంచశరశాతశరాహతిఁ జంచలింపఁ గాఁ
గని హితమంత్రి పల్కు మహికాంత నిరంతరచింత నింత విం
తనొగులు పూన నేల ? లలనానలినాస్త్రుఁడ వీవు నిన్నుఁ గ
న్గొనినలతాంగియాలువు మనోభవుఁ డింతకుఁ గొల్లలాడఁడే.

"చ. అలివగురుండు తావకపదానతుఁ, డంగనఁ గన్నతల్లి య
ద్భుతభవదీయశౌర్యరసపోషితజీవన, కొమ్మ నెచ్చెలుల్
సతతము నీకథ ల్వొగడ జాణలు, బాల భవద్విలాసమో
హిత, హితకార్యసంగతికి నియ్యెడ సందియ మంద నేటికిన్." (వసు. ఆ. 3. ప. 87, 88.)

మఱియు నిందు సుశ్యామ విరహపీడిత యయియుండఁ జిలుకరాయబారమును గల్పించినాఁడు. ఇది వసుచరిత్రములోని మంజువాణిదూత్యమును బూర్తిగాఁ బోలియున్నది.

"చ. పకపకనవ్వి యోవసునృపాలక బాలిక దూఱెదేల ? సా
రెకుఁ బరతంత్ర లింతులు పరింతురె కాంతులఁ దమ్ముఁదామ క
న్యకలకు నేరమా? యది యనన్యగతిన్ సుదతిన్ మనోజుబా
రికి నెరఁజేసి లోఁ గనికరింపనివారివికాక నేరముల్." (వసు. ఆ. 4. ప. 89.)

"ఉ. తావకశైలభేదనకథాబిరుదాంకము లేము పేర్కొనం
దా విని మెచ్చ నూర్చి వనితామణి నిత్యకఠోరముల్ కుల
గ్రావము లండ్రు, వానిఁ బదఘట్టనఁ గీటడఁగించినట్టి గో
త్రావరుఁ డింక నేమిటఁ గరంగు నయో యని నించు బాష్పముల్." (వసు. ఆ. 4. ప. 109.)

"శా. ఏమేమీ! జగతిం గఠోరములు శైలేంద్రంబు లౌఁ గాఁ దదీ
యామేయస్మయభేది యంతకుఁ గఠోరాకారుఁ డౌనే కదా
యామేటిన్ ధృతివాపి చూపులనె యూటాడించువా రెంతవా
రో మీనేక్షణ తా నెఱుంగదె తదారూఢప్రభావోన్నతుల్." (వసు. ఆ. 4. ప. 113.)

"చ. కటకట రాజచంద్ర! యిది కర్జమె నిర్జరకన్యకామణిన్
దటుకున ఘోరమారనిశితప్రదరంబుల పాలు చేసి యి
చ్చటి కిటుచేరి నీవును విశంకటతాపభరాలసుండవై
యటమటఁ జెందెదేల? పదమా ముద మార నెలంతచెంతకున్."

(రసికజనమనోభిరామము ఆ. 5. పే. 70.)

"శా. నీమేమీ! రమణీశిరోమణి భళా! యిట్లాడి నిన్నంపెనా?
నామీఁదం గలకంఠకంఠి కెదలోనం గూర్మి వాటిల్లెనా?
భామారత్నముబోటు లిప్పుడిటఁ దోడ్పాటై విడంబించిరా?
నీమేల్పల్కుఁ దాఁచనేల? చెపుమా నీరోద్భవశ్రేష్ఠమా." (రసిక. ఆ. 5. పే. 71.)

పయిపద్యముల నరసినచో రామరాజభూషణుని కవితాధోరణికిని దిమ్మకవి కవితాధోరణికిని గల తారతమ్యము స్పష్టపడును. ఇఁక మణిహారసందర్భములోని పద్యము లరయుఁడు.

"మ. కమనీయద్యుతిధామమా! విమలముక్తాదామమా! సేమమా!
కమలామోదకుఁ దత్సఖీసమితికిం గల్యాణమా! తన్మరా
ళమయూరీశుకశారికలకెల్లన్ భద్రమా తెల్పుమా
ప్రమదారత్నముపేరుగా నెద నినుం బాటించి ప్రార్థించెదన్."

"ఉ. గ్రావసుతాకుచాగ్రపరిరంభనిగుంభసుఖోపలంభసం
భావితభావిమత్కరవిమర్దన కోడకుమీ విశుద్ధము
క్తావళి! బాలికానవసమాగమయోగ్యమహోపలాలన
శ్రీ వెలయింతుఁ గాని నినుఁ జిక్కులఁ బెట్టఁ జుమీ రయంబునన్."

"శా. శుక్తిక్రోడకుటీగుహావసతి వై సూచ్యగ్రసంస్థాయి వై
ముక్తాహారమ వై భజించితి గదా! ముగ్ధాకుచద్వంద్వసం
సక్తిం దాదృశభూతి తావకకృపాసంసిద్ధి లే కబ్బునే
ముక్తాహారత నున్నయంతనె తలంపు ల్నింపు నా కింపుగాన్."

(వసు. ఆ. 4. ప. 100, 104, 105.)

"ఉ. సేమమె గోముమీఱు రతిచేలి నిగారపుఁబైఁడిబొమ్మ క
య్యామని పువ్వుఁగొమ్మకు నొయారపువేలుపురాచకొమ్మకుం
గామునిగీముతోట వలిగ్రపుదిమ్మకు ముద్దుగుమ్మ కు
ద్దామవచోనిరూఢి మణిదామమ! ప్రేమ మెలర్పఁ జెప్పుమా."

"ఉ. అక్కమలాయతాక్షి నను నక్కున నొక్కి కవుంగలించుచోఁ
జిక్కులఁ బెట్టి నిన్నడలఁ జేయుదు నంచుఁ దలంపఁ బోకు నా
యక్కఱఁ దీర్చి యాదుకొనుమా మణిహారమ! పేరు మీఱ న
మ్మక్క! పరోపకారవిహితాత్ములిలం దమసేగి యెంతురే?"

"గీ. కలికియురమున నెత్తావికలప మలఁది, విరిసరంబులు దమి నించువేళఁ జాల
వఱలఁ జేయుదుఁ గాని మే ల్మఱచి యేను, నిన్నుఁ జిక్కుల నిడఁ జుమీ బన్నసరమ!"

"ఉ. సాంకవగంధసార ఘనసార మృగీమదసార సౌరభా
లంకృతమైన వేల్పునవలాతలమిన్న యురంబుపై నిరా
తంకగతిన్ సుఖించు నమితమ్మగు భాగ్యము నీకు నబ్బె నా
కింక మఱెన్నఁడబ్బు వచియింపఁ గదే మణిహారరాజమా!" (రసిక. ఆ. 5. పే. 71, 72.)

ఇంక నిట్టి కథపట్టులందలి యనుసృతులేగాక పద్యకల్పనములందును ననేకములు గనుపట్టుచున్నవి. వానిలోఁ గొన్నిటి నిట నుదాహరించెద.

"మ. చతురాస్యు ల్పురుషోత్తము ల్బుధగురు ల్సర్వజ్ఞమూర్తుల్
... ... ... ... ... ...
క్షితిదేవుల్ పురి దేవతామహిమలం జెన్నొందుట ల్చిత్రమే. (వసు. ఆ. 1. ప. 97.)

"సీ. బుధవత్సలులు కళాపూర్ణులు పరచక్రహారణులు కువలయాహ్లాదకరులు;
వసుసమన్వితులు సర్వజ్ఞశిరోమణుల్ ... ... ...
గీ. ... ... ... రాజు లలరుదు రప్పురరాజమునను."

(రసిక. ఆ. 1. పే. 6.)

"సీ. రాగంబు మూర్తమై రహిఁ ద్రోవఁ జూపు పెంపునఁ బదచ్ఛాయ మున్మున్న నిగుడ;
... ... ... ... ... ...

నీవిఁ జుట్టిన భోగి నిట్టూర్పుగమి నుబ్బి నడలేనా నొడ్డాణ మెడలి తూల

... ... ... ... ... ...

తే. గీ. కటికరటి కంఠపీఠిపైఁ గంతుఁ డనెడి, బిరుదుమావంతుఁ డేసిన పీలిజల్లి

పెంపు గను పెన్నెరులగుంపు ప్రిదిలి జాఱ, వచ్చె నొకసతి వసుమతీవరుని జూడ."

(వసు. ఆ. 6. ప. 11.)

"చ. తులుకుమిటారి గబ్బిచనుగుబ్బలవ్రేఁగునఁ గౌనుఁ దీఁగ కం

పిలి యసియాడ ముంగురులు బిట్టు మొగంబునఁ జిందులాడఁ గం

చెలముడి వీడఁ దత్తరపుఁజెయ్యుల నించుక నీవి యూడ వి

చ్చలవిడిఁ జూడ వచ్చె నొకచంద్రనిభాస్య నృపాలమన్మథుఁన్." (రసిక. ఆ. 1. పే. 12.)

"చ. తరువులపొంతఁ బొంచి వసుధావరమిత్త్రుఁడు గాంచె నచ్చటం

దరుణిఁ దమోవినీలకచఁ దామరసోదరసోదరప్రభన్

... ... ... ... " (వసు. ఆ. 2. ప. 25.)

"మ. తరుమూలంబులపొంతఁ బొంచి సచివోత్తంసంబు వీక్షించె భా

స్వరకార్తస్వరవిగ్రహన్ సమదచంచచ్చంచరీకాలకన్

... ... ... ..." (రసిక. ఆ. 2. పే. 23.)

"సీ. ఘనులఁ గొండలపాలుగాఁ జేసిన కొఱంత ద్విజరాజు నెపుడుఁ గుందించు కొదువ;

కువలయంబు దినంబు కూల్చునాడిక ... ... ...

తే. నలువ వారించుకొనియెఁ దన్నగరసతుల, నెఱికురులు ముద్దుమోములు నిడుదకన్ను

లలఁతిమోవులు బిగిగుబ్బ లరిదినాభు, లలరుఁదొడలును మృదుపదంబులు నొనర్చి."

(వసు. ఆ. 1. ప. 107.)

"సీ. చందమామకు లోనఁ గం దొనర్చినతప్పు పసిఁడికిఁ దావి కూర్పనికొఱంత;

దొండపంటికిఁ దీపి నిండఁజేయని రట్టు, ... ... ...

గీ. మలపుకొనఁ జాలు నద్దిర! జలజభవుఁడు, పూని యిమ్ముద్దుతలిరాకుఁబోఁడి వదన

తను రదాంశుక లోచన స్తన కపోల, సక్థి పద యుగ్మ కమ సొం పెసఁగ నొనర్చి."

(రసిక. ఆ. 2. పే. 23.)

"ఉ. ఏగతి యోగిరూపము వహించెదొ? యేగతిఁ బ్రౌఢి మించెదో?

యేగతి వేళ గాంచెదవొ? యేకత మున్న వధూజనంబు నీ

వేగతిఁ బల్కరించెదవొ? యిష్టసఖా! భవదీయనీతికా

ర్యాగతి నేఁడు చూతముగదా! యని యంపిన నాక్షణంబునన్." (వసు. ఆ. 2. ప. 78.)

"శా. ఏచందంబున నింతిచెంత కఱలే కీవేఁగి ధర్మించెదో?

యేచందంబున మాటలాడి మదిలో నింపొందఁగాఁ జేసెదో?

యాచంద్రాననపొందు నా కెటువలెన్ హత్తించెదో? మేలుసీ
వాచాప్రౌఢిమ నేఁడు చూతముగదా బాలేందులీలాసఖా!" (రసిక. ఆ. 3. పేజీ. 30.)

"చ. కటకట! మమ్ము నొక్కత్రుటికాలముఁ బాయనిదాన వొంటిమై
నెటువలె వచ్చితమ్మ! చెలి! యిచ్చటి ప్రేంకపుఁదేనెవాఁక లీ
వెటువలె నీదితమ్మ తెరు వెల్లను బుప్పొడి నీపదాంబుజం
బెటువలె నోర్చెనమ్మ! తరుణీ! తగునమ్మ కడిందిచైదముల్." (వసు. ఆ. 3. ప. 121.)

"ఉ. కొమ్మరొ! మమ్మరంపువెతఁ గుందుచు ని ల్లెడఁబాసి యిమ్మెయి
న మ్మఱచేసి యొంటిగ వనంబున కేటికి వచ్చితమ్మ! నె
త్తమ్ములఁ గేరు నీమృదుపదంబులు కందెఁ గదమ్మ! మేలు మే
లమ్మకచెల్ల! నీ బలుగయాళితనమ్ములు చెప్పఁ జిత్రముల్." (రసిక. ఆ. 4. పే. 52.)

"సీ. పవమానమానవప్లవమానకైరవచ్యవమానరజము మైనంటఁ దివురు;
... ... ... ... ..." (వసు. ఆ. 3. ప. 118.)

"సీ. అసమానవాసనాలసమానవల్లికాప్రసవమంజరులపై మునరి మునరి
... ... ... ... ..."
(రసిక. ఆ. 5. పే. 76.)

ఇట్లే వసుచరిత్రములోని కల్పనములను గథపట్టులను ననుసరించి చెప్పినవారిలో ముఖ్యులగ్రంథములు పిల్లవసుచరిత్రము లని ప్రసిద్ధిని జెందియున్నవి. వానిలోఁ గనుపర్తి యబ్బయామాత్యుని కవిరాజమనోరంజన మను నామాంతరముఁ గల పురూరవశ్చరిత్రము మిగుల రసవంతముగా నున్నది. కాని వసుచరిత్రము వంటి ప్రౌఢిమ గలిగియుండలేదు. అడిదము సూరకవి ప్రణీత మగు కవిజనరంజనములోని వర్ణనములును సరసముగనేయున్నవి. కాని యిందుఁ గథాభాగ మేమియుఁ గానరాదు. పురవర్ణనము, హరిశ్చంద్రవర్ణనము, చంద్రమతీవర్ణనము, విరహవర్ణనము, చంద్రాద్యుపాలంభస్తుతులు, వివాహవర్ణనము, చంద్రమతికి, బుద్ధులు గఱపుట, కేళీగృహ రత్యుపరతి వర్ణనములు ననునవి మాత్రమే గలవు. మొత్తముమీఁద నిందుఁ గథాభాగము హరిశ్చంద్రుఁడు చంద్రమతిని బెండ్లాడి సుఖించుట. అబ్బయామాత్యుఁడు కవిజనరంజనమునకు వన్నెఁ దెచ్చుచుఁ గవిరాజమనోరంజనమును రచించెను. కాని యిందును వర్ణనాభాగము లన్నియు వసుచరిత్రముచు జూచి చేసినవే యని స్ఫురింపకపోదు. కల్పనా విషయమున నిందుఁ గొన్నిచోట్ల వసుచరిత్రచ్ఛాయ లున్నను దద్భిన్నము లగు కల్పనావిశేషములును ననేకము లున్నవి. కృష్ణకవి శకుంతలాపరిణయము సైతము వసుచరిత్రముతోఁ బోల్పఁదగి యుండలేదు. కాని యిందు వసుచరిత్రములోని పద్యములయుఁ గల్పనలయు రీతు లత్యధికముగ సంగ్రహింపఁబడుటచే దీనికీపేరు వచ్చినదని తోఁచుచున్నది. పైమూఁడుగ్రంథములలోని వసుచరిత్రరీతులు కొంతవఱ కుదాహరించి యీయనుసృతి ప్రదర్శనమును విరమించుచున్నాను.

మొదట నొక్కొక్కరి యనుసరణములును, బిదప నేకాధికానుసరణములును నుదాహరించుచున్నాను.

"మ. జననాథోత్తముఁ డింతిఁ జూడ నని మేషత్వంబుఁ గాంక్షించు న
య్యనిమేషత్వము క్రాలుత కాంతముఖచంద్రాసేవనానందవా

సనఁ బ్రాపించినఁ గోరు నవ్వు దనిమేషస్వామిభావంబుఁ గ
న్గొన నెందుర్ నృపు లుత్తరోత్తరపదానూనస్పృహాచంచలుల్." (వసు. ఆ. 2. ప. 64.)

"తే. ఇంతిసౌందర్యరేఖాదిదృక్షచేత, నెపుడు తెర వంతు రను వంచినపుడు గోరు
నిమిషపరికల్పితాంతరాయము విదిర్ప, భూమిపతులందు వాంఛాప్రపూర్తి గలదె?"
(కవిజనరంజనము. ఆ. 3. ప. 37.)

పయి రెండుపద్యములందును వసుచరిత్రపద్యమే మిగుల సరసముగ నున్న దని వేఱుగ వ్రాయ వక్కఱలేదుగదా! ఇట్లె తలఁచుగ నంతటను గ్రహించునది. ఈపద్యచ్ఛాయనే కొంతవఱకు సూరకవి రెండవయాశ్వాసమునందలి పదునేనవ పద్యమును సైతము రచించెను.

"చ. అలికులవేణి యిట్లు వలయాంకబిసాంకురపన్నగాళికిన్
జల మరి చల్లగాలికిని జక్కొరఖాణపుఁదేఁటి దోలు పూ
విలుతు హయాళికిం జిగురువిందుల నీలి గయాళికిన్ హలా
హలగుళికాభ దుర్మద ఘనాళికి నాళికి లోఁగి యార్తలోన్." (వసు. ఆ. 3. ప. 112.)

"క. అళుకొందె నవ్వ డాతో, య్యలి మధుకరనికరశుకపికావళికిన్ జా
బిలికిన్ జిలిబిలి వలికరు,వలికిన్ విరివిలుతుసెక్కవ హళాహళికిన్."
(కవిజనరంజనము. ఆ. 2. ప. 19.)

"సీ. నటదీశహాసవిస్ఫుటితవేధోండరేఖలఁ దోఁచు వరణాంబుకణిక లనఁగఁ;
బెల్లుబ్బు నిర్లెపె స్వెల్లి సెల్ల పదార్థములు మున్గఁ బొడము బుద్బుదము లనఁగ;
రవికి మందేహానిర్మథనసాధనము లై వచ్చిన ద్విజమంత్రవర్ణము లన;
హరిపదంబుచు నీశుశిరము నైన నభంబున నభోగతులు నించు నన లనంగఁ;
తే. జరమగిరి యను మరకాఁడు జలధిసరణిఁ, దరణి డించిన నతఁడు తత్సలిలమగ్న
విమలముక్తాఫలంబులు వెలికిఁ జొనిపె, ననఁగ నవతారకానికాయంబు లడరె."
(వసు. ఆ. 4. ప. 15.)

"సీ. ధ్వాంతదంతావళోత్కరపుష్కరోద్ధూతగగనగంగాపయఃకణము లనఁగ;
శర్వతాండవవిద్యదృష్టిసమాగతనిర్జరీహారమౌక్తికశ్రేణు లనఁగ;
నభ్రకళిందజాహ్రదమున నిండార విరిసిన తెలి గల్వవిరు లనంగ;
భావినిశాచంద్రపరిణయంబున కిడు దిక్కుద్యముల పిండిచుక్క లనఁగఁ;
గీ. గ్రిక్కిఱిసె నొక్కమొగి నెల్ల దిక్కులందు, క్షీరఘనసారపాటీరతారహార
హీరపారదనారదశారదాభ్ర, గౌరరుచి మీఱఁ దారకావార మపుడు."
(కవిజనరంజనము. ఆ. 3. ప. 63.)

## కవిరాజమనోరంజనము

"సీ. పొన్నపూపొడి నేల పొదివితె చెలి యది పొడమె బల్దీవిపైఁ బొదువవలదె;
చెలువ మాటితి వేల? కలువచా లదియెుఁ గప్పఁగ రాదె మిన్నులబావికడది;

మొగడతమ్ముల నేలమూసితే సతి మూయఁ దగదె మానసభూనిధానము లవి;
తరుణి పూరెమ్మ రొత్త వదేల యది హేమ శిఖరిదాపుది బయ ల్సేయఁ దగునె;
తే. యనుచు రసమర్మసరసోక్తు లాడునట్టి, జట్టికాంద్ర యథోచితసరసవచన
రచనఁ దేల్చుచు వివిధవిభ్రమము వఱల, విరులు విలుతురు పుష్పలావికలు వీట."
(వసు. ఆ. 1. ప. 109.)

"సీ. వెలకుఁ జూపవు పొన్నవిరి యంతగోప్యమా యది యనంటులమోయ నయ్యోఁ జుమ్ము;
కప్పకో నేల బంగారమా పువుబంతు లవి సువర్ణలతోదయములు సుమ్ము;
మూసిపెట్టెదు మల్లెమొగ్గ లింత బ్రమా? యవి సుధారాశిచేరువవి సుమ్ము;
దాఁచుకొంటివి యరుదా నల్లగలువపే రది యగాధసరోవహానము సు మ్మ;
"తే. టంచు ముసిముసి నగవు లన్యోన్యవచన, మంజులవ్యంగ్యచాతురీవ్యంజకములు
గా విటుల కమ్ముదురు విరు ల్కాముకైక, జీవికలు పుష్పలావికల్ సెలఁగి పురిని."
(కవిరాజమనోరంజనము. ఆ. 1. పే. 3.)

"క. వీనుల విం దై యమృతపు, సోనలపొం దై యమందసుమచలదళిసీ
గానముక్రం దై యాస్వన, మానందబ్రహ్మ మైన నధిపతి వల్కెన్."(వసు. ఆ. 2. ప. 14.)

"శా. ఆగాంధర్వనిసాదవైభవము బ్రహ్మానంద మై యాదమై
భోగేచ్ఛాంకురకంద మై శ్రుతిసుఖోద్భూతామృతస్యందమై
వాగర్థైకరసానుభూతికుతుకస్వచ్ఛందమై యొప్పుచున్
రాగాంభోనిధి ముంచి యెత్తె మునిచంద్రస్వాంతకంజంబులన్."
(కవిరాజమనోరంజనము. ఆ. 4. పే. 53).

"సీ. క్షణవిలాసమె కాని గజనిమ్మపండులు సరియె దుర్గాధివాసమున మనినఁ;
బైపూఁతరుచిగాక ప్రతియె కిన్నరకాయ లరిది మేరువు తలయంపి నిడినఁ;
బ్రొద్దుపన్నె లె కాక యుద్దియే తమ్మిమొగ్గలు చక్రములఁ గూడి దళముకొనినఁ;
గాఁకచాయలె కాక కనకకుంభము లీడె శ్రీకరులశిరోగ్రసీమ నున్న;
తే. మిళితఘనసారమై నున్న మిగిలి కదిసి, యంతరము సూత్రమున కీక యలరి జోడు
వదల కమితరసప్రౌఢిఁ బొదలి మెఱయు, నన్నుతలమిన్న వలిగుబ్బచన్నుఁగవను."
(వసు. ఆ. 2. ప. 42.)

"సీ. ఘనసారసారసాంగత్యంబు నొల్లని గజనిమ్మపండ్లచక్కందనంబు;
ముక్తామణుల గూఢముగ నణంచుకయున్న కుంభికుంభములవిజృంభణంబు;
చేరఁ బోయినను శృంగారరసాకృతిఁ గనుపించుకొండల గౌరవంబు;
చకితస్వభావచాంచల్యపత్రకము లై భ్రమియించు చక్రవాకములసొబగు;
తే. పోల్పఁ దగు టెట్లు కలితకర్పూర మై ప్ర,కాశమౌక్తికహార మై కదిసి చూడ
సరస మై నిస్తరళపత్రసహిత మై యె,సంగు నీయంగనామణిచన్నుఁగవను."
(కవిరాజమనోరంజనము. ఆ. 4. పే. 54.)

## శకుంతలాపరిణయము

"మ. నను శ్రీరామపదారవిందభజనానందున్ జగత్ప్రాణనం
దనకారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశిసం
జనితైకైకదినప్రబంధఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బిల్వం బంచి పల్కెం గృపన్." (వసు. ఆ. 1. ప. 16.)

"మ. నను రామానుజపాదపద్మయుగళీనవ్యాన్వయధ్యానపా
వనహృద్భాగవతావతంసపదసేవాసక్తచిత్తున్ మరు
త్తనయారాధనచారులబ్ధకవితాధారున్ సదారూఢభా
సను నాస్థానకవిన్ నిజాశ్రితుని బిల్వం బంచి పల్కెం గృపన్."
(శకుంతలాపరిణయము. ఆ. 1. ప. 87.)

"సీ. ఏరాజు భూరితేజోరుణాలోకంబు లోకంబు తమము నిరాకరించు;
నేధన్యు బాహాధరాధరాభోగంబు భోగంబు సవరించు భూమిసతికి;
నేపుణ్యు నభిరూపరూపానుభావంబు భావంబుఁ గరఁగించు భామినులకు;
నేభవ్యు శుభకీర్తిశోభావిహారంబు హారంబు దశదిశాయామవతమున;
తే. కతఁడు ... ... ... ... ... ..."
(వసు. ఆ. 1. ప. 30.)

"సీ. ఏదేవదేవుని సాదరాలోకంబు లోకంబులకు సౌఖ్య మాకలించు;
నేపరాత్పరు దివ్యరూపానుభావంబు భావంబులకు మేలు పాదుకొలుపు;
నేజగజ్జనకుని యిచ్ఛావిహారంబు హారంబు ధారుణీచారుముఖికి;
నేమహాబలశాలి హేలావతారంబు తారంబు విప్రపత్రయమునకును;..."
(శకుంతలాపరిణయము. ఆ. 1. ప. 93.)

"సీ. మోహోపదేశతమోముద్రితము లైన కనుదమ్ముల హిమాంబు లునుపరాదు;
క్రమబిందుతారకాగమఖిన్నకుచకోకములఁ జంద్రనామంబు తలఁపరాదు;
శీర్యదాశావృంతశిథిలతాసులతాంత మసియాడ వీవనల్ విసరరాదు;"...
(వసు. ఆ. 3. ప. 180.)

"మ. కనుదమ్మిన్ హిమవారిపూర మునుపం గాదంచుఁ దామ్యద్ఘన
స్తనకోకమ్ములఁ జంద్రకాంతమణు లుంచం దాళలే దంచు మై
ననమానం బలుమాఱు వీజనము లూనన్ రా దటంచున్ సఖీ
జనముల్ దేర్చిరి మెల్లమెల్లనఁ జెలిన్ సౌమ్యోపచారంబులన్.
(శకుంతలాపరిణయము. ఆ. 2. ప. 230.)

"సీ. ఈరాలఁ బోరాదు హేరాళము జవాది యీరాలనడుచక్కి నేగవలయు... ...
తే. నధిప యిది మానికపుఁగోన యది లతాంత, రజముసారువ యిది కప్పురంపుటనఁటి
చప్పరం బలయది కాంతసదన మనుచు, నరపతికిఁ జెప్పె నరుగుచో నర్మసఖుఁడు."
(వసు. ఆ. 2. ప. 58.)

"సీ. పోఁగూడ దీదారి ఫుల్లహల్లక సారకాసార జీసార కర్దమంబు......
తే. నాథ! యిది కప్పురంపుటనంటితోఁట, మహిప! యిది గోస్తనీకాయమానసరణి
నృపకులాగ్రణి! యిది మాలినీప్రవాహ,మధిప! యిదె చూడుము శకుంతలావసథము."
(శకుంతలాపరిణయము. ఆ. 3. ప. 29.)

ఇట్లే కొన్నిచోట్ల వసుచరిత్రపద్యము లీ పిల్లవసుచరిత్రములలో రెండు మూఁడు గ్రంథము లందును ననుకరింపఁబడియు న్నవి.

"సీ. తన యశోవిశద ముక్తాసౌధపాళికి, నంబుదాయనము వాతాయనముగఁ;
దన శౌర్యశిఖిశిఖాతతికి జాంబూనద, భూధరం బపరంజిపూఁదె కాఁగ..."
(వసు. ఆ. 1. ప. 116.)

"సీ. తన పృథుకీర్తి ముక్తాఛత్రమునకు స్వర్ణధరంబు కనకదండంబు గాఁగఁ
దన ప్రతాపసమగ్రదావాగ్నిశిఖకు వ్యోమంబు తదగ్రధూమంబు గాఁగ..."
(కవిజనరంజనము. ఆ. 1. ప. 28.)

"సీ. తన కీర్తికర్పూరమునకు బ్రహ్మాండకటాహంబు దగు కరాటంబు గాఁగఁ;
దన భుజాకర్బురస్తంభంబునకు ధరాసతి ఘటన్మరకతప్రతిమ గాఁగ..."
(కవిరాజమనోరంజనము. ఆ. 3. పే. 34.)

"చ. తఱు లరనిక్కఁ బూఁతనెఱతావియ చిక్క నపాంగమాలికల్
మెఱుఁగులు గ్రక్క నూరుపులమేలిమిఁ దేఁటులు చొక్క హారముల్
కుఱుచలు ద్రొక్క ముంగుఱులు గ్రొంజెమటం బదనెక్క వేలుపుం
దెఱవ యొకర్తు చేదిజగతీపతికిన్ శిర సంటె వేడుకన్." (వసు. ఆ. 5. ప. 75.)

"చ. జిలుఁగుపయంట దూల నునుఁజెక్కుల లేఁజెమ రంకురింప గు
బ్బలు నటియింపఁ దాళగతి బంగరుగాజులు మ్రోయ హారము
ల్తెలిగొన నూర్పు లుప్పతిల లేనడు మల్లలనాడ మెల్లనే
యలికులవేణి యొర్తు శిర సంటెను గెంజిగురాకుఁ బోఁడికిన్." (కవిజనరంజనము.ఆ.3.ప.26.)

"ఉ. కంకణనిక్వణంబు ఘలుఘల్లన మ్రోయఁ గపోలపాళిఁ దా
టంకరుచు ల్వెలుంగ నుదుటం జిఱుచెమ్మట గ్రమ్మ హారముల్
కుంకుమగంధపున్వలపుగుబ్బలపై నటియింప నొక్క యే
ణాంకనిభాస్య భూపతికి నంటె సుగంధపునూనె యత్తటిన్."
(కవిరాజమనోరంజనము. ఆ. 5. పే. 69.)

"సీ. లలనాజనాపాంగ వలనావసదనంగ, తులనాభికాభంగ దోఃప్రసంగ;ము."
(వసు. ఆ. 1. ప. 126.)

"సీ. సరసాతిశయసార సరసానుభవధీర, తరసార ఝుంకారకరమదాళి;..."
(కవిరాజమనోరంజనము. ఆ. 4. పే. 51.)

"సీ. ప్రసవాసవాసంగ లసమానమదభృంగ, విసరైకశృంగారరసలవంగ; ము..."
(శకుంతలాపరిణయము. ఆ. 1. ప. 110.)

"ఉ. కొం డఁట విల్లు వేదలలకుండలిరా జఁట నారి య మ్మనం
తుం డఁట బైటిపల్లియలు దున్మినవాఁ డఁట యొండు రెండు భ

ర్గుం డిది నీదుపౌరుషమొకో యని గెల్వవె ముజ్జగంబు లు
ద్దండత నొక్క తుంటవిలు దాలిచి యంటినఁ గంద తూపులన్." (వసు. ఆ. 3. ప. 174.)

"ఉ. నా రఁట తేఁటి జోకనలి నా రఁట తే రఁట చిల్క సౌరభో
ద్గారఁట విల్లు పూఁతనయగా రఁట చుట్టము శైత్యపుర్ సదా
చా రఁట కమ్మగాడ్పుపరిచా రఁట కోయిల కేతువాలయ
ద్వా రఁట యిట్టి నీ కొడుగు వా రఁట లోకు ల దేమిచిత్రమో?"

(కవిరాజమనోరంజనము. ఆ. 3. పే. 40.)

"ఉ. తుం టఁట కార్ముకంబు కరదొట్టిన తేం ట్లఁట వింటినారి చే
యంటిన వాడు తూపు లఁట యప్పులపా లఁట కేతనంబు వా
ల్గంటిపులుంగు గుబ్బ మఁట కాయము లే దఁట నీకు లోకముల్
కొంటెతనంబునం గెలిచితో లిది యచ్చెరియంబు మన్మథా."

(శకుంతలాపరిణయము. ఆ. 2. ప. 179.)

ఇటులనే యనేకస్థలములందుఁ బరస్పరానుసృతులు గలవు. వాని నెల్ల నిట నుదాహరించుటయో యావశ్యకము గాని విస్తరభీతిని విరమించితిని. అట్లయినను నిచ్చట నట్టి యనుసృతిగల పద్యముల సంఖ్యలను మాత్రము చూపుచున్నాను.

| వసు చరిత్రము | | కవిజన రంజనము | | కవిరాజ మనో రంజనము | | శకుంతలా పరిణయము | | వసు చరిత్రము | | కవిజన రంజనము | | కవిరాజ మనో రంజనము | | శకుంతలా పరిణయము | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆ | ప | ఆ | ప | ఆ | ప | ఆ | ప | ఆ | ప | ఆ | ప | ఆ | ప | ఆ | ప |
| 2 | 64 | 2 | 15 | | | | | 1 | 36 | | | | | 1 | 77 |
| 4 | 34 | 2 | 39 | | | | | 1 | 80 | | | | | 1 | 116 |
| 5 | 3 | 3 | 12 | | | | | 1 | 22 | | | | | 1 | 125 |
| 3 | 67 | | | 5 | 65 | | | 2 | 7 | | | | | 1 | 184 |
| 1 | 108 | | | 4 | 63 | | | 2 | 25 | | | | | 2 | 3 |
| 2 | 65-67 | | | 5 | 61 | | | 2 | 32 | | | | | 2 | 14 |
| 3 | 149 | | | 4 | 51 | | | 3 | 67 | | | | | 2 | 47 |
| 4 | 39 | | | 3 | 42 | | | 3 | 116 | | | | | 2 | 184 |
| 6 | 60 | | | 3 | 40 | | | 4 | 7 | | | | | 2 | 189 |
| 3 | 116 | | | 3 | 35 | | | 4 | 15 | | | | | 2 | 191 |
| 2 | 47 | | | 2 | 24 | | | 3 | 116 | | | | | 3 | 70 |
| 2 | 32 | | | 2 | 15 | | | 3 | 46 | | | | | 3 | 113 |
| 1 | 34 | | | | | 1 | 29 | | | | | | | | |

5555

# మూడవ భాగము

గ్రంథవిస్తరభీతిచే విరమించితిని గాని యిట్టి యనుస్మృతులు లెక్కకు మీఱి యున్నవి. ఇట్లే నరసభూపాలీయ వసుచరిత్రములు పరస్పరానుస్మృతిని గల్గి యున్నవి. అనుస్మృతి యన నేల? పద్యైక్యము నభిప్రాయైక్యమును నగపడుచున్నవి. కవితారీతియు రెండిటియందును నించుమించుగ నొక్క విధముగనే వెలయుచున్నది. నరసభూపాలీయకర్త యగు బట్టుమూర్తియే రామరాజభూషణుఁ డనియు నతఁడే వసుచరిత్రమును సైతము రచించినాఁ డనియు జనశ్రుతి చిరకాలమునుండి ప్రసిద్ధ మయి యున్నది. కావుననే యనేకులు మొన్నమొన్నటివఱకును బై యభిప్రాయమునే తమ తమ గ్రంథము లందు వ్రాసియున్నారు. పురాణనామచంద్రికయందును, దక్షిణహిందూస్థానకవుల చారిత్రము నందును, బ్రౌణ్యా నిఘంటువునందును, సుజనరంజనీ పత్త్రికయందును ముద్రిత మయిన వసుచరిత్ర ముఖపత్త్రమునందును, పాండురంగవిజయములోని దని పుట్టిన చాటువునందును, రాధాకృష్ణ సంవాద వ్యాఖ్యానము నందును, బట్టుమూర్తి రామరాజభూషణుల యైక్యము వ్రాయఁబడి యున్న దని శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులవారు తమ కవిజీవితములలో వ్రాసియున్నారు.

ఇట్లెల్ల యెడల నైక్యాభిప్రాయమే వెల్లడియై యుండ మొట్టమొదట గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారు బట్టుమూర్తి రామరాజభూషణులు విభిన్నులను దారి తీసిరి. అక్కడనుండి విమర్శకు లీవిషయమున సందేహింప నారంభించిరి.

శబ్దరత్నాకరమున బహుజనపల్లి సీతారామాచార్యులవారు "బట్టుమూర్తి. ఇతనికి రామరాజ భూషణుఁడని నామాంతరర" మని యిట్లు మొదట వ్రాసియుఁ దుదకు "నీతఁడే కావ్యాలంకార సంగ్రహమును రచించి నట్లు నానుడి గలదు. కాని వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానముల యాశ్వాసాంత గద్యప్రవృత్తియును గావ్యాలంకారసంగ్రహముయొక్క యాశ్వాసాంతగద్య ప్రవృత్తియును, భిన్న ప్రకారములుగా నుండుటం జేసి యది సందిగ్ధముగా నున్న" దని వ్రాసిరి.

శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులవారు తమ యాంధ్రకవుల చరిత్రమునందు రామరాజ భూషణునిగుఱించి వ్రాయునపు డీ కవుల యైక్యవాదమును బలపఱచి వ్రాసిరి. అయ్యది ప్రకృతవిషయ మున కుపచరించునది యగుటం జేసి యిట నెత్తి వ్రాయుచున్నాను. "మూర్తి యనియు, రామరాజ భూషణుం డనియు నిద్దఱు వేఱువేఱుకవు లనియు నందు మూర్తికవి నరసభూపాలీయమును, రామ రాజభూషణుఁడు వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములను రచియించి రనియు గొందఱును, ఇద్దఱు నొక్కరే యనియు...మూర్తి యనునది నిజమయిన పేరనియు, రామరాజభూషణుఁ డన్నది రామరాజుయొక్క సభ కలంకారముగా నుండుటచేత వచ్చిన బిరుదుపే రనియు నతఁడు సూరపరాజున కౌరసపుత్త్రుఁ డయి తదగ్రజుఁ డైన వేంకటరాయభూషణునకు స్వీకృతపుత్త్రుఁ డనియుఁ మఱికొంద ఱును చెప్పుచున్నారు. "శ్రీరామచంద్ర చరణారవిందవందనపవననందనప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధకవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ ప్రణీతం" బని వసుచరిత్రములోని గద్య మొకవిధముగాను "శ్రీహనుమత్ప్రసాదలబ్ధ కవితాసార సారస్వతాలంకార నిరంకుశ ప్రతిభాబంధుర ప్రబంధపఠనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయ

భూషణ సుపుత్ర తిమ్మరాజపౌత్ర సకలభాషావిశేషనిరుపమావధాన శారదామూర్తి మూర్తిప్రణీతం" బని నరసభూపాలీయములో నిగద్య మింకొకవిధముగా నుండుటనుబట్టియు, హరిశ్చంద్రనలోపాఖ్యానములో "ప్రబంధాంక సింగరాజ తిమ్మరాజప్రియతనూజ ధీరసూరపాత్త్ము జుండ రామభూషణాఖ్యసుకవి" నని యు, నరసభూపాలీయములో "ప్రబంధాంకసింగరాజసుత తిమ్మరాజపుత్త్ర ప్రసిద్ధ నరసవేంకటరాయ భూషణసుపుత్త్రు నసుబుధవిధేయు శుభమూర్తినామధేయు" ననియు, తండ్రులను వేఱువేఱుగాఁ జెప్పు టనుబట్టియు వారు వేఱువేఱుకవు లయినట్లు పయికిఁ గానవచ్చుచున్నను గొన్ని హేతువులనుబట్టి రెండవ పక్షమువారు చెప్పెడియంశములుకూడ సావధానముగ విచారింపవలసినవిగానున్నవి. ఉభయపక్షముల వారును జెప్పెడు యుక్తులను జక్కఁగా గ్రహింపఁగలుగుటకయి వంశక్రమమును దెలిపెడి పూర్వో క్తము లయిన రెండు పద్యములను పూర్ణముగా నిం దుదాహరించుట యావశ్యక మని తోఁచి యట్లు చేయుచున్నాను. మొట్టమొదటఁ బుస్తకములను జదివినప్పు డిరువురు కవులును వేఱువే అనియే నే నభిప్రాయపడినను రెండవవారియుక్తులను విన్నపిమ్మట నామనస్సునకుఁ గొంత సందేహము గలిగినందున నేతన్నిర్ణయమును దీనిని జదువువారికి విడిచిపెట్టి గ్రంథసౌలభ్యమునిమిత్త మిం దుభయుల నొక్కరి గనే భావించి వ్రాసెదను. ఇరువురును భిన్నులయినను కాకపోయినను జరిత్రభాగమునందు వేఱువేఱుగా వ్రాయవలసిన యంశము లేవియుఁ గానఁబడవు. మఱి యనుబంధమును జూడుఁడు.

"సీ. శతలేఖనీపద్యసంధానధౌరేయు, ఘటికాశతగ్రంథకరణధుర్యు;
నాశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యనిరోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తినిపుణుఁ;
దత్సమభాషావితానజ్ఞు బహుపద్యసాధితవ్యస్తాక్షరీధురీణ;
నేకసంధోచితశ్లోకభాషాకృత్యచతురు నోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు;
తే. నమితయమకాశుధీప్రబంధాంకసింగ, రాజసుత తిమ్మరాజపుత్త్రప్రసిద్ధ
నరసవేంకటరాయభూషణ సుపుత్త్రు, నసు బుధవిధేయు శుభమూర్తినామధేయు."

(నరసభూపాలీయము. ఆ. 1. ప. 13.)

"సీ. వనధిలంఘనకృపావర్ధితోభయకవితాకళారత్నరత్నాకరుండ;
సకలకర్ణాట రత్నాధురంధరరామవిభుదత్తశుభచిహ్నవిభవయుతుఁడ;
వసుచరిత్రాదికావ్యప్రీతబహునృప ప్రాపితానేకరత్నప్లవుండ;
శాశ్వతశ్రీవేంకటేశ్వరానుగ్రహ నిరుపాధికైశ్వర్య నిత్యయశుఁడ;
తే. శ్రీకరమహాప్రబంధాంకసింగరాజ, తిమ్మరాజప్రియతనూజ ధీరసూర
పాత్త్రుఁడ రామనృపభూషణాఖ్యసుకవి, నంకిత మొనర్తు నీకావ్య మనఘభక్తి."

(హరిశ్చంద్రనలోపాఖ్యానము ఆ. 1. ప. 46.)

"మ. నను శ్రీరామపదారవిందభజనానందుర్ జగత్ప్రాణనం
దనకారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశిసం
జనితైకైక దినప్రబంధఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బిల్వం బంచి పల్కెం గృపన్." (వసు. ఆ. 1. ప. 18.)

(క) పయిపద్యములలో నుపయోగింపఁబడిన విశేషణములు కొన్ని భిన్నములుగా నున్నను పర స్పర విరుద్ధము లయిన వేమియు లే నందున వానిని బట్టి గ్రంథకర్తలు భిన్నులని సాధించుట కాధార మేదియు లేదు.

(ఖ) రెండు గ్రంథములను జేసిన వారాంజనేయప్రసాదలబ్ధ కవిత్వవైభవుల మని వ్రాసికొనుట చేతను,

(గ) రెండుకవిత్వములు నేకరీతినే యుండుటచేతను,

(ఘ) ఆది నుండియు నిప్పటివఱకును బట్టుమూర్తియే వసుచరిత్రమును రచియించె నని జనశ్రుతి వచ్చుచుండుటచేతను,

(ఙ) కవికిఁ దర్వాత నల్పకాలములోనే వసుచరిత్రమునకు వ్యాఖ్యానము చేసినవారు గొందఱు భట్టుమూర్తి తాను రచించిన నానారసభాసుర మగు ప్రబంధమునందలి వివిధాలంకారములకు లక్షణగ్రంథముగ నుండునట్లు నరసభూపాలీయ మను నలంకారగ్రంథమును రచించె నని వ్రాసి యుండుట చేతను తద్గ్రంథత్రయకర్త యొక్కఁడే యయి యుండు నేమో యని యెట్టివారికిని సందేహము కలుగక మానదు. ఇఁక పైపద్యములలోని యంశములనుబట్టి విచారింపవలయును. నరసభూపాలీయకృతి కర్తపే రందలి గద్యమునుబట్టి మూర్తి యనుట స్పష్టము. దానికి బట్టు మొదలైన పదములను వేనిని చేర్చినను అవి కులనామములో బిరుదనామములో యయి యుండును.

(చ) కావ్యాలంకారసంగ్రహ మనఁబడెడు నరసభూపాలీయములోని పూర్వోదాహృత మైన పద్యములో "శుభమూర్తి నామధేయు" నని 'శుభ' విశేషణ మొకటి కానఁబడుచున్నది. ఈ విశేషణ మెట్లు వచ్చినది? ఎవ్వరికిఁ జెందునది? అన్న విషయము నాలోచింపవలయును.

పూర్వోదాహృత మైన హరిశ్చంద్రనలోపాఖ్యానములోని పద్యములో "రామభూషణకవి" "రామవిభుదత్త శుభచిహ్నవిభవయుతుఁడ" నని వ్రాసికొని యున్నాఁడు కాఁబట్టి దీనినిబట్టి చూడఁగా శుభబిరుదమును రామరా జిచ్చె ననియు, రామరాజభూషణనామము గల వాని కిది చెందు ననియు విస్పష్ట మగుచున్నది. నరసభూపాలీయకృతికర్త తనకు శుభవిశేషణమును వేసికొనుటయు, హరిశ్చంద్ర నలోపాఖ్యానకృతికర్త తనకు రామరాజు శుభచిహ్న మిచ్చె నని చెప్పుకొనుటయు నీ రెంటెనిగూర్చి చిరకాలమునుండి పరంపరగా వచ్చుచున్న జనప్రతీతితోఁ జేర్చి విచారించినపక్షమున నా రెండు గ్రంథములను రచించిన వా రొక్కరే యని చూపుట కది యొక ప్రబలసాక్ష్యముగాఁ గనఁబడుచున్నది.

(ఛ) రామరాజభూషణపదము బిరుదనామమే యయినపక్షమున, పయిపుస్తకములయందలి నామవ్యత్యాసములనుబట్టి కవులు వేరని చెప్పుట కవకాశ ముండదు. రామరాజభూషణపదము బిరుదుపేరు గాక పేరే యయి యుండినయెడల నది యంతట నేకరూపముగనే యుండునేగాని పయి పద్య గద్యములం దున్న ట్లొకచోట 'రామరాజభూషణ' యనియు నింకొకచోట 'రామభూషణ' యనియు వే ఱొకచోట 'రామనృపభూషణ' యనియు నుండ దని యొక యుక్తి చెప్పుదురు గాని యది యంత ప్రబలయుక్తి కాదు.

(జ) కట్టకడపటఁ జేసిన హరిశ్చంద్రనలోపాఖ్యానములో "వసుచారిత్రాదికావ్య" బహునృపప్రాపితానేకరత్న" పదములను బ్రయోగించుటచే 'నాది' పదప్రయోగముచేత రెంటికి నడుమ నతఁడు చేసిన కావ్య మిం కొకటి యుండవలసినందున నదియే నరసభూపాలీయ మనియు, బహుపదప్రయోగముచేత నిద్దఱికంటె నెక్కువరాజు లుండవలసినందున వారే రామరాజు, తిరుమలరాజు, నరసరాజు లనియు మూఁడు గ్రంథములను రచించినవాఁ డొక్కఁడే యనుట కిం కొక యుక్తిని జెప్పుచున్నారు. ఈ యుక్తి యెంత యాదరణీయమో బుద్ధిమంతులు తమలోఁ దాము నిర్ణయించుకొనవలయును.

(ఝ) ఈ కవి తన జనకపితను పాలకపితను గూర్చి సంతోషపెట్టుటకయి యొక పుస్తకమునందు పెంచుకొన్నతండ్రి పేరు వేసె ననియు, ఒక పుస్తకమునందు కన్నతండ్రి పేరు వేసె ననియు,

ఒక పుస్తకమునం దెవ్వరిపేరును వేయక విడిచెననియుఁ జెప్పుచు ఆయా పుస్తకములం దుపయోగింపఁ బడిన పదములే యొకఁడు జనకపిత యనియు, నొకఁడు పాలకపిత యనియు సూచించుచున్న వని చెప్పుచున్నారు. హరిశ్చంద్రనలోపాఖ్యానములోని "సూరపాత్మజుఁడ" నను వాక్యమువలన సూరప రాజున కౌరసుఁ డని యాత్మజశబ్దము దృఢపఱచుచున్న దనియు, నరసభూపాలీయములోని "వేంకట రాయభూషణసుపుత్త్రు" నను వచనమువలన వేంకటరాయభూషణునకు దత్తుఁ డని సుపుత్త్ర శబ్దము దృఢపఱచుచున్న దనియు వాదించుచున్నారు. ఈయర్థములయం దాత్మజశబ్దమునకుఁ దనవలనఁ బుట్టినవాఁడు కాని దత్తుఁడు కాఁ డనియు, సుపుత్త్రశబ్దమునకు పున్నామనరకమునుండి రక్షించు దత్తుఁడు కాని కన్నవాఁడు కాఁ డనియు గ్రహింపవలెను. ఈ యంశమున కనుకూలముగా నుండు కథలు కొన్ని కలవు గాని గ్రంథవిస్తరభీతిచే వానిని విడుచుచున్నాను.

—ఈ రామరాజభూషణకవి మొట్టమొదట రచించిన కావ్యము వసుచరిత్రము—

(ఆంధ్రకవులచరిత్రము. మధ్యకవుల చరిత్రభాగమున 91, 92, 93, 94 పేజీలు.)

దీని కనుబంధముగా నీ భాగమునందే 194, 95, 196, 197 పేజీలలో వ్రాసి యున్నారు. అదియు నీచర్చావిషయమున నుపచరించునదే యగుటచే నిందు వ్రాయుచున్నాను.

"రామరాజభూషణుఁడు.—వసుచరిత్రకర్తయు నరసభూపాలీయ కృతికర్తయు నొక్కఁడే మో యని నాకు సందేహము కలిగించుటకుఁ గారణము లైన యంశములను మఱి కొన్నిటిఁ గూడ నిప్పు డిందుఁ జేర్చుచున్నాను. వీనిని రామరాజభూషణకవి చరిత్రములోఁ జెప్పినవానితోఁ జేర్చి చదివి బుద్ధిమంతులు తమ యిచ్చవచ్చిన సిద్ధాంతము చేసికొనవచ్చును.

౧. "గీ. తా రచించిన వసుచరిత్రమునఁ గన్న, తండ్రి సూరన వెలయించి తలఁపఁ డయ్యె
నన్ను మన శారదామూర్తి నా ఫలంబె, దత్తుఁ డగు వానిఁ జేపట్టఁ దరమె నాకు."

అను చాటుధారాపద్య మొక్కటి రామరాజభూషణుఁడు తన వసుచరిత్రములో జనకపిత యైన సూరపరాజుపే రుదాహరించి తన్నుఁ జేర్కొనకపోవుటచేత పాలకపితయైన వేంకటరాయ భూషణునిచేఁ జెప్పఁబడిన దని వాడుకలో నున్నది.

౨. చతుర్భుజాభిషేకము, యావనచరిత్రము, రంగా గౌరీ సంవాదము అను ప్రబంధముల రచించి ప్రసిద్ధుఁ డయి వసుచరిత్రమునకు వ్యాఖ్యానము చేసిన సోమనాథకవి గ్రంథాదిపీఠికలో నిట్లు వ్రాసియున్నాఁడు.

"శా. ఈరీతిం గవితావితానవృతగౌరీశానమౌళిస్థలో
దారోద్దేశుఁడ నైన నాకు వెస విద్యావంతు లెల్ల న్మనో
హారి ప్రక్రియమూర్తిచేత రచితం బై విశ్రుతం బౌ వసు
క్ష్మారాట్చిత్రచరిత్రటీకకయి యుత్సాహంబు పుట్టించినన్.

ఉ. కారణజన్ముఁ డై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
భూరికళాకలాపుఁ డయి పొల్పు వహించిన బట్టుమూర్తిచే
నీరిత మై సుఖార్థపదహీనపదాస్పద మైన యావసు
క్ష్మారమణప్రవృత్తము సుసాధ్యము కాదు తలంచి చూడఁగన్."

అని యిందలి మొదటిపద్యములో వసుచరిత్రము "మూర్తి" చేత రచిత మనియు రెండవ పద్యములో "బట్టుమూర్తి" చే నీరీతమైన దనియు వ్యాఖ్యాత చెప్పియున్నాఁడు. ఈవ్యాఖ్యాత యే కాలమునం దుండినవాఁడో సరిగా తెలియదుగాని, అప్పకవికిని, నహోబలపతికిని దరువాత నత్యల్పకాలములోనే పదునేడవశతాబ్దాంతమున నున్నట్లు తెలియ వచ్చుచున్నది. పూర్వకాలము నందె యితఁ డిట్లు వ్రాయుటనుగుఱించి యేమి చెప్పెదరు? ఇతఁడు సావధానముగా గ్రంథమును బరిశీలించి ప్రతివాదులు తమవాదముల కనుకూలములుగా నుదాహరించెడు గద్యపద్యముల కన్నిటికిని బ్రతిపదార్థమును వ్రాసి విమర్శించినవాఁడే కదా?

3. అనేకగ్రంథములను జేసిన గొప్పకవులు సమానవర్ణనలు వచ్చెడుపట్టున దాము మొదట రచియించినగ్రంథములలోనుండి పద్యములను జేకొని యావశ్యకము లైన మార్పులను జేసి తరువాత రచియించెడు గ్రంథములలోఁ జేర్చుకొనెడు యాచారము కలదు. తిక్కనసోమయాజి తన నిర్వచనోత్తరరామాయణములో మూఁడవయాశ్వాసమున

"చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ దారభీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్ప శార్ఙ్గని
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్."

అని రచియించిన పద్యమునే విరాటపర్వములో నైదవయాశ్వాసమునఁ గొంచెము మార్పుచేసి యీ క్రిందిరీతిగాఁ బ్రయోగించియున్నాఁడు.

"చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ జాల భీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్."

ఇందు "తార" "చాల" గను "శార్ఙ్గనిక్వణ" మనునది "గాండివక్వణన" ముగను మార్పఁబడినవి. మఱియు సోమయాజులు-

"మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెం గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయున్."

అను పద్యమును మార్పుచేయకయే నిర్వచనోత్తరరామాయణములో నైదవయాశ్వాసములోను విరాటపర్వములో నాలవయాశ్వాసములోను గూడ వేసియున్నాఁడు. ఈప్రకారముగనే వసుచరిత్రము ప్రథమాశ్వాసములో,

"శా. రామస్తావరు దానతోయతటినీవ్రాతంబు కల్లోలినీ
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గు వర్షాశర
త్సామానాధికరణ్యలబ్ధి కచటం జక్రాయుధుం డొందు ని
ద్రాముద్రానుగతప్రబోధములఁ జిత్రం బేకకాలంబునన్." (ఆ. 1. ప. 78.)

అను పద్యము కొంతవఱకు మార్పఁబడి నరసభూపాలీయము ద్వితీయాశ్వాసములో,

శా. "ఆమోదంబున శ్రీనృసింహవిభు దానాంభోనదు ల్సాగర
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గు వర్షాశర
త్సామానాధికరణ్యలబ్ధి కచటం దామోదరుం డొందు ని
ద్రాముద్రానుగతప్రబోధములఁ జిత్రం బేకకాలంబునన్." (ఆ. 2. ప. 135.)

అని ప్రయోగింపఁబడియున్నది. ఇద్దఱు నేకకవు లయినందక్క నిట్టిప్రయోగముల నెట్లు సాధువుగా సాధింపవచ్చును? ఈగ్రంథద్వయకర్త యొక్కఁడు కాఁడనెడుపక్షమున, నీమహాకవులను గ్రంథచౌర్యముచేసెడి యల్పకవులలోఁ బరిగణింపవలసివచ్చును. ఈవిధముగనే వసుచరిత్రము ప్రథమాశ్వాసములోని,

"శా. ఆమందాకిని మౌళిఁ బూని నను నర్ధాంగీకృతం జేసి తా
నా మేల్మేలని యార్య యల్గఁ బ్రణతుండై తత్పదాంభోజయో
గామర్షంబున గంగయు న్నొరయఁ జూడాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున వేఁడు శంభుఁడు కృతిస్వామిం గృపం బ్రోవుతన్." (ఆ. 1. ప. 5.)

అను శివస్తుతిపద్యార్థమును గొంచెము మార్చి యధికస్వారస్యము గలిగించి

"శా. గంగం దాల్చితి వుత్తమాంగమున నన్ గైకోలుగావించి త
ర్ధాంగీకార మనం బురంధ్రి! నిను వామాంగంబునం దాల్పనే
శృంగారోన్నతిఁ జూడు మంచు గిరిజన్ శీర్షాపగాబింబిత
స్వాంగానందితఁ జేయు శంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోవుతన్." (ఆ. 1. ప. 5.)

అని నరసభూపాలీయములోఁ గవి ప్రయోగించియున్నాఁడు. మొదటిపద్యములోని కొన్ని పదముల శ్లేషార్థము నటుండనిచ్చినయెడల, ఉభయపద్యములలోను గంగను శిరస్సునఁ దాల్చి నన్నర్ధాంగీకృతను జేసితి వని పార్వతి కుపితురాలు కాఁగా శివుఁ డామెకోపమును దీర్చుటకయి పాదములఁ బడె నన్న యర్థము సామాన్యముగాఁ జెప్పఁబడినది. వీనిలో మొదటిపద్యమున శివుఁడు పార్వతికిఁ గోపశాంతి చేయలేకపోవుటయేకాక గంగకుగూడఁ గోపముఁ దెప్పించి యామెను వేఁడుకోవలసినవాఁడయ్యెను. రెండవపద్యమున గంగాప్రతిబింబితస్వరూపమును బార్వతికిఁ జూపి తానామెనుగూడ నుత్తమాంగముననే ధరించితి నని భ్రమ కలిగించి శివుఁ డామెను శాంతచిత్తురాలిని జేయఁగలిగెను. ఈరెండుకావ్యములకు నొక్కరినే కర్తలుగాఁ జెప్పకపోయినపక్షమున వారియందుఁ బదార్థచౌర్య మారోపింపవలసివచ్చును.

8. రామభూషణుని కాలములోనే యుండి మనుమల నెత్తిన వేంకటపతిరాయల విద్యాగురు వగు మండరామానుజాచార్యుని ముమ్మనుమని మనుమఁడగు లక్ష్మీనరసింహాచార్యులు తాను రచించిన యాంధ్రకౌముదియందు "ముప్రత్యయాభావస్య అల్లసానిపెద్దనార్యశిష్యేణ బట్టుమూర్తిమహాకవినా విరచితే వసుచరిత్రే" "ముప్రత్యయాభావమున కల్లసానిపెద్దనార్యునిశిష్యుఁడైన బట్టుమూర్తిమహాకవి చేత రచితమైన వసుచరిత్రమునం" దని వ్రాసి,

"సీ. రాజహంసలుగాని రాజహంసలుగారు సరిసత్కళాసారసారరుచుల"

అను వసుచరిత్రములోని సీసపాదమును లక్ష్యముగాఁ జూపియున్నాఁడు. బట్టుమూర్తికి [illegible]

సంవత్సరములలోపలనే యిట్లు గ్రంథస్థముచేసిన వ్రాఁతను నిరాకరించుటకుఁ బ్రబలప్రమాణము కావలసియుండునుగదా ?

౫. అప్పకవీయములో నుదాహరింపఁబడి యించుమించుగా రామరాజభూషణునికాలములోనే రచింపఁబడిన లక్షణదీపికలో ౪౧౬-వ పద్యము తరువాత,

"మంజీరశబ్దమునకు బట్టుమూర్తి వసుచరిత్రము మొదటిపద్యము ప్రథమచరణమున హల్లునకుఁ బ్రయోగము." అని వ్రాయఁబడి,

"శా. శ్రీభూపుత్త్రివివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్ఫలీ"

ఇత్యాది వసుచరిత్ర పద్య ముదాహరింపఁబడియున్నది. సరికాలమువారుకూడ సుప్రసిద్ధుఁడైన రామరాజభూషణుని బట్టుమూర్తి యని భ్రమించుట పొసఁగనేరదు గాన నిరువురు నొక్కరేయనుట యధికవిశ్వసనీయ" మని వ్రాసియున్నారు. దీనినిబట్టి మరల నభేదవాదమే బలపడియుండ గురజాడ. శ్రీరామమూర్తిపంతులుగారు పత్త్రికలలో నభేదవాదఖండనరూపమగు పెద్దవ్యాసమును వ్రాసిరి. పిదప నది తమ కవిజీవితములలోఁ జేర్చిరి. ఈయంశమునే దృఢపఱుచుచు మఱికొన్ని విశేషాంశములను జేర్చి పయి శ్రీరామమూర్తిపంతులవారి వ్యాసముతోఁ గూడఁ దాము రచించిన హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠికలోఁ బూండ్ల రామకృష్ణయ్యపంతులుగారు వ్రాసియున్నారు. అది యంతయు నిందు వ్రాయుట యావశ్యకమేయయినను నయ్యది మిగుల విరివిగానుండుటంబట్టి గ్రంథవిస్తరభీతిచే సొంతముగా నిట వ్రాయనైతిని గాని ముఖ్యవిషయముల నిం దుదాహరించెదను.

శ్రీవీరేశలింగముపంతులవా రభేదవాదము నుపపాదించిన గ్రంథములోఁ జెప్పఁబడినయుక్తులు తొమ్మిది. వానికి నేను వరుసగా నిట్లు "క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ" యని గుర్తులు పెట్టియున్నాను. మఱియు, వారు వ్రాసిన యనుబంధములో నైదు విషయములు వ్రాసిరి. వానిలో నొకటవ విషయము ఝ. గుఱుతుగలయుక్తి కనుబంధమయియున్నది. 2, 4, 5 వ విషయములు ఙ. గుఱుతుగల యుక్తి కనుబంధములు. మూఁడవవిషయము గ. గుఱుతుగలయుక్తి కనుబంధము. పయి యుక్తులకు గురజాడ శ్రీరామమూర్తిపంతులవారును, బూండ్ల రామకృష్ణయ్యపంతులవారును జేసిన యాక్షేపణములును వానిబలాబలములును వరుసగా నీక్రింద నుదాహరించుచున్నాను.

క. ఖ. గుఱుతులుగల యుక్తుల విమర్శనము కవులు తమ గ్రంథములలోఁ దమ్ముఁ గూర్చి చెప్పుకొను విషయములు పరస్పరవిరుద్ధములై యున్నవా ? ఎంతవఱకు సరిపోలియున్నవి ?

హరిశ్చంద్రనలోపాఖ్యానములో "వసుచరిత్రాదికావ్యప్రీత" యని చెప్పుకొనుటచేత వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానము లేకకవికృతము లనుట యుభయపక్షములవారికిని సమ్మతమేగదా!

క. ఖ. గుఱుతులుగల యుక్తులపై నాక్షేపణములు

| నరసభూపాలీయ కవి. | వసుచరిత్ర కవి. |
|---|---|
| 1. శతఘంటకవి. | ఈబిరు దీతనికి లేదు. |
| 2. గడియకు నూఱనుష్టుపులు చెప్పఁగలఁడు. | ఇది యితనికి బిరుదే. |

| నరసభూపాలీయ కవి. | వసుచరిత్ర కవి. |
|---|---|
| 3. ఆశుధారను ప్రబంధమును బంధకవిత్వమును జెప్పును. | ఈబిరుదు లేదు. |
| 4. ఓష్ఠ్యనిరోష్ఠ్యముగాఁ గవిత్వముఁ జెప్పును. | ఇదియును లేదు. |
| 5. నాలుకకదల్చ నక్కఱయుండని కవిత్వముఁ జెప్పును. | ఇదియును లేదు. |
| 6. తత్సమభాషాకవి. | సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యబిరుదు కలదు. |
| 7. అనేకపద్యవ్యస్తాక్షరి చేయఁగలఁడు. | ఈబిరుదు లేదు. |
| 8. ఏకసంథోచితశ్లోకభాషాకృత్య చతురత. | ఇదియును లేదు. |
| 9. ఓష్ఠ్యనిరోష్ఠ్యములం గల్పి చెప్పఁగల్గుట. | ఇదియును లేదు. |
| 10. అచలమగునట్టియు యమకముతోఁగూడిన యాశుధారగలవాఁడు. | ఇదియును లేదు. |
| 11. హనుమత్ప్రసాదలబ్ధకవితాసారముగలవాఁడు | జగత్ప్రాణనందన కారుణ్య కటాక్షలబ్ధకవితాధారా సుధారాశి. |
| 12. సారస్వతాలంకారుఁడు. | ఇది చెప్పఁబడలేదు. |
| 13. నిరంకుశప్రతిభాబంధురుఁడు. | ఇదియుఁ జెప్పఁబడలేదు. |
| 14. ప్రబంధపఠనరచనాధురంధరుఁడు. | ఇతఁడు ప్రబంధనిర్మాత యగుటం జేసి యీబిరుదు లేకున్న లోపము లేదు. |
| 15. సకలభాషావిశేషనిరుపమావధాని. | ఇతని కీబిరుదు లేదు. |

కాని వసుచరిత్రకవి కధికముగానున్న విశేషములు వక్కాణించెదము.

1. దినమున కొక ప్రబంధము రచించుట.
2. సంగీతకళారహస్యములం దెలియుట.
3. శ్రీరామచంద్రమంత్రోపాసన.
4. చతుర్విధకవిత్వనిర్వాహకత్వము.
5. సాహిత్యరసపోషకత్వము.

| నరసభూపాలీయ కవి. | వసుచరిత్ర కవి. |
|---|---|
| ఇట్లితనికి పదునైదుప్రజ్ఞలు కాన్పించును. వసుచరిత్రగ్రంథకర్తయెడఁ గల్గియుండిన విశేషప్రజ్ఞలలో నాల్గుప్రజ్ఞ లీతనికి లేవు. అట్లున్నను శతఘంటకవిత్వము అష్టావధానాదిప్రజ్ఞలునుండుట చేత ననేకదేశములలో నితనిపేరు ప్రసిద్ధినందుటకును, దన ప్రాగల్భ్యముం జూపుటకును నను వైనది. ఆ కారణముచేతనే "మెట్టుచుదేటిమాట" యను పద్యముఁ జెప్పుట కలిగెను. | నరసభూపాలీయకవికిఁ గల్గియుండిన పదునైదుప్రజ్ఞలలో నితనికి పదునొకండుప్రజ్ఞలులేవు. కాని యితనికి మఱినాల్గు విశేషప్రజ్ఞ లుండుట చేత నీతనికవిత్వము నరసభూపాలీయ కృతికంటె మధురమై రసవంతమయ్యెఁ గాని సభారంజనముఁ జేయునట్టి యవధానతంత్రము శతఘంటకవిత్వాది ప్రజ్ఞలు గల నరసభూపాలీయకవికిఁగల ప్రఖ్యాతి యితనికిఁ దేఁజాలకపోయినది. |

అని యి ట్లుభయులప్రజ్ఞలు విభిన్నములగుటంజేసి వీరు విభిన్నులని శ్రీరామమూర్తిపంతులు గారు వ్రాసిరి.

కాని యావిషయమున వీరేశలింగముపంతులుగారు వ్రాసినరీతిగానే యాప్రజ్ఞలు విభిన్నతను జూపఁగలిగియున్నట్లగపడదు. నరసభూపాలీయకవికిఁ గల ప్రజ్ఞలలోఁ బ్రథమ, ద్వితీయ, తృతీయ ప్రజ్ఞలు వసుచరిత్రకవిచెప్పుకొనిన చతుర్విధకవిత్వములలో నొకటియగు నాశుకవిత్వము, నేకైకదిన ప్రబంధఘటితకాసద్యశ్శ్రుతగ్రంథకల్పనము నను ప్రజ్ఞలచే నుక్తప్రాయము లయి యున్నవి. ఇట్లే నరస భూపాలీయకవియొక్క యోష్ఠ్యజ్ఞతాదులగు చతుర్థ, పంచమ, నవమ, దశమ ప్రజ్ఞలు వసుచరిత్ర కవిచెప్పుకొనిన చతుర్విధకవితానిర్వాహకత్వప్రజ్ఞచే నుక్తప్రాయము లేగదా! మఱియు, నరసభూపా లీయకవియొక్క సారస్వతాలంకారతానిరంకుశప్రతిభాబంధురతలను ద్వాదశ, త్రయోదశ ప్రజ్ఞలు వసుచరిత్రకవి చెప్పుకొనిన సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యతాసాహిత్యరసపోషణతలచే నుక్తకల్పము లగుననుటకు సందియము లేదు. నరసభూపాలీయకవి చెప్పుకొనిన షష్ఠైకాదశ, చతుర్దశ ప్రజ్ఞలు వసుచరిత్రకవికిని గలవని శ్రీరామమూర్తిపంతులుగా రంగీకరించియేయున్నారు. ఇఁక నరసభూపా లీయకవి చెప్పుకొనిన బహుపద్యసాధితవ్యస్తాక్షరీధురీణతాదులగు సప్త, మాష్టమ, పంచదశ ప్రజ్ఞలు వసుచరిత్రకవి చెప్పుకొనకుండుటయు, వసుచరిత్రకవి చెప్పుకొనిన సంగీతకళారహస్యనిధిత్వ, శ్రీరామ మంత్రోపాసకత్వములు నరసభూపాలీయకవి చెప్పుకొనకుండుటయు, విభిన్నతాసూచకము లని యంద మన్న నదియు సరికాదు. బహుగ్రంథనిర్మాతలగు శ్రీనాథాదులవుమాత్ర మిట్లు స్వస్వరచితమగు ప్రతి గ్రంథమందును, స్వపూర్వపూర్వరచితములగు గ్రంథములను దమతమప్రజ్ఞలను నొక్కరీతిని జెప్పుకొని యుండిరా? శ్రీనాథుఁడు కాశీఖండములోఁ జెప్పుకొనినట్లు తన ప్రజ్ఞలను శృంగారనైషధాదులయందుఁ జెప్పుకొనలేదు. కాశీఖండమునందును, హరవిలాసము, పండితారాధ్యచరిత్రము, పల్నాటివీరచరిత్రము మొదలగు స్వకృతగ్రంథములన్నిట వర్ణింపలేదు. "బ్రాహ్మీదత్తవరప్రభావుఁడవు" "దీనారటంకాలఁ దీర్థ మాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల" యను నీ మొదలగు పద్యములలోఁ గల తన ప్రభావము లన్నియు స్వగ్రంథములన్నిటియందును జెప్పుకొనియుండలేదు. ఈహేతువులచే శ్రీనాథుని గ్రంథ ములు సైత మేకకవికృతములు కావనుట సరిగా నుండునా?

మఱియు నరసభూపాలీయకవి మొదటమొదటఁ బ్రతిష్ఠాలోభియై యవధానాదిప్రజ్ఞలు నరస భూపాలీయమునఁ జెప్పుకొన్నను వసుచరిత్రమువంటి మహాప్రబంధమును రచించి విశేషప్రఖ్యాతిఁ గాంచినపిదప ధారణామాత్రసూచకములగు నవధానాదిప్రజ్ఞలు చెప్పుకొనుట కవసరముండదు (నరస భూపాలీయము ప్రథమగ్రంథమును, వసుచరిత్రము ద్వితీయగ్రంథమును నయియుండవచ్చు నని. జ. గోటిచితవిషయమున వ్రాయఁబడును.) గాన నరసభూపాలీయమునందువలె సప్త, మాష్టమ, పంచదశ ప్రజ్ఞలు వసుచరిత్రమున లేకుండుట విభేదవాదమును స్థిరపఱుపఁజాలదు. మఱియు నరసభూపాలీయ మున గ్రంథాదిని శ్రీరామస్తుతిని జేయక వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములలో గ్రంథాదిని రామస్తుతిచేయుటయేకాక రామభక్తుఁడ నని చెప్పుకొనుటయు నొక యాధారము కానేరదు. హరి శ్చంద్రనలోపాఖ్యానమున రామరాజభూషణుడు "శాశ్వత శ్రీ వేంకటేశ్వరానుగ్రహనిరుపాధికైశ్వ ర్య నిత్యయుక్తుఁడ" నని చెప్పుకొనియున్నాఁడు. ఈవిషయము వసుచరిత్రమున లేదు. ఇంతియకాక శ్రీనాథుఁడు, పింగళిసూరన మొదలగు బహుగ్రంథకర్తలగు కవులుసైతము స్వరచితములగు నన్నిగ్రంథ ములందును నేకరీతి నిష్టదేవతాస్తుతి చేయలేదు. శ్రీనాథుఁడు శివార్చకుఁడ నని చెప్పుకొనుచు శృంగార

నైషధమున మొట్టమొదట విష్ణుస్తుతి చేసియున్నాఁడు. కాశీఖండమున నీశ్వరస్తుతి చేసినాఁడు కాన శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసిన "గ్రంథారంభమందు వసుచరిత్రములోవలెనే శ్రీరామునిఁ గవి వినుతించె" "నరాంకితకృతులందుఁ గవియొక్క యిష్టదేవతానమస్కారమే తఱుచుగాఁ గాన్పించును" నను మొదలగు యుక్తులు కవుల విభిన్నతను సూచింపఁజాలవు. మఱియు నరసభూపాలీయమునఁ బరమపదనాథుఁడైన విష్ణువు గ్రంథాదిని వర్ణింపఁబడుటయు, హరిశ్చంద్రనలోపాఖ్యానమున "శాశ్వత శ్రీ వేంకటేశ్వరానుగ్రహ నిరుపాధికైశ్వర్యనిత్యయశుఁడ" నని చెప్పుకొనుటయును బరిశీలింపఁగా నీ కవికిఁ బరమపదనాథుఁడగు విష్ణువే యిష్టదైవ మనియుఁ దద్విష్ణునియవతారమును, స్వేష్టదేవతాంతర మగు నాంజనేయునకుఁ బూజ్యదేవతయు నగు శ్రీరామదేవతను నితఁ డుపాసించె ననియుఁ దోఁచు చున్నది గాన నీసందర్భము నరసభూపాలీయకవియే వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానకవి యని బలపఱుచుచున్నదిగాని విభిన్నతావాదమును బలపఱుపనేరదు.

ఇఁక సంగీతకళారహస్యనిధి యను బిరుదము నరసభూపాలీయకవికి లేకుండుట భేదవాదమున కొక యాధారముగా శ్రీరామమూర్తిపంతులవారు విపులముగా వ్రాసినారు. ఈవిషయమున వీరు చెప్పు నట్టి ముఖ్యములగు యుక్తులీ క్రింద వివరించుచున్నాను. "వసుచరిత్రకవి తనకు సంగీతకళారహస్యనిధి యను బిరుదు గల దని చెప్పుకొనుటకు సరిగా నితని గ్రంథమున (ననఁగా వసుచరిత్రమున) ననేకస్థలములందు సంగీతశాస్త్రప్రసంగసహితములగు వర్ణనములు గలవు. నరసభూపాలీయమున నంతగా నగపడవు. నరసభూపాలీయకవి తన కీప్రజ్ఞ యున్నట్లు చెప్పుకొనలేదు. మఱియు, వసుచరిత్రకవి ప్రస్తుతపువీణియలమెట్లలోఁ జేసిన విశేషాదిక మతనిసంగీతవిద్యాప్రాగల్భ్యతఁ జూపుటకును, నరసభూపాలీయ కృతికర్త అయ్యలరాజురామభద్రకవి నాక్షేపించఁ బోయి "పృథులషడ్జస్వరోదీర్ణ భిల్లపల్లవాధరీగీతి కాకర్ణనాతిభీత పరవశాత్మ పటీరకోటరకుటీర లీనఫణియగు నక్కానఁ గాననయ్యె." అను పద్యములోని సంగీతసంప్రదాయము తెలియనివాఁడై సభలో నవమానింపఁబడె నను కథలోని న్యూనతయును పై వృత్తాంతములం బలపఱచుటకుం జాలియుండును." అని వ్రాసియున్నారు. కాని యీయుక్తులు భేద వాదమును ఖండింపఁజాలియున్నట్లగపడదు. నరసభూపాలీయమునందుఁ గల (ఆ. 1. ప. 4; ఆ. 3. ప. 129; 137; ఆ. 5. ప. 18.) సంగీతప్రసంగయుతపద్యములు నరసభూపాలీయకర్తకుఁ గల సంగీతాభిరుచిని వెల్లడిచేయఁ జాలియుండును. మఱియు వానిలో "నొకటి యక్షరవిలాసోల్లాసమున" నను సంగీతశాస్త్రసంప్రదాయపూర్ణ మగు పద్యము తద్గ్రంథకర్తకుఁ గల సంగీతశాస్త్రప్రవేశమును జూపఁ గలదు. మఱియుఁ బ్రతిగ్రంథమునందును గవి తనకుఁ గల ప్రజ్ఞల నన్నిటిని జూపవలెనను నియమము లేదుగదా! ఇంతియకాక నరసభూపాలీయ మలంకారగ్రంథ మగుటచేత నందు వసుచరిత్రమునందు వలె వర్ణనములు విపులముగా నుండుటకు వీలుపడదుగదా! ఈవిషయమున శ్రీరామమూర్తిపంతుల వారును నంగీకరించియేయున్నారు. ఇఁక నయ్యలరాజురామభద్రకవిపద్యములోని సంగీతరహస్యమును నరసభూపాలీయకవి గ్రహింపలేకపోయెనుగాన నితఁడు సంగీతకళారహస్యనిధియగు రామరాజభూషణుఁడు కానేరఁ డను విషయము విచారింపవలసియున్నది.

పయి రామభద్రకవిపద్యమునందు "శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణీ"యనుచొప్పున సంగీతము పాముల కానందదాయియై యుండఁగా సంగీతధ్వనిచే భీతిల్లి పాములు దాఁగియుండె నని వర్ణించుట దోషమని రామరాజభూషణుఁ డెంచె ననియుఁ గేవలసంగీతము పాములకింపుఁగొలుపునదేయై నను "షడ్జం మయూరో వదతి" యనుచొప్పున మయూరధ్వనిసదృశమగు షడ్జస్వరమును విని పాములు

ఖీలిల్లుట సహజమే యని రామభద్రకవి సమాధానము చెప్పె ననియు నప్పటి పందెపునిర్ణయము చొప్పున రామరాజభూషణునకు శిరోవేష్టనమును దీయించి రామభద్రకవి సభలో నవమానించె ననియు నైతిహ్యము గల దని శ్రీ వీరేశలింగముపంతులవారు వ్రాసియున్నారు. మఱియు నియ్యది యప్పకవినాఁటికే యున్నట్లుగూడ వ్రాసియున్నారు.

అప్పకవి పూర్వకవివర్ణనముచేయుచుఁ దన గ్రంథములో—

"రామరాజవిభూషణరత్నఖచిత, చారుమస్తకలాపాపహారివాక్య
గౌరవము పెక్కుభంగుల గణనచేసి, ... ... "

అని రామరాజభూషణునియొక్క కిరీటమును దీయించినవాఁ డని రామభద్రకవికి విశేషణముగాఁ జెప్పియున్నాఁడని యిట్లాంధ్రకవులచరిత్రమున నుదాహరించియున్నారు. శ్రీ రామమూర్తిపంతులుగారీయైతిహ్యమును మార్చి విభేదవాదమును స్థిరపఱచుకొనుటకై, యీయవమానము నరసభూపాలీయకృతి కర్తకు జరిగెనని వ్రాయుట వింతగనున్నది. అరయనరయ నీమార్పు వీరివాదమునకే బాధక మగుచున్నది. నరసభూపాలీయకృతికర్తకీయవమానము జరిగిన దని వీ రంగీకరించి యుండుటచే నీయవమానము రామరాజభూషణుని దను నప్పకవిసూక్తిచొప్పున నరసభూపాలీయకవి రామరాజభూషణుఁడే యని యీపక్షమువా రంగీకరింపవలసివచ్చును. ఇచట నప్పకవిపద్యమునందు 'గలాపాపహారి' యనుచోఁ 'గలాపాదిహారి' యని సవరించి శ్రీ పూండ్ల రామకృష్ణయ్యపంతులవారు తత్పద్యంబునకు "రామరాజభూషణునియొక్క రత్నకలాపాదిప్రభుబహూకృతి సంపాదకమగు మనోహరమైన వాక్యగౌరవమును గణించి" యని యర్థము చేసి యున్నారు. కాని యిచ్చట మధ్యమపదలోపసమాసము నంగీకరించ యీక్లిష్టమగు నర్థము తీయ నవసరముండునా యని యాలోచింపవలసియున్నది. ఇంతియకాక "పికః కూజతి పంచమమ్" "షడ్జం మయూరో వదతి" యను నీమొదలగు విషయములు తఱచుగాఁ బ్రబంధములయందుఁ బొనుపుచుండుట వాడుకయయియుండుటచే నీసామాన్యవిషయమును దెలియుటకు సంగీతశాస్త్రపండితుఁడై యుండనక్కఱలేదు. రామరాజభూషణుఁడు ప్రమాదవశముననో రామభద్రకవికి సమయస్ఫూర్తి లేకుండిన జయము నొందవచ్చునను నాశచేతనో యట్లు పూర్వపక్షము చేసియుండిన నుండవచ్చును. కాఁబట్టి యింతమాత్రమున నతనిసంగీతపాండిత్యమునకు లోపము కలుగ నేరదు. మఱియు రామభద్రకవిగ్రంథమునందుఁ బ్రతిజ్ఞాప్రకారము దోషమును జూపఁజాలకుండుటచే రామరాజభూషణున కవమానముగలిగియుండిన నుండవచ్చును. సంగీతవిషయమున నిట్టి యవమానము జరిగిన దని యప్పకవిపద్యము సూచింపఁజాలదు. మఱియు నప్పకవిపద్యమున కర్థాంతర ముండుటచేతను నీ యైతిహ్యమున కితరములగు ప్రబలనిదర్శనములు లేకుండుటచేతను, దీనిని నమ్మకతప్ప దనఁజాలము.

## క. జ. గుఱుతులయుక్తులపై నాక్షేపణములు

రెండిటికవితారీతులు నేకవిధముగ నున్నవా ?

"ఇఁక రెండు కవిత్వములు నేకరీతినే యున్న వనుట మే మెంతమాత్రము నిష్టపడము. ఇది యనుభవైకవేద్యము. రెండియు నొక పక్షమున రెండు కవిత్వము లేకరీతినే యున్న వనుట క్లిష్టపడి నను నరసభూపాలీయము లక్షణగ్రంథము" "రామరాజభూషణకవి ముందు వసుచరిత్రమును, దర్వాత నరసభూపాలీయమును రచించినాఁడని రావుబహద్దరుగా రనుచున్నారు. కాన నిది నిజమైనపక్షమున మొదటిగ్రంథముకన్న రెండవది యన్నివిధముల శ్లాఘ్యతమముగ నుండవలసినది యైయుండఁగాఁ

ప్రథమగ్రంథమునఁ గనుపడని యప్రశస్తమగు శ - స లకుఁ బ్రాసము రెండవగ్రంథమగు నరసభూపా లీయమునఁ గనుపడుచుండుటే వీరు వేఱువేఱుకవు లనుటకుఁ బ్రబలనిదర్శనముగ నున్నయది."

"ఇమ్మూఁడు పాత్రముల రచించినకవి యొక్కఁడైనచో ద్వితీయమున రచింపఁబడెనను నరస భూపాలీయమున బంధగర్భకవిత్వములు వ్రాసినకవి తర్వాత తానురచించిన హరిశ్చంద్రనలోపాఖ్యాన మున నట్టి బంధగర్భకవిత్వములు వ్రాయకుండుటయు, మొదటిగ్రంథమగు వసుచరిత్రమున నిట్టికవిత్వ చిహ్నము లగుపడకుండుటంబట్టియు నిష్పక్షపాతబుద్ధితో విచారించినఁ బ్రథమతృతీయగ్రంథకర్తయు ద్వితీయగ్రంథకర్తయుఁ బ్రత్యేకకవులనుటకు నిది యొక గొప్ప నిదర్శనముగ నున్నయది."

"మొదటిగ్రంథమునఁ దాను రామరాజభూషణుఁడ నని వ్రాసుకొన్నకవి రెండవగ్రంథమునఁ దక్కినపట్ల నెట్లున్నను నందలి చక్రబంధమునఁ గవిపేరగుపడవలసిన చక్రబంధస్వరూపమునం దాఱవ వలయమున మూర్తికవికృతి యని కనుపడుచుండుటంబట్టియు 'రామ (రాజ) భూషణ' యను బిరుద మీగ్రంథమునం దెచ్చుట వ్రాయమింజేసియు, నియ్యిద్దఱు వేఱువేఱుకవులనుటకు నింతకన్నఁ బ్రబలము లగు నాధారము లేమికావలయునో యూహింపఁజాలకున్నారము. వెండియుఁ జూడుఁడు. నిక్కముగ నిమ్మూఁడుగ్రంథము లొక్కరే వ్రాసినచోఁ గవిసంప్రదాయము ననుసరించి మొదటిగ్రంథమును వ్రాసిన కవి (రామరాజభూషణుఁడు) తర్వాతఁ దాను వ్రాసిన రెండవగ్రంథమున మొదటవ్రాసిన గ్రంథప్రశంసఁ జేయక తృతీయగ్రంథమున స్వీకరించుటయుఁ, దృతీయగ్రంథమునఁ బ్రథమగ్రంథమునే చె ప్పికొని ద్వితీయగ్రంథమును స్మరింపకుండుటయు, ద్వితీయగ్రంథమున ప్రథమగ్రంథప్రశంసయే లేకుం డుటయుఁ బ్రథమతృతీయగ్రంథ గద్యపద్యములలోఁ దద్గ్రంథకర్త లొక్క రనుటకు నెవ్విధమగు సంశయము లగపడకుండుటయు, ద్వితీయగ్రంథ గద్యపద్యములు ప్రథమతృతీయములకన్న నిప్పట్ల భిన్నములుగ నుండుటయు,వీరిరువురు వేఱువేఱని తెలుపఁజాలకున్న మఱే యేనిదర్శనములు వలయునో యూహింపఁజాలకున్నార" మని యిట్లు మిక్కిలి విపులముగా శ్రీ పూండ్ల రామకృష్ణయ్య పంతులవారు చర్చించియున్నారు. వసుచరిత్రమే మొదటిగ్రంథమను నుద్దేశముతో రామకృష్ణయ్యపంతులవా రట్లు చర్చించుట కనుపడినది. కాని వసుచరిత్రము మొదటిగ్రంథమనుటకుఁ దగిన ప్రబలాధారము గాన రాదు. నరసభూపాలీయమే మొదటిగ్రంథ మని గ్రహించినయెడల విభేదవాదమునకు మూలకందము లగు యుక్తు లన్నియు నున్మూలితము లగునుగదా? రామరాజభూషణుఁడు గర్భబంధకవిత్వములను బ్రతి ష్ఠావాసనచే నరసభూపాలీయమను నలంకారగ్రంథమునఁ జూపి రసజీవితములగు ప్రబంధములం దట్టి

"కావ్యాంతర్గడుభూతా యా సా తు నేహ ప్రపచ్యతే;
రసస్య పరిపంథిత్వా న్నాలంకారప్రహేలికా."

యను విశ్వనాథపంచాననసూక్తిచొప్పునఁ జొనుపఁడయ్యె నని యూహింపవచ్చును. రామరాజ భూషణుం డను బిరుదము నరసభూపాలీయ కృతికాలమునకు లేకపోవచ్చును. అందుచేఁ దననామమునే చెప్పియుండవచ్చును. వసుచరిత్రకాలమునకు రామరాజభూషణబిరుదము వచ్చియుండును. కావున నే ద్వితీయ, తృతీయగ్రంథములగు వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములం దట్టి యసన్యసామాన్య మగు బిరుదనామము నే నిలిపికొనియుండును. వసుచరిత్రమువంటి మహాప్రబంధమును రచించినపిదప నరస భూపాలీయమును జెప్పికొనకుండుటయుఁ, జక్రవర్తిప్రతినిధియగు రామరాజుచే నొందఁబడిన బిరుద మగు రామరాజభూషణ నామము వెలయుచుండ బట్టుమూర్తినామమును వేఱఁజెప్పుకొనకుండుటయు

వింతకాదు. కవి యుత్కృష్టకులజుఁడు కాకుండుటచేఁ గావలయుఁ దన కులాదికము నెచ్చటను జెప్పుకొనలేదు. ఇట్లే కవి తన నామమును మాని ద్వితీయ తృతీయగ్రంథములలో బిరుదనామమును జెప్పికొనియుండవచ్చును. ఇఁక నరసభూపాలీయము మొదటి దని గ్రహించుట యుచితమా! యను విషయము చర్చింపవలసియున్నది. వీరేశలింగముపంతులవారీవిషయమును స్వరసముగా వ్రాయలేదు గాని కొంతవఱకు సమ్మతించిన ట్లగపడుచున్నది. "వసుచరిత్రాదికావ్యప్రీత" యను దానిలో మొదట వసుచరిత్ర శబ్దముచ గ్రహించినంతమాత్రమున నది ప్రథమగ్రంథ మని గ్రహింపవలయునా? అవఱకు రచించినవానిలో నది యుత్కృష్టమగుటచే దానిని గ్రహించియుండవచ్చును. "నైషధాదిమహాప్రబంధములు పెక్కు చెప్పినాఁడ" వని కాశీఖండమున నుండుటచే శ్రీనాథుని గ్రంథములలో నైషధము మొదటి దనుట యుక్తమా? మఱియు నరసభూపాలీయమే మొదటి దనుటకుఁ గొన్నియాధారము లగపడుచున్నవి. పైని వ్రాయఁబడు నంశములు చదువరులకు బాగుగా బోధపడుటకై యిచ్చట ముందుగా వంశవృక్షముల వ్రాయుచున్నాను.

## కృష్ణదేవరాయలవారి వంశవృక్షము.

నరసరాజు




కృష్ణదేవరాయలు మృతినొందినపిదప నతని తమ్ముఁ డగు నచ్యుతదేవరాయలును దత్పుత్రుఁ డగు వేంకటరాయలును వరుసగా రాజ్యాధిపతులైరి. వేంకటరాయల యనంతరమునఁ దత్పితృవ్యపుత్త్రుఁ డగు సదాశివరాయలు రాజ్యాధిపతి కావలసియుండఁగా నచ్యుతదేవరాయనిభార్యకు సోదరుఁ డగు సలకయ తిమ్మరాజు రాజ్యము నాక్రమించుకొనెను.

## వసుచరిత్ర కృతిపతి వంశవృక్షము.

ఆర్వీటిబుక్కరాజు

రామరాజు



పయి నుదాహరించినవారిలో నళియరామరాజు కృష్ణదేవరాయలకు నల్లుం డగుటచే సలకయ తిమ్మరాజుచేసిన యక్రమము నోర్వక వాని జయించి సదాశివరాయలను రాజ్యాధిపతిగాఁ జేసి తాను దత్ప్రతినిధిగ రాజ్యము నేలుచుండెను. ఈవిషయము లీక్రిందిపద్యములవలన స్పష్టపడును.

"ఉ. ఆపటుకీర్తి రామవసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయధా
త్రీపతిసార్వభౌమదుహితృప్రియుఁడై వితతప్రతాపసం
తాపితశత్రుఁడై యల సదాశివరాయనిరంతరాయవి
ద్యాపురరాజ్యలక్ష్మికి నిదానము తా నయి మించె నెంతయున్."

(రామాభ్యుదయము. ఆ. 1. ప. 44.)

"సీ. ఖలు నతిద్రోహి సల్కయతిమ్మని హరించి సకలకర్ణాటదేశంబు నిలిపె

... ... ... ... ... ... ... ...

భూమి నొకరాజమాత్రుఁడె రామవిభుఁడు." (నరసభూపాలీయము. ఆ. 1. ప. 82.)

నరసభూపాలీయకృతిపతియగు నరసరాజునకు మేనమామలగు కోనవిభు ప్రభృతులలోఁ గృష్ణరాయనియల్లుఁడగు రామరాజు నరసభూపాలీయకృతిప్రదానకాలమున సదాశివరాయనికిం బ్రతినిధిగా రాజ్యముచేయుచు నుండవచ్చును. కావుననే నరసభూపాలీయమున నరసరాజువంశముమాత్రమే వర్ణింపఁబడక నరసరాజునకు మేనమామలగు రామరాజును దత్సోదరులును వర్ణింపఁబడిరి. సార్వభౌమ ప్రతినిధి యగు రామరాజునకు మేనల్లుఁ డని వర్ణించుటయు నరసరాజున కొక ఘనతయేకదా.

నరసభూపాలీయమునఁ గోనవిభుప్రభృతులను వర్ణించుటలో నొకరినైన భూతకాలిక క్రియచే నిర్దేశింపకుండుటచేతను వసుచరిత్రమునఁ గోనవిభుప్రభృతులను వర్ణించుటలోఁ గోనవిభునిఁ దిమ్మరాజును రామరాజును భూతకాలిక క్రియలచే నిర్దేశించుటచేతను గోనవిభు తిమ్మవిభు రామరాజులు నరసభూపాలీయకాలమునకు జీవించియున్నా రనియు వసుచరిత్రకాలమునకు మృతినొంది రనియు నూహించుటకుఁ గొంత యవకాశ మున్నది. మఱియు నరసభూపాలీయకాలమునకు రామరాజు తురుష్కులచే వధింపఁబడుటగాని విజయనగరరాజ్యవిప్లవముగాని జరిగియున్న ట్లగపడదు.

"సీ. ఖలు నతిద్రోహి సల్కయతిమ్మన హరించి సకలకర్ణాటదేశంబు నిలిపె." నని నరస భూపాలీయమున వర్ణింపఁబడి యున్నది.

సలకయతిమ్మని జయించి కర్ణాటరాజ్యము కృష్ణరాయలవంశమునకు నిలిపినట్లుగ నిందు వర్ణింపఁబడినదిగాని విజయనగరరాజ్యవిప్లవము సూచింపఁబడలేదు. ఇంతియగాక రామరాజును దురుష్కులు వధించి విజయనగరము నాక్రమించుకొనినపిదపఁ దిరుమలదేవరాయలు మిగిలినరాజ్యమునకు రాజయ్యె, పెనుగొండను రాజధానిగఁ జేసికొనెను. అట్లు నరసభూపాలీయకాలమునకే రాజ్యాధిపతియై యున్న యెడల వసుచరిత్రమునందువలె నీకావ్యమునందును దిరుమలరాజు జీర్ణకర్ణాటరాజ్యపునరుద్ధారి యనియుఁ దిరుమలదేవరాయ లనియు వర్ణింపఁబడియుండును.

"సీ. తనభుజాదండకోదండ మఖండమై యనువేలశరవృష్టి నాచరింపఁ;
దనహేతిశతకోటి ఘనధారధళ్యమై ప్రతిపక్షబలభిదాపటిమ నెఱపఁ;
దనవిగ్రహంబు సజ్జనమనోహారియై మంజుఘోషాశ్లేషమహిమఁ దెలుగఁ;
దనవైభవంబు సంతానసమగ్రమై సురభిసంభృతగుణస్ఫురణఁ జెంద;

"తే. రాజదేవేంద్రుఁ డితఁ డనఁ దేజరిల్లు, ననఘచాళుక్యనారాయణాంకవివిధ
బిరుదమన్నెవిభాళాదిబిరుదశాలి, ప్రాభవోపేతుఁ డెఱతిమ్మపార్థివుండు.

(నరసభూపాలీయము. ఆ. 1. ప. 84.)

అని యిట్లు సామాన్యముగా నెఱతిమ్మరాజని తిరుమలదేవరాయలు వర్ణింపఁబడెను. విజయనగర రాజ్యపునరుద్ధరణమే యితఁడు చేసి యావఱకు సార్వభౌముఁ డై యున్నయెడల నట్టి ముఖ్యవిషయములు వర్ణింపక యిట్లు సామాన్యముగా వర్ణించి యుండఁడుగదా? వసుచరిత్రమం దిట్లు గాక విజయనగర రాజ్యవిప్లవమును దిరుమలదేవరాయలు చేసిన కర్ణాటరాజ్య పునరుద్ధరణమును వర్ణింపఁబడుటచే నరసభూపాలీయముకన్న వసుచరిత్రమే వెనుకటి దని స్ఫురించును.

"సీ. జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి నెవ్వాని లోకేశ్వరత్వము పొసంగు..."

"క. ... ... ... కర్ణాటకాంధ్రధరణీపునరు
ద్ధారికిఁ దిరుమలదేవ మ, హారాయాగ్రణికి..." (వసుచరిత్రము. ఆ. 1. ప. 13, 90.)

నరసభూపాలీయకాలమునకుఁ దిరుమలరాజు పట్టభద్రుఁడు కాకుండుటనే యెఱతిమ్మపార్థివుఁ డని వర్ణింపఁబడెను. పిదప కర్ణాటరాజ్యసార్వభౌముఁ డగుటచేఁ గర్ణాటసార్వభౌము లగు కృష్ణదేవరాయలు మొదలగువారికి వర్తించుచున్న దేవరాయ లను బిరుదముచేర్చి తిరుమలదేవరాయ లను నామముతో వసుచరిత్రమున వర్ణింపఁబడె ననియుఁ దోఁచుచున్నది కాఁబట్టి నరసభూపాలీయము మొదటి గ్రంథ మనియు వసుచరిత్రమే ద్వితీయగ్రంథ మనియు గ్రహించుట యుచితము.

ఇఁకఁ గవితారీతియు బట్టుమూర్తియే రామరాజభూషణుఁ డనియు వసుచరిత్రము ద్వితీయ గ్రంథ మనియు సూచించుచున్నది. ఈ విషయమున శ్రీ వీరేశలింగముపంతులుగారు గ-గుణితు యుక్తుల కనుబంధముగఁ గొంతవఱకుఁ గవులచరిత్రమున వ్రాసియున్నారు. కవులు స్వపూర్వ పూర్వ గ్రంథములలోని యభిప్రాయములు, పద్యముల నడకలరీతులు తమ యుత్తరోత్తరగ్రంథములందుఁ జమత్కరించుచుందు రనుట నిర్వివాదాంశము. రామరాజభూషణుఁడే వసుచరిత్రచ్ఛాయలను గొన్నిటిని ద్వ్యర్థికావ్య మగు హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు సయితము చూపియున్నాఁడు.

"సీ. ఒకచాయ ననపాయపికగేయసముదాయ మొకసీమ నానామయూరనినద,
మొకవంక నకలంకమకరాంకహయహేష, లొకక్రేవ వనదేవయువతిగీతము..."

(వసుచరిత్రము. ఆ. 2. ప. 7.)

"సీ. ఒకచోట మఖవాటహుతహవ్యగంధంబు లొకచాయ ననపాయహోమవహ్నులు...
... ... ... ... ... ...
ఒకవంక నకలంకయోగివర్యసపర్య, లు..." హరిశ్చంద్రనలోపాఖ్యానము. (ఆ. 3. ప. 7.)

"సీ. స్వామి యై నిగమాతిభూమి యై సురపురోగామి యై యబ్ధిజాకామి యుండ;
హరి యై హాలహాలాహరి యై భవదంశుధారి యై ప్రసవాయుధారి యుండ;..."

(వసుచరిత్రము. ఆ. 4. ప. 36.)

"సీ. శర్వలక యబ్జారిధరుని పైఁ బాదంబు సంఘటించిన ద్విజస్వామి యుండఁ;
బట్టుమహారంభేశభావంబు గని యక్షపదరూఢి నెఱపు గీర్వాణుఁ డుండఁ;..."

(హరిశ్చంద్రనలోపాఖ్యానము. ఆ. 1. ప. 25.)

ఈరీతిని దుర్ఘట మగు ద్వ్యర్థికావ్యమునందును స్వశ్లేషప్రకటనము తెలియుచున్నదిగదా! ఇట్లే నరసభూపాలీయచ్ఛాయలు వసుచరిత్రమున సామాన్యముగఁ గల కొన్ని పద్యములసంఖ్య నిట నుదాహరించెదను.

| నరసభూపాలీయము | | వసుచరిత్రము | |
|---|---|---|---|
| ఆశ్వాసము | పద్యసంఖ్య | ఆశ్వాసము | పద్యసంఖ్య |
| 1 | 1 | 1 | 1 |
| 5 | 205 | 1 | 56 |
| 1 | 90, 117 | 1 | 34, 107 (ఆ. 6. ప. 69.) |
| 1 | 90 | 1 | 36, 65 |
| 1 | 85, 92 | 1 | 57, 62, 72, 76, 82 |
| 1 | 78 | 1 | 73 |
| 3 | 141 | 4 | 111 |
| 4 | 78 | 2 | 88 |

ఇంకను బూర్తిగ నరసభూపాలీయరీతులు గల పద్యముల నుదాహరించెదను.

"సీ. ఒకటి యక్షరవిలాసోన్మేషమున మించ నొకటి తాళప్రౌఢి నుల్లసిల్ల;
నొక్కటి నారికేళోన్నతిఁ దాల్ప నొక్కటి గోస్తనీగుచ్ఛకలనఁ దనర;
నొకటి సువృత్తభావోన్మేష మొందఁ నొక్కటి వల్లకీతుంబికలనఁ జెలఁగ;
నొకటి భారవిశేషయుక్తిఁ బెంపొంద నొక్కటి గిరీశమతానుకారి గాఁగ;
తే. నసమసాహిత్యసంగీతరసము లనెడు, గుబ్బపాలిండ్లు దాల్చు పల్కులవెలంది
సరసగుణహారు నోబయనరసధీరు, నవ్యకృతినాయకుని గా నొనర్చుఁ గాత!"
(నరసభూపాలీయము. ఆ. 1. ప. 4.)

"మ. సకలామోదకతాళవృత్తగతులన్ సంగీతసాహిత్యనా
మకవిద్యాయుగళంబు పల్కుఁజెలికిం బాలిండ్లజోడై సిరుల్
ప్రకటింప న్నఖరేఖలందు నలఘుప్రస్తారము ల్సేయు న
ర్వకళాకాంతుఁడు బ్రోచుఁ దిర్మలమహారాయక్షమావల్లభున్." (వసు. ఆ. 1. ప. 3.)

వీనిలో నరసభూపాలీయపద్యమున శ్లేషభంగిని సాహిత్యసంగీతములతో సరస్వతీస్తనద్వయమునకు సాధర్మ్య మధికముగాఁ జూపఁబడినను గల్పనములకుఁ బరస్పరైకకంఠ్యము లేదు. సంగీతరూపకుచ మొకమాఱు తాటిపండుతోడను, మఱియొకమాఱు వల్లకీతుంబితోడను, వేఱొకమాఱు పర్వతముతోడను నొక్క పద్యమునందే వర్ణించుటలో సారస్యములేదు. మఱియు సంగీతసాహిత్యములను ద్వంద్వసమాసము ప్రసిద్ధమును, శ్రుతిహితమును నయి యుండును గాని సాహిత్యసంగీతము లనునది యట్లుండదు. కాఁబట్టి నరసభూపాలీయపద్యమును మార్చి వసుచరిత్రపద్యము చమత్కరింపఁబడిన దని తోఁచుచున్నది. ఇంతియకాక సరస్వతీస్తనద్వయమును సంగీతసాహిత్యములుగా నిరూపించి

యందు బ్రహ్మదేవుని నక్షత్రాదు లుభయసాధారణముగఁ బ్రస్తారరేఖలుగా వర్ణించుట మిగుల నుజమ త్కారముగ నున్నది. సంగీతమున స్వర ప్రస్తారమును సాహిత్యమున వృత్తాదిరూప మగు ఛందః ప్రస్తారమును సుప్రసిద్ధములే గదా; అందు సాహిత్యపక్షమున వలఘుశబ్దముచే స్ఫురించు గోరువంక వంటి గురుసంజ్ఞను నక్షత్రముగా వర్ణించుట స్వారస్యముగా నున్నది. అలఘుశబ్దముచేఁ సుచగౌరవ మును సూచింపఁబడుచున్నది. మఱియు నిందు బ్రహ్మదేవుని సర్వకలాకాంతుఁ డని వర్ణించుట సాభి ప్రాయముగా నున్నది. కాఁబట్టి పైవర్ణనము లేక కవికర్తృకము లనియు వసుచరిత్రమ్మే ద్వితీయ గ్రంథ మనియుఁ జెప్పుటయె యుచితము.

"శా. గంగం దాల్చితి వుత్తమాంగమున నం గైకోలుగావించి త
ద్ధాంగీకార మనం బురంధ్రి! నిను వామాంగంబునం దాల్పనే
శృంగారోన్నతిఁ జూడు మంచు గిరిజన్ శీర్షాపగాబింబిత
స్వాంగానందితఁ జేయు శంభుఁడు గృతిస్వామిం గృపం బ్రోవుతన్."

(నరసభూపాలీయము. ఆ. 1. ప. 5.)

"శా. ఆమందాకిని మాళిఁ బూని నను నర్ధాంగీకృతం జేసి తా
నా మేల్మే లని యార్య యల్గఁ బ్రణతుం డై తత్పదాంభోజయో
గామర్షంబున గంగయు న్మోఱయఁ జూడాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున వేఁడు శంభుఁడు కృతిస్వామిం గృపం బ్రోవుతన్."

(వసుచరిత్రము. ఆ. 1. ప. 5.)

పైపద్యములలో వసుచరిత్రపద్యమునందుఁ బార్వతికిఁ గోపము దీర్పఁబోయి యాశ్వరుఁడు గంగకును గోపమును దెప్పించుకొనె ననియు, నరసభూపాలీయమున నట్లుగాక పార్వతికి శీర్షాపగా ప్రతిబింబరూపమున నుత్తమాంగస్థితిని గల్పించి నేర్పుగా నోదార్చె ననియు శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. నరసభూపాలీయము ద్వితీయగ్రంథ మను తమ యభిప్రాయమున కిది కొంతబలముగ నున్న దని వారి యభిప్రాయము గాని నరసభూపాలీయమునఁ జెప్పినట్లు పార్వతిని శీర్షాపగా ప్రతిబింబితను జేయుటకు నామె పాదములం దీశ్వరుఁడు వ్రాలక తటస్థింపదుగదా! అట్టి స్థితిలో గంగ కోపించుట సహజముగనే యుండును. అట్లు వ్రాలునపుడు వ్రేలునట్టి చూడాభోగమును సవరించుకొను మిషంబున గంగను బ్రార్థించియు నట్టి యంశము తెలియకుండఁ బార్వతికిని బ్రీతిచేసి యి ట్లుభయలను సంతోషింపఁ జేసె నని వర్ణించుట మిగుల సరసముగ నున్నది. కావున నీ వసుచరిత్ర పద్యము నరసభూపాలీయ పద్యమును సవరణ చేయుచున్న దనుట యుచితము. మఱియు గంగను శిరంబున ధరించితి వని యల్గిన పార్వతి నోదార్ప నామె పాదములపై వ్రాలె నని చెప్పుటచే నామెను శీర్షాపగా ప్రతిబింబితను జేసి యానందింపఁ జేసె నను నర్థము సైతము గర్భిత మయియే యున్నది. ఏకారణమున నామె యల్గెనో దానికి సరిగ నోదార్పకున్న నట్టి యలుక తీరదు గదా! పాదములపైఁ బడి బ్రతిమాలుటయుఁ బ్రతిబింబవశమున నుత్తమాంగస్థితిఁ జూపుటయు, గంగను సైత మామె పాద ములపైఁ బడునట్లు చేయుటయుఁ, బార్వతీ కోప నివారకములును, నామెకుఁ బ్రీతిజనకములును గాఁగా నట్టి కారణములచేతనే గంగయు నల్గినది. అప్పు డిది యంతయుఁ గపట కృత్య మనియు నీ సవతి నెట్లు మోసపుచ్చుచుంటినో చూడు! చూడు! మనియు గంగను గోఁకుచు సంజ్ఞచేసి యామెను సంప్రీతచిత్తగా నొనరించె నను వసుచరిత్ర పద్యమునం గల చాతుర్యము మిగుల శ్లాఘ్యముగ నున్నది.

మఱియు వసుచరిత్రమునందుఁ గల యార్యామందారకినీ శబ్దములయొక్క యర్థాంతరము మిగుల స్వారస్యముగ నున్నది. మఱియు నరసభూపాలీయ పద్యమునం దమర్పఁజాలని కొఱఁతఁ దీర్చు కొనుచు రామరాజభూషణుఁడు వసుచరిత్ర పద్యమున 'నానా మేళ్లే లని యార్య యల్ల' నని ప్రయోగించినాఁడు. పయికారణములచే వసుచరిత్ర పద్యమే నరసభూపాలీయ పద్యము జమత్కరించుచున్న దని స్ఫురింపక పోదు. ఈరీతి ప్రయోగ మీ కవికి మిగుల నిష్టమని

"శా. ... ... వేటొక్కతం గాల్చినాఁ డో లే యంచుఁ దలంచునో యని..."
యను నరసభూపాలీయప్రథమపద్యభాగము సూచించుచున్నది.

"చ. అరుదుగ వామభాగలలనాకలనాచలనాత్ముఁ డైన యా
హరు గురుఁ గాంచి తానును దదాకృతి యాగతి నేకదంతుఁ డై
కరికరిణీగుణంబులు మొగంబునఁ దాల్చి జగంబు లేలు నాం
తరకరుణాసనాథుఁ గణనాథు మరుద్గణనాథుఁ గొల్చెదన్."
(నరసభూపాలీయము. ఆ. 1. ప. 6.)

"సీ. ఘనఘనాఘనలక్ష్మి నెనయు కొప్పిరుగడ నిరుగడఁ దరుణాబ్జకృతవతంస;
మురుచిత్రకాగ్ని శిఖోన్మేష మిరువంక నిరువంకఁ గుండలిస్ఫురితకర్ణ;
ముడివోనిమిన్కు లీనెడుపేరు లిరుదెస నిరుదెసఁ గమఠబంధురకరంబు;
నెఱిమించు చిఱుతపన్నియచేల మిరుమేన నిరుమేన రతిమనోహరవిభూతి;
తే. యమర ననోన్యవేషభేదాసహిష్ణు, భావవిభవంబుఁ దెలుపుచుఁ బరమమైత్రి
మగనిసామేన నిలిచిన యగతనూజ, ప్రథనజయ మిచ్చుఁ దిరుమలరాయమణికి."
(వసుచరిత్ర. ఆ. 1. ప. 6.)

వినాయకుఁడు తండ్రితో సారూప్యము నొందె ననుటకన్న నీశ్వరునకు నర్ధాంగమున నొప్పు చున్న పార్వతి భర్తృసారూప్యమును బొందిన దని వర్ణించుట సరసముగా నుండును గాన నిచ్చటను వసుచరిత్ర పద్యమే నరసభూపాలీయ పద్యమును జమత్కరించుచున్నది.

"సీ. ఎవ్వాఁడు మొదలఁ దా నిలకు భారతి డించెఁ దగ భగీరథుఁ డభ్రతటినిఁ బోలె?
భ్రమరకీటన్యాయభాతి నేకవిరాజు వాగ్దేవి తానె యై వన్నె కెక్కె?
వరపృత్తములు మాని వాణి యెవ్వానికై వలచి నానాశ్లేషములకుఁ జిక్కె?
నెవ్వాని వాఙ్మాత్ర మినుని ధాత్రికిఁ దెచ్చి పేర్మితోఁ గరము లర్పించుకొనియె?
"తే. నట్టి మహిమాధికులఁ గొల్చి యఖిలమునివ, చోనుపమకీర్తిభృతపురాణార్థవితతు
లనుఁగుఁదెనుఁగను భవ్యదివ్యాంజనమునఁ, గనుఁగొనఁ గఁ జేయు నంధ్రసత్కవులఁ దలఁచి.
(నరసభూపాలీయము. ఆ. 1. ప. 8.)

"సీ. భువిఁ గవితాకన్యఁ బుట్టించె నెవ్వాఁడు? బడి నాగమములెల్ల నడిపె నెవ్వఁ?
డేను నీ వనుమాట లెనయించె నెవ్వాఁడు? కోమలపదలీలఁ గూర్చె నెవ్వఁ?
డనఘుతులాకోటి నలరించె నెవ్వాఁడు? నిఖిలగుణంబుల నేర్పె నెవ్వఁ?
డినకరసంప్రాప్తి నెసఁగించె నెవ్వాఁడు? రహి వించె నర్థగౌరవము నెవ్వఁ?

తే. డట్టి వాణీగురుత్వమహత్త్వఖనుల, ఘనులఁ బ్రాచేతస, వ్యాస, కాళిదాస,
దండి, భవభూతి, మాఘసత్కవి, మయూర, భారవుల, భారవుల నాత్మఁ బ్రస్తుతింతు."
(వసుచరిత్రము. ఆ. 1. ప. 9.)

ఇచ్చట సైతము నరసభూపాలీయపద్యమును వసుచరిత్రపద్యకల్పనము చమత్కరించుచునే యున్నది.

"మ. వదనాగ్రంబున వాణి యున్నది మము న్వాక్రువ్వనీ దిందిరా
మదిరాక్షీమణి యున్న దక్షుల మము న్మన్నించి వీక్షింపనీ
వదియుం గాక నృసింహ! నీవిపులబాహాశ్లేష మే నొంద నో
ర్వదు భూదేవి బహుప్రియారత నిను బ్రార్థింప నింకేటికిన్."
(నరసభూపాలీయము. ఆ. 3. ప. 141.)

"చ. జలనిధిరాజకన్య కనుసన్న మెలంగుచు నుండు వాణియున్
మెలఁగును మాటలోన నెలమిం జేయిసన్నఁ జరించుఁ గీర్తి నీ
లలితభుజోపగూహననివాసము మానదు ధాత్రి సద్గుణో
జ్జ్వలనరసింహ మంత్రబలవంతులకింతులు చిక్కుటబ్రమే.(నరసభూపాలీయము.ఆ.5.ప.187)
ఇట్లే యీగ్రంథమున సరస్వతీవ్యభిచారము మఱికొన్నిచోట్లను
(ఆ. 3. ప. 40, 129.) వర్ణింపఁబడినది.

"సీ. అనుఁగుఁదమ్ములఁ బాసి కనుసన్నల మెలంగు నిందిరఁ దృణముగా నెంచు ననిన
గూర్మాసనాభ్యాసకర్మఠ యై భజించు ధరిత్రిఁ జులుకగాఁ జూచు ననిన
మధురాధరస్పందవిధివశంవద యైన భాష నొండొకమాఱు పల్కుఁ డనిన
నాత్మపాణిస్పర్శనాయత్తమగు కీర్తి నెనసి దిక్కులకడ నునుచు ననిన
"తే. జగతిఁ గొఱనోమునోఁచిన జలజముఖులఁ, గూరిమి గణించి యతఁ డేల గారవించు
వరుని బహువల్లభామనోహరునిఁ గోరు, ముదిత ముదితయె యని బాల మోము వాంచు."
(వసుచరిత్రము. ఆ. 4. ప. 111.)

(ఇట్లే 3. ఆ. 94 వ పద్యమునందు శక్తిత్రయవ్యభిచారము గలదు.)

ఈవర్ణనములందును నరసభూపాలీయపద్యమును వసుచరిత్రపద్యగతకల్పనములు చమత్కరించుచునే యున్నవి. నైషధరీతుల ననుసరించుట రామరాజభూషణునకు స్వభావ మని యీవఱకు విశదపఱచియే యున్నాను. అట్టి యభిప్రాయము నరసభూపాలీయరచనాకాలమునకే యీతనికున్నదని తోఁచుచున్నది.

"శ్లో. శృణ్వ న్సదార స్తదుదారభావం హృష్య న్ముహు ర్లోమ పులోమజాయాః;
పుణ్యేన నాలోకత నాకపాలః ప్రమోదబాష్పావృతనేత్రమాలః.
శ్లో. సాపీశ్వరే శృణ్వతి తద్గుణౌఘాన్ ప్రసహ్య చేతోహరతోర్ధశంభుః;
అభూ దపర్ణాంగులిరుద్ధకర్ణా కదా న కండూయనకైతవేన.
శ్లో. అలం సజన్ ధర్మవిధౌ విధాతా రుణద్ధి మౌనస్య మిషేణ వాణీమ్;
తత్కంఠ మాలింగ్య రసస్య తృప్తాం న వేద తాం వేదజడ స్సవక్రామ్.

శ్లో. శ్రియ స్తదాలింగనభూ ర్న భూతా వ్రతక్షితిః కాపి పతివ్రతాయాః;
సమస్తభూతాత్మతయా న భూతా తద్భర్తు రీర్ష్యాకలుషాణు నాఽపి."

(నైషధము. సర్గ. 3. శ్లో. 29,30,31,32.)

మహాకవియగు శ్రీహర్షుఁడును నసౌచిత్యశంక విడిచి స్వభావప్రకటనమున కై యిట్లు వర్ణించి యుండుటచేత నే గావలయు రామరాజభూషణుఁడు పైరీతి వర్ణించియున్నాఁడు. అందుఁ గొంతవఱ కౌచిత్యపోషణమునకై యర్థాంతరరహితములను శచీ, పార్వతీ, వ్యభిచారరూపవర్ణనములను విడిచి యంతటను నర్థాంతర ముండునట్లుగనే రెండు గ్రంథములందును రామరాజభూషణుఁడు వర్ణించినాఁడు. సరస్వతికిని భూదేవికిని శ్రీదేవికిని నిట్లు శ్లేషగర్భితము లగు వ్యభిచారవర్ణనములు కవిసమయసిద్ధములే యగుటచేత నంతగా నౌచిత్యహాని కల్గిన దని తలఁపఁజనదు.

"శ్లో. కస్తై చి త్కపటాయ కైటభరిపూరఃపీఠదీర్ఘాలయాం
దేవి! త్వాం ప్రణిపత్య కుప్యసి నచే ద్వ్యత్క్రంచి దాచక్ష్మహే,
య త్తే మందిర మంబుజన్మ కి మిదం విద్యాగృహం యచ్చ తే
నీచాన్నీచతరోపసర్పణమపామేతత్క్రమాచార్యక" మ్మని యిట్లు మురారికవి వర్ణించి యున్నాఁడు. ఇ ట్లనేక కవులవర్ణనములు గలవు. గ్రంథవిస్తరభీతి నిట నుదాహరింపలేదు.

శ్రీనాథుఁడు పై నైషధశ్లోకముల నాంధ్రీకరింపలేదు. ఔచిత్యహానికి వెఱచి యిట్లు విడిచి పెట్టెనని యందమన్న శ్రీనాథుఁడు శృంగారనైషధమున మఱికొన్నిచోట్ల నట్టినియమము పాటింపలేదు కాన నీవిషయమునను గారణము మృగ్యము.

"శ్లో. న కా నిశి స్వప్నగతం దదర్శతం జగాద గోత్రస్ఖలితే చ కా న తమ్;
తదాత్మతాధ్యాతథవా రతే చ కా చకార న స్వస్య మనోభవోద్భవమ్."(నై.ష.స.1.శ్లో.30.)

"తే. వానిఁ గలలోనఁ గాంచని వనజముఖియు, వాని మార్పునఁ బేర్కొని మానవతియు
వానిఁ గా నాత్మ భావించి వరునిఁ గవయ, నప్పళింపని సతియు లేదయ్యె నచట."

అని యిట్లు శ్రీనాథుని శృంగారనైషధమునందును బతివ్రతల కందఱకును వ్యభిచారము వర్ణింపఁబడి యున్నది. నరసభూపాలీయరచన కాలమునకె యిక్కవికి శ్రీహర్షమార్గానుసృతి యంకురించె ననుటకు మఱియొక యుదాహరణము నిచ్చుచున్నాను.

"శ్లో. అపి ద్విజిహ్వాభ్యవహారపౌరుషే ముఖానుషక్తాయతపల్లవల్గయా;
ఉపేయివాంసం ప్రతిమల్లతాంరయ స్మయే జితస్య ప్రసభం గరుత్మతః." (నై.స.1.ప.64.)

"వ. ... ... పల్లవల్గానుష క్తవదనతావిడంబిత వక్త్రస్థభుజగవైనతేయంబును,
... ...అగు నొపవాహ్యంబు నారోహంబుచేసి..."(శృం. నై. ఆ. 1.ప. 85.)

"మ. వరవల్గావిభవంబు దష్టభుజగవ్రాతంబు గా సింగిణుల్
గురుపక్షద్వితయంబుగాఁగ నరసక్షోణీశ్వరారూఢ మౌ
తురగోత్తంసము నిందిరాహృదయనాథుం దాల్చు ప్రత్యక్షబం
ధురపక్షీంద్రునిలీలఁ జూచు నహితస్తోమంబు భీమంబుగాన్."(నరసభూపాలీయ.ఆ.5.ప.207.)

నరసభూపాలీయమునందలి యిట్టి నైషధానుసృతులు మూర్తి రామరాజభూషణుల, యైక్యవాదమునకుఁ గొంత యాధారములే యనవచ్చును.

"మ. వరవక్త్రేందువిలాసకృన్నవవయోవర్షావసానంబునం
దరుణీశైశవసింధు లింకుసెడఁ దత్తత్కాలలక్ష్యంబు లౌ
సరసాంతస్థితగండశైలములనం జందోయి యంతంతకుం
బరగుం దత్క్రమశోషరేఖలనఁ గన్పట్టున్వళీపుంజముల్." (నరసభూపాలీయము.ఆ.3.ప.30.)

"చ. కలికిముఖేందుకాంతి కరకాంతవయోజలదాంతవేళ వ
ర్తులకుచగండశైలములు దోఁప వళిత్రయశోషరేఖ లిం
పలరఁగ మధ్యసీమ బయలై కటిసైకత మొప్పు బాల్య మ
ర్బలునది యింకుచో మెఱసె నాభిగభీరజలాశయం బనన్." (వసుచరిత్రము. ఆ. 2. ప. 39.)

ఇచ్చటను నరసభూపాలీయపద్యమునకన్న వసుచరిత్రపద్యమే విశేషకల్పనావిషయభాసుర మై దానిని జమత్కరింప రచించిన ట్లగపడుచున్నది. ఇట్టి పద్యైక్యములు కవుల యభిన్నతకుఁ బ్రబలాధారము లనవచ్చును.

"క. వాలిక లై వెలిదమ్ముల, పోలిక లై చందమామపులుఁగులకును దా
మేలిక లైన నిరీక్షణ, మాలికల నృసింహుఁ జూచె మదవతి వేడ్కన్."

(నరసభూపాలీయము. ఆ. 2. ప. 86.)

"చ. తొలుదొలుతన్ విలోలగతిఁ దొంగలిఱెప్పల నాని కర్ణకం
దలరుచి ధాళధళ్యములఁ దాఁకున సల్లనఁ గ్రోంచి మించు లై
వెలువడి పూర్ణచంద్రు పయి వెన్నెలపుల్గులచాలు వ్రాలు లీ
లల విభుమీఁద వ్రాలె నవలా నవలాలితదృష్టిజాలముల్." (వసు. ఆ. 3. ప. 49.)

ఇచ్చట నరసభూపాలీయపద్యములోని "చందమామపులుఁగులకును దామేలికలైన" యనునది వసుచరిత్రమున నెంతసొగసుగఁ జమత్కరింపఁబడెనో చదువరులే గ్రహింతురుగాక; శ్రీ వీరేశలింగము పంతులుగారు గురుతుయుక్తులకు వ్రాసిన యనుబంధములో నిట్లే రెండుగ్రంథములందలి వేఱొకచోటఁగల పద్యైక్య ముదాహరింపఁబడెను. (ఆమోదంబున ... ... (నరసభూపాలీయము. ఆ-2. ప-135.) రామత్మావరు...(వసుచరిత్రము ఆ. 1. ప. 78) ఇట్టి యభిప్రాయైక్యపద్యైక్యములును నుత్తరోత్తరచాతుర్యమును విమర్శించినచోఁ గవు లభిన్ను లనియు, వసుచరిత్రమే ద్వితీయగ్రంథ మనియుఁ దోఁపక పోదు.

ఒక పక్షమునఁ బిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శకుంతలాపరిణయములో నున్న

"క. వాలిక లై విరిదమ్ముల, యేలిక లై భావభవుని యెలఁదూపులకుం
బోలిక లై యుత్కలికల, మాలిక లై యబలఁ దాఁకె నొగి నృపుచూపుల్. (ఆ-2.)

అను పద్యము ననుసరించి నరసభూపాలీయమున (వాలికలై.......(ఆ. 2. ప.86.) అనునది విరచింపఁబడినట్లును, శ్రీనాథ పినవీరభద్రులరీతులను పెద్దనాదు లనుసరించినట్లును, విభిన్నులైన బట్టుమూర్తి రామరాజభూషణు లిట్లు పరస్పరానుసృతిగ రచించియుందు రనఁ జనదాయని యంద మన్నది సరికాదు. పూర్వోదాహృతములగు గ్రంథములలోని యనుసృతులు నరసభూపాలీయ వసుచరిత్రముల యనుసృతులవంటివి కావు. పద్యముల నడకలరీతులును, కల్పనారీతులును, కథాసంవిధానమార్గములును, వానిలో ననుసరింపఁబడినవి కాని యిట్లభిప్రాయైక్యపద్యైక్యములు వేర్వేఱుకవులు గ్రహించి యుండలేదు. మఱియుఁ దమకుఁ బూర్వు లయి తమ గౌరవమునకుఁ బాత్రు లయి సుప్రసిద్ధు లయి యుండువారిగ్రంథముల ననుసరించుట సహజముగాని సమకాలికుఁడు విశేషించి జ్ఞాతియు మఱియుఁ

దనకంటె నప్రౌఢుండు నగు వానిగ్రంథమునుండి పద్యచౌర్యము నభిప్రాయచౌర్యమును రామరాజ భూషణునివంటి మహాకవి చేయఁగోరునా ?

"గీ. అసమసాహిత్యరసమును వసువుపాలు, చేసి తత్పోషణార్థంబు వాసి నరస
రాజు సద్గతి భజియించి రామరాజు, శివపదముఁ జేరెఁ దేరును భువిని విడిచి."

యను చాటువువలన వసుచరిత్రరచనకుఁ బరమున నరసభూపాలీయము రచింపఁబడిన ట్లగపడు నని కొంద ఱందురు. కాని యీనిరాకరమగు చాటువు నమ్మఁదగినది కాదు. నమ్మినను దీని కర్థమే లేదు. మఱియు నిది వసుచరిత్రముచేసిన పిదపఁ దన పోషణమునకు నరసరాజునే భజించె నని స్ఫురింపఁ జేయునుగాని నరసభూపాలీయము ద్వితీయగ్రంథ మని సూచింపఁజాలదు. ఇంతియకాక సార్వభౌము లగు రామరాజ తిరుమల దేవరాయలు తన కగ్రహారాదు లిచ్చి విశేషముగ సన్మానించినట్లు కవి చెప్పుకొనియుండుటచే నిది విశ్వసనీయముగ నుండలేదు.

## ౙ గుఱుతుయుక్తి విమర్శనము.

అనేకులు పూర్వగ్రంథకర్తలు వీ రభిన్ను లని వ్రాసియున్నారా ?

ఈవిషయమున నాంధ్రకవులచరిత్రములో రామరాజభూషణునిచరిత్రము ననుబంధమునందు 2, 4, 5 వ విషయములను శ్రీ వీరేశలింగముపంతులవారు ప్రబలముగ వ్రాసియున్నవిషయము లీవఱకు నుదాహరించియున్నందున నిట వేఱుగ వ్రాయలేదు. రామరాజభూషణునకు సమీపకాలమువారగు సోమనాథకవి మండలక్ష్మీనరసింహాచార్యులవ్రాఁతలును, లక్షణదీపికాగ్రంథములోని నిదర్శనములు శ్రీ వీరేశలింగముపంతులవా రుదాహరించియుండఁగా బయివానికిఁ బ్రతిపక్షులు సమాధానము వ్రాయ లేదు. కాని మఱియెవ్వరో యీయభేదమును వ్రాసినవారు చరిత్రవిషయములలోఁ దప్పులు వ్రాసిరి గనుక నిట్టివి నమ్మరాదని శ్రీ పూండ్ల రామకృష్ణయ్యపంతులుగారు వ్రాసినారు. "పైవిధముగ వ్యాఖ్యానములలో వ్రాసినవారిని మే మెఱుఁగము గాని వారివలెనే వ్రాసి ప్రకటించిన యొక్కరిద్దఱి వ్రాఁతల స్వారస్యమును జూడుఁ" డని వ్రాసి యెనమండ్రము వేంకటరామయ్యగారి వ్రాఁతలను రామకృష్ణయ్య పంతులవారు విమర్శించిరి.

మఱియు నప్పకవి "ఓలంబాలక" యను వసుచరిత్రములోని పద్యమునందలి యతివిషయమున స్వగ్రంథమునఁ జర్చించునపుడు "లోలంబాలక" యను పదము రామరాజభూషణకవిహృదయ" మని వ్రాసియున్నాఁడు గాని బట్టుమూర్తికవిహృదయ మని వ్రాసియుండఁడయ్యె నను కారణము నుదాహరించి వసుచరిత్రము మూర్తికవి విరచితము గా దని శ్రీ పూండ్ల రామకృష్ణయ్యపంతులుగారు వ్రాసి యున్నారు. మూర్తికవియే రామరాజభూషణుండై యున్నప్పు డొకపే రప్పకవి గ్రహించినంత మాత్రమున రెండవపే రాతనిది కా దని యెట్లు స్థిరపడును? ఇట్టి బలహీనములగు యుక్తులు గ్రంథోదాహరణములతో వ్రాసిన శ్రీ వీరేశలింగముపంతులవారి యుక్తులను ఖండింపఁజాలవుగదా ! ఇఁక నీ విషయమున గురజాడ శ్రీ రామమూర్తిపంతులుగా రేమియు సమాధానమునే చెప్పలేదు. ఒక్కచోట నిట్టివ్రాఁతలు గతానుగతికము లని మాత్రము వ్రాసియున్నారు.

## చ. ఛ. గుఱుతుయుక్తుల విమర్శనము.

రామరాజభూషణునకు శుభబిరుదము గలదా ?

రామరాజభూషణుఁ డనునది బిరుదమా ?

నరసభూపాలీయమున "శుభమూర్తినామధేయు" నని కవి తన్నుఁగుఱించి చెప్పుకొనియుండి హరిశ్చంద్ర నలోపాఖ్యానమున "రామవిభుదత్తశుభచిహ్న విభవయుతుఁడ" నని చెప్పుకొనుటచే రామరాజభూషణునకు 'శుభ' యను బిరుదము గల దని వీరేశలింగముపంతులవారు వ్రాసియున్నారు. ఈవాదమువలన హరిశ్చంద్రనలోపాఖ్యాన నరసభూపాలీయము లేకకర్తృకము లనుట స్థిరపడును గాని రామరాజ శుభచిహ్నము నిచ్చె నని వాదించుటచే రామరాజభూషణుఁ డనునది రామరాజదత్తమగు బిరుదనామమనుట కనుపడదు కావుననే "రామవిభుదత్త శుభ చిహ్న విభవయుతుఁడ" ననుదానిచే నిక్కువికి రామరాజు "రామరాజభూషణుఁ" డను బిరుదము నిచ్చెననువాదము స్వరసోక్తిగా గ్రహింపక కేచిన్మతముగా వీరేశలింగముపంతులవా రుదాహరించిరి. కాననే రామరాజభూషణుఁ డనఁగా రామరాజున కలంకారమువంటివాఁ డని విశేషణముగా వీ రర్థము చేసిరి. అట్లయినచో నాశ్వాసాంతగద్యములందు "సాహిత్య రసపోషణ రామరాజభూషణ" యను వాక్యాంతమువఱకు విశేషణ నామములే యైనఁ గృతికర్త యెవ్వరో యెట్లు తెలియు నని శ్రీపూండ్ల రామకృష్ణయ్యపంతులుగా రాక్షేపించిరి. ఆశ్వాసాంతగద్యములందైన కవినామమును వేఱొక్కనకుండుట యప్రసిద్ధము గాన నీ యాక్షేపణము సరిగనే యున్నది. మఱియు "రామనృపభూషణాఖ్యసుకవి" ననుచో నాఖ్యశబ్దము వీరేశలింగముపంతులవారి వాదమునకు బాధక మనియు, నీ "శుభ" యను బిరుదము నొసంగిన రామరాజునకుగాని, స్వీకరించిన రామరాజభూషణునకుఁ గాని పౌరుషాతిశయ మైనను విద్యాతిశయ మైనను, నేమైనఁ గన్పడుచున్నదా గనుఁ" డనియు నిట్లు వీ రాక్షేపించిరి. ఈ యాక్షేపణములును సయుక్తికముగనే యున్నవి. కాన వీరేశలింగముపంతులవా రస్వరసముగా వ్రాసినవాదమే సయుక్తికముగ నున్న ట్లగపడుచున్నది. "రామవిభుదత్త శుభచిహ్నవిభవయుతుఁడ" ను దానిచే రామరాజు నిక్కువికి రామరాజభూషణుఁ డను బిరుదము నిచ్చె నని గ్రహించుట యుచితము కావుననే రామభూషణకవి యనియు, రామనృపభూషణుఁ డనియు, రామరాజభూషణుఁడనియు నిట్లు గ్రంథములం దుపయోగింపఁబడెను.

కాని పూండ్ల రామకృష్ణయ్యపంతులవా రీవాదమును సైత మంగీకరింపలేదు. రామరాజభూషణుఁ డనునది "రామరాజుయొక్క యాస్థానమునం దుండుటచేత వచ్చిన బిరుదాంకము" అని వ్రాసుచ్చునెడ బట్టుమూర్తితండ్రిపే రగునట్టి 'వేంకటరాయభూషణ' శబ్దమునకును నిట్లే యర్థము చెప్పి సమర్థింపవచ్చునుగదా! ఇంతదనుక వేంకటరాయభూషణుఁ డొక యనామకుఁడుగాఁ గనుపడుచున్నాఁడు గాని యేసంస్థానమున నైన విద్యాతిశయముచేఁ బ్రఖ్యాతినొందినట్లు గానము. గాన రామరాజభూషణుఁ డనునపుడు వేంకటరాయభూషణుఁ డనునపుడును, నిందలి "భూషణ" శబ్దములు వారివంశములోనివారు సామాన్యముగ వాడుకొను నామములని తలఁపవలయు" నని వ్రాసియున్నారు. ఇట్లే రామరాజభూషణుఁ డనుదానిలోని రాజశబ్దమును బట్రాజులకు సహజముగ నుండఁదగిన రాజశబ్దముగ సమర్థించిరి. "రామవిభుదత్త శుభచిహ్నవిభవయుతుఁడ" ననుచో రామరాజుచే నీయఁబడిన మంగళకరములైన యాందోళికాదిచిహ్నములు గలవాఁ డని యర్థము చెప్పిరి. కాని "రామవిభుదత్త" యనుదానికి రామరాజభూషణబిరుదమే యియ్యఁబడిన ట్లర్థము చేయుట సరసముగా నుండున ట్లగపడుచున్నది. భూషణశబ్దము వీరికి వంశనామమై యున్న ట్లగపడదు. నరసభూపాలీయమున,

"గీ. ...ప్రబంధాంకసింగ, రాజసుత తిమ్మరాజపుత్త్ర ప్రసిద్ధ, పరపవేంకటరాయభూషణసుపుత్త్ర."

నని చెప్పఁబడినది. ఇందు వివాదస్థిత వేంకటరాయ భూషణునకే భూషణబిరుదమున్నది గాని తక్కినవారికి లేదు. పద్యమునందేగాక యాశ్వాసాంతగద్యమునందును "ప్రబంధాంక వేంకటరాయభూషణసుపుత్త్ర తిమ్మరాజపౌత్త్ర" యని యున్నది గాని తిమ్మరాజునకు భూషణపదము చేర్పఁబడలేదు. ఇట్లే హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందును,

"గీ. శ్రీకరమహాప్రబంధాంకసింగరాజ, తిమ్మరాజప్రియతనూజధీరసూర, పాత్మజుఁడ......" నని చెప్పఁబడినది గాని యెవ్వరికైన భూషణపదము చేర్పఁబడలేదు. కాన భూషణపదము వీరికి వంశానుగతమనుట యుక్తియుక్తముగా లేదు. వేంకటరాయభూషణుఁ డనామకుఁడనుటకుఁ బ్రబలాధారములేవియు లేవుగదా! పైడిమఱ్ఱి వేంకటపతి పేర్కొనిన (చంద్రాంగ చరిత్రమున) కృష్ణరాయభూషణుఁ డప్రసిద్ధుఁడయి యుండలేదా? చూ. కవుల చరిత్ర. ఇట్లే వేంకటరాయల యాస్థానమున రామరాజభూషణుని తండ్రియగు సూరపరాజుండుటచేత నాతనికి వేంకటరాయభూషణ బిరుదము వచ్చియుండును. నరసభూపాలీయమున గద్యమునందును బద్యమునందును "వేంకటరాయభూషణ" యనియే వ్రాయఁబడినది గాని పూండ్ల రామకృష్ణయ్యపంతులు గారు చెప్పినట్లు బట్రాజులకుండురీతి "వేంకటరాజభూషణ" యని లేనందున నీపేరు వేంకటరాయల యాస్థానమునం దుండుటచే లభించిన బిరుదమే యనియు భూషణపదము వీరికి వంశానుగతము కా దనియుఁ జెప్పుట సమంజసముగా నున్నది.

## రు. గుఱుతు యుక్తివిమర్శనము

రామరాజభూషణుఁడు దత్తుఁ డగునా?

ఆశ్వాసాంత గద్యములందును, గవి తన్నుఁగూర్చి చెప్పుకొనిన పద్యములందును స్వనామ పితృనామములు నరసభూపాలీయమున నొకరీతిగను, వసుచరిత్ర హారిశ్చంద్ర నలోపాఖ్యానముల నొకరీతిగను నుండుటచే నట్టివిరోధమును సరిపుచ్చుకొనుటకయి రామరాజభూషణుఁడు సూరపరాజున కౌరసుఁడనియు వేంకటరాయభూషణునకు దత్తుఁ డనియుఁ బాలకపితయగు వేంకటరాయభూషణుఁడు రామరాజభూషణునకు శారదామూర్తి యని నామాంతర ముంచుకొనె ననియు శ్రీ వీరేశలింగముపంతుల వారు సమర్థించియున్నారు. ఇట్టికల్పనకు హారిశ్చంద్ర నలోపాఖ్యానములోని "సూరపాత్మజుఁడ" ననుదానిని, నరసభూపాలీయములోని "వేంకటరాయభూషణసుపుత్త్రు" ననుదానిని నాధారముగ గ్రహించిరి. మఱియుఁ "దా గడించిన వసుచరిత్రమున" నను చాటువుచే నీ దత్తతను స్థిరపఱచిరి గాని యావిషయమును శ్రీ పూండ్ల రామకృష్ణయ్యపంతులుగా రంగీకరింపక కొన్ని ప్రబలములగు నాక్షేపణములు చేసియున్నారు.— "ఆత్మజుఁ డనఁగాఁ దనవలనఁ బుట్టినవాఁ డనిగాని లేక తానే పుత్త్రరూపముగ జన్మించినవాఁ డనియుఁ, బుత్త్రుఁ డనఁగా బుం యను నరకమువలన సంరక్షించువాఁ డనియు నిటుల శబ్దవ్యుత్పత్తు లుండఁగా నాత్మజశబ్దముమాత్ర మౌరసునియందు నిర్ణయించి వ్రాయుటకు రావుబహద్దరుగారి కేమి యాధారము లున్నవో వాని న్వినుటకు సంతసించుచున్నారము...... "ఆత్మా వై పుత్త్రనామాసి" యను శ్రుతి యాత్మజుఁడే పుత్త్రుఁడని నిర్ణయించుటంబట్టి......సుపుత్త్రశబ్దము దత్తునియం దన్వయించుట యనర్థకము. మఱియుఁ బున్నామ మను నరకమునుండి రక్షించువాఁడు దత్తుఁడే యయి కన్నవాఁడు కాకపోయినయెడలఁ గొడుకులఁ గనియున్నవారు నరకసంరక్షణమునకు నిఁక దత్తుఁజేసికొనినఁగాని పునర్గతి లేదు కాబోలు" ననియు,

"గీ. తాగడించిన వసుచరిత్రమునఁ గన్న, తండ్రి సూరన వెలయించి తలఁపఁ డయ్యె
నన్ను మన శారదామూర్తి నాఫలంబె, దత్తుఁ డగువానిఁ జేపట్టఁ దరమె నాకు."

అను నీపద్యములోని విషయముల నాలోచింపఁగా గన్నతండ్రియగు సూరనను వసుచరిత్రమునందెచటను రామభూషణకవి యుదహరించియుండనందునఁ బాలకతండ్రియగు వేంకటరాయభూషణుని యార్తధ్వనులన్నియు మిథ్యాధ్వను లని గ్రంథమునుబట్టి తీర్మానించవలసినది" యనియు నిట్లాక్షేపించి యీ చాటువు నమ్మఁదగినది కా దని వ్రాసియున్నారు. ఈవిషయమున శ్రీ పూండ్ల రామకృష్ణయ్యపంతులు గారు వ్రాసిన యాక్షేపణములలోఁ బై నుదాహరించినవి సయుక్తికముగ నున్నవి. కాన నీదత్తౌరసకల్పనము సరిగా దని విశదమగుచున్నది. కాఁబట్టి రామరాజభూషణ బిరు

తము విషయమున నూచే వ్రాయఁబడినట్లు వేంకటరాయభూషణనామము సూరపరాజునకు బిరుదనామముగ గ్రహించినయెడల నిట్టి దుర్బలకల్పనమున కవసరముండదు. ఇచ్చట శ్రీపూండ్ల రామకృష్ణయ్యపంతులుగారు వసుచరిత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యానములను బట్టియు నరసభూపాలీయమును బట్టియు సంగ్రహించి వ్రాసిన బట్టుమూర్తి రామరాజభూషణుల వంశవృక్షము వ్రాయుచున్నాను.




ఇందుఁ దిమ్మరాజున కిద్దఱుపుత్త్రు లనుటకు బదులుగాఁ దిమ్మరాజు కుమారుఁడు సూరపరా జనియు నాతనికి వేంకటరాయభూషణుఁ డనునది బిరుదనామ మనియుఁ, దత్పుత్త్రుఁడు మూర్తి యనియు నాతనికి రామరాజభూషణుఁ డనునది బిరుదనామ మనియుఁ బయిని వ్రాసినకారణములచే నంగీకరించిన నిర్బాధకముగ నుండును. మొదట సామాన్యముగ బట్రాజగు బట్టుమూర్తి నరసభూపాలీయమును రచించిన పిదప ననన్యసామాన్యమగు రామరాజభూషణుఁ డను బిరుదము నందియుండుటచేఁ దదభిరుచి ననంతర గ్రంథములం దట్టి బిరుదమునే వ్రాసికొనియుండును. కాఁబట్టి తద్గ్రంథత్రయమునఁగల గద్యపద్యములు విభిన్నరీతుల నున్నవని శంకింపఁ బనిలేదు. మఱియు హరిశ్చంద్ర నలోపాఖ్యానము నందలి సీసమునఁ దండ్రి పేరు సూరపరా జని చెప్పుటకును కోటు చాలనందున సూరపుఁ డని చెప్పినాఁడు. కావున నందు నామాంతరమును జెప్పుకొనకుంట శంకాస్పదము కానేరదు. రామరాజభూషణుఁ డక్కాలమున మహాప్రసిద్ధుఁ డయి యుండుటచే నాతనికిఁ దన నామధేయమునకే యట్టి సంశయావస్థ దటస్థించు నని స్ఫురింపక పోవచ్చును. అట్లె స్ఫురించినచో మూఁడు గ్రంథములందును మఱి యొక్కొక్క పద్యమును జేర్చి స్పష్టముగాఁ జెప్పునా? మఱి రెజిష్టరు (Register) చేయించునా?

## ఘ. గుఱుతు యుక్తివిమర్శనము

బట్టుమూర్తియే రామరాజభూషణుఁ డను జనశ్రుతి నమ్మఁదగినదా?

ఈవిషయమునఁ బూండ్ల రామకృష్ణయ్యపంతులుగా రిట్లాక్షేపించియున్నారు. "విషయమును సంపూర్ణముగా లోకము విచారింపక పోవుటయే యీజనశ్రుతి వ్యాప్తియగుటకుఁ గారణము. కారణమున్నను లేకపోయినను రావుబహద్దరుగారు యిక్కవిపట్ల మాత్రము జనశ్రుతిని శాసనసమానముగా నెంచి నన్నయ తిక్కనాదుల చారిత్రములలో జనశ్రుతిం బరిపాటింపకుండుటకుఁ గారణ మేమి చెప్పెదరో తెలియకున్నది. 'ఇంక బట్టుమూర్తి రామరాజభూషణు' లొక్కరే యని పండితపామరులెల్ల నీయంశమునఁ బొరఁబడుటకుఁ గారణ మేమి యన నీ యిరువురు నేక కాలీనులగుటవలన, హనుమదుపాసకులగుటంబట్టి పెదతండ్రి పినతండ్రి బిడ్డలగుటచేత బట్టువంశజు లగుకతమున కవితయం దించు

మించుగ సమానగుటం జేసి లోకమున కెయ్యిరువురి గ్రంథము లొకపరి సంప్రాప్తములయి కవుల భేదములు సంపూర్ణముగఁ దెలియక, బట్టుమూర్తి యను నామాంతరముగలిగి రామరాజభూషణకవి వసుచరిత్రము రచించినాఁడను పుక్కిటి పురాణమును నిఘంటువులయందును బత్త్రికలయందును, బండితులు ధారాళముగ వ్రాయుటంబట్టి" యని యిట్లభేదతాభ్రమకు గారణముల నుడివిరి. కాని యివి యైక్య వాదమునే బలపఱుచుచున్నవి. ఉభయుల కవిత యొక్క రీతినే యున్న దను మొదలగునవి యభేద వాదమునకే సాధకములుగదా. ఇఁక వీరు విభేదవాదమునకు మూలాధారముగాఁ జూపుచున్నది యాశ్వాసాంతగద్యల విభిన్నప్రవృత్తియే. ఇది చదువరులు గ్రహింపరాని యంతటి మాఱుమూల విషయము కాదే! ఆశ్వాసాంతగద్యమును జదువనట్టియు నది యర్థముచేసికొన లేనట్టియు జదువరు లుందురా? పోనిండు. తక్కిన భాగము లెట్లైనను స్పష్టముగాఁ దెలియు కవిపేరు గ్రహింప లేకుందురా? అరయనరయ నీగద్యల విభిన్నప్రవృత్తి కవుల విభేద ప్రతీతినే పుట్టింప వలసియున్నది. అట్లయినను రామరాజభూషణుఁడు సుప్రసిద్ధుఁ డగుటచే నట్లు కాకపోయె నని గ్రహింపవలసి యున్నది. ఇఁక నన్నయతిక్కనాదుల చారిత్రములందుఁ గొన్ని జనశ్రుతులు ప్రబలములగు కారణాంతరములచే నమ్మఁబడకుండుట యిచ్చట జనశ్రుతి నమ్ముటకు బాధక మగునా? లోకప్రసిద్ధము లగు జనశ్రుతుల నిరాకరించుట కిట్టి బలహీనములగు యుక్తులు సాధకములగునా? మఱియు శ్రీ వీరేశలింగము పంతులుగా రుదాహరించిన రీతిని రామరాజభూషణునకు సమకాలికుల గ్రంథములందును నిటీవలివారి గ్రంథములందును బట్టుమూర్తి వసుచరిత్రము రచించినట్లు వ్రాయఁబడియుండుట కేమి సమాధానము?

ఈ జనశ్రుతియేగాక వేఱువేఱుసందర్భములలో వాడఁబడుచున్న మఱికొన్ని జనశ్రుతులుసైత మీ విషయమును సూచించుచున్నవి. ఏడ్పుపద్యముల విషయమునఁ దెనాలిరామకృష్ణకవి పలికినట్టు ప్రసిద్ధమైయున్న "యల్లసానిపెద్దన యటునిటు నేడ్చెను. ముక్కుతిమ్మన్న ముద్దుముద్దుగా నేడ్చెను. బట్టుమూర్తి బావురని యేడ్చె" నను నైతిహ్యముసైతము బట్టుమూర్తియే వసుచరిత్రమును రచించినట్లు వెల్లడిసేయుచున్నది. వసుచరిత్రములోని "యాజాబిల్లి" యను పద్యమునకేగదా రామకృష్ణకవి యిట్టి యభిప్రాయ మిచ్చెను.

సీ. ప్రౌఢదీర్ఘసమాసపదములఁ గూర్చి శ్రీశ్లాఘుండు మాలాశ్చ సైషథంబు ;
దానితల్లన నల్లసానిపెద్దన చెప్పె మంధి మదిదప్పి యాముక్తమాల్య ;
దూహించి తెలియరాకుండ సూరపరాజు భ్రమఁ గళాపూర్ణోదయము రచించె ;
నతిశ్లేష శబ్దవాగాడంబరం బొప్పఁ బన ఘటించెను మూర్తి వసుచరిత్ర..." యను తెనాలి రామకృష్ణుని చాటుపద్యము సైతము నావిషయమునే చెప్పుచున్నది.

మఱియు నల్లసానిపెద్దన కుమారుఁడు విద్యాభ్యాసమున రుచిలేక తిరుగుచుండఁగాఁ జూచి పెద్దనార్యుఁడు శిక్షించె ననియు నందుపయిని విదుషియగు పెద్దనార్యునిభార్య "మీశిష్యుఁడగు బట్టు వానిపాటి శ్లేషముక్కలు చెప్పుకొనుశక్తి గలుగకపోదు. ఏల యంతకఠినముగా శిక్షించెద?" రని పల్కె నని యొక యైతిహ్యము కలదు. శ్లేషకవనమున రామరాజభూషణుఁ డావఱకే నిపుణుఁడై యుండె ననియు నితఁడే బట్టుమూర్తి యనియుం నీ యైతిహ్యము సూచించుచున్నది. "ముప్రత్యయా భావస్య అల్లసానిపెద్దనార్య శిష్యేణ బట్టుమూర్తినుకవినా విరచితే వసుచరిత్రే" యను పూర్వోదాహృతమగు మండలక్ష్మీనరసింహాచార్యులుగారి యాంధ్రకౌముదీసూక్తి పై యైతిహ్యమును గొంతవఱకు బలపఱచుచున్నది. ఇట్టివి మఱికొన్ని జనశ్రుతులుకలవు గాని గ్రంథవిస్తరభీతిచే నిట నుదాహరింప లేదు.

# నాల్గవ భాగము.

---

రామరాజభూషణుఁడు నరసభూపాలీయమునఁ దెనుఁగున లక్షణములు రచించి వానికి లక్ష్యముగ వసుచరిత్రమును రచించె ననుజనశ్రుతియుఁ గలదు. అయ్యది కొంతవఱ కిచ్చట విశదపఱుపఁ బడుచున్నది.

"తే. ఇంకఁ గావ్యస్వరూపంబు లేర్పరింతు, విగతదోషములును గుణాన్వితము లధిక
లసదలంకారభావోపలక్షితములు, నైన శబ్దార్థములు కావ్య మనఁ దెలంగు.

కం. తనువగు శబ్దార్థంబులు, ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనరుగుణంబులు గుణములు, ఘనవృత్తులు వృత్తు లౌర కావ్యేందిరకున్!"

(నరసభూపాలీయము. ఆ. 2. ప. 52, 53.)

"తే. వ్యంగ్యము ప్రధాన మైనను నప్రధాన, మైన నస్ఫుట మైన గావ్యము త్రిసంఖ్య
నమరు నుత్తమమధ్యమాధమత ధ్వనిగు, ణీకృతవ్యంగ్యమును జిత్ర మై కడంగి."

(నరసభూపాలీయము. ఆ. 2. ప. 91.)

"తే. ఇఁకఁ గావ్యప్రభేదంబు లేర్పరింతు, వరుస నష్టాదశవిశిష్టవర్ణనములు
గలుగవలయు మహాకావ్యతిలకమునకు, నెలమిఁ దన్నామధేయంబు లెట్టి వనిన.

కం. పుర సింధు నగ ర్త్విన శశి, సరసీ వన మధు రతిప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయ నయ, విరచన యాత్రాజి దౌత్య విభువర్ణనముల్.

తే. ఇందు నొకకొన్ని కడ మైన నెంచిచూడ,నదియు నవని మహాకావ్య మనఁగఁ బరఁగు..."

(నరసభూపాలీయము. ఆ. 2. ప. 165, 166, 167.)

పైనుదాహరించిన మహాకావ్యలక్షణముల కీ వసుచరిత్రము లక్ష్య మనుట సర్వసమ్మతమే గదా? ఇందలి ధ్వనిప్రధానతయు వ్యంగ్యప్రాచుర్యమును ముందు వివరింపఁబడును. నగరాది వర్ణనము లీవఱకుఁ జూపఁబడియున్నవి.

వసురాజునం దుత్తమనాయక లక్షణములు గిరికయం దుత్తమనాయికా లక్షణములును జూపఁబడినవి. శుక్తిమతీకోలాహల వర్ణనములు వసురాజును జూచునప్పటి పురస్త్రీల వర్ణనములు నితరములగు మఱికొన్ని నాయికా లక్షణములకు లక్ష్యభూతము లయియున్నవి. ఇక్కావ్యము శృంగారరసప్రధాన మైన దగుటచేత నిం దోజఃప్రభృతి గుణంబులు నారభటీ వృత్తియు, గౌడీరీతియు నంతగా నగపడవు. ఇక మాధుర్య ప్రసాదాది గుణములకును, కైశిక్యాది వృత్తులకును, వైదర్భీప్రభృతి రీతులకును, నిది యాలవాలమై యున్న దనవచ్చును.

"తే. కైశికి చెలంగు శృంగారకరుణలందు, నారభటి రౌద్రబీభత్సహారిణి యగు
నలరు భారతి హాస్యశాంతాద్భుతముల, నమరు సాత్వతి వీరభయానకముల." నని నరస
భూపాలీయమునఁ జెప్పఁబడి యున్నది.



"శ్లో. చిత్తద్రవీభావమయో హ్లాదో మాధుర్య ముచ్యతే,
సంభోగే కరుణే విప్రలంభే శాంతేఽధికం క్రమాత్.

"శ్లో. ఓజ శ్చిత్తస్య విస్తారరూపం దీప్తత్వ ముచ్యతే,
వీరబీభత్సరౌద్రేషు క్రమే ణాధిక్య మస్యతు."

అని సాహిత్యదర్పణమున నున్నది. (606, 607, 609.)

వృత్తులలోఁ గైశిక్యారభటులును, రీతులలో వైదర్భీగౌడులును, గుణములలో మాధుర్యౌజః ప్రసాదములును ముఖ్యములై యున్నవి. ఇందును మాధుర్య కైశికీ వైదర్భులకును, నోజ ఆరభటీ గౌడులకును బరస్పరభేద మంతగా లక్ష్యవిషయమున నగపడదు.

ఈ క్రింద వ్రాయఁబడు సంఖ్యలు గల వసుచరిత్రములోని పద్యము లయ్యీవాని కుదాహరణము లని యెఱుంగునది.

| వృత్తులు. | రీతులు. |
|---|---|
| కైశికి. ఆ. 3. ప. 49. | వైదర్భి. ఆ. 3. ప. 40. |
| సాత్వతి. ఆ. 2. ప. 153. | పాంచాలి. ఆ. 2. ప. 151. |
| భారతి. ఆ. 2. ప. 152. | గౌడి. ఆ. 2. ప. 102. |
| ఆరభటి. ఆ. 2. ప. 102. | రీతిలక్షణములు నరసభూపాలీయమునఁ (ఆ. 2. ప. 79.) జెప్పఁబడియున్నవి. |
| వృత్తులనుగుఱించి నరసభూపాలీయమునఁ (ఆ. 2. ప. 72) జెప్పఁబడియున్నది. | |

| గుణములు. | పాకములు. |
|---|---|
| మాధుర్యము. ఆ. 2. ప. 128. | ద్రాక్షపాకము. ఆ. 3. ప. 79. |
| శ్లేషము. ఆ. 1. ప. 140. | నారికేళపాకము. ఆ. 3. ప. 67. |
| ప్రసాదము. ఆ. 4. ప. 87. | శయ్య. ఆ. 4. ప. 36. |
| సౌకుమార్యము. ఆ. 3. ప. 159. | నరసభూపాలీయమునఁ బాకమునుగుఱించి (ఆ. 2. ప. 85. శయ్యనుగుఱించి (ఆ. 2. ప. 88.) యును జెప్పఁబడియున్నది. |
| సమత. ఆ. 2. ప. 63. | |
| అర్థవ్యక్తి. ఆ. 2. ప. 64. | |
| ఔదార్యము. ఆ. 2. ప. 156. | |
| ఓజము. ఆ. 2. ప. 150. | |
| కాంతి. ఆ. 3. ప. 83. | |
| సమాధి. ఆ. 2. ప. 26. | |
| గుణములనుగుఱించి నరసభూపాలీయమునఁ (ఆ. 4. ప. 56.) జెప్పఁబడియున్నది. | |

ఈ ప్రబంధము శృంగారరసప్రధానము కాఁబట్టి "ఆద్యః కరుణబీభత్సరౌద్రవీరభయానకైః ... ... ...ఇ త్యాఖ్యాతా విరోధితా." యను (3. పరి. 242.) విశ్వనాథసూక్తి చొప్పున నిందుఁ గరుణాదిరసము లంతగా వర్ణింపఁబడలేదు. అట్లయినను శుక్తిమతి గోలాహలుఁ డాపఁగా నయ్యాపగ పొంగుటచే జనులు తల్లడిలి వసురాజుతో మొఱపెట్టనాతఁ డాగిరి నుగమీటె నను సందర్భమునందును మఱికొన్నిచోట్లను, గరుణాదిరసము లరుదుగ వర్ణింపఁబడినవి.

వసుచరిత్రమునందు:—

కరుణారసము. ఆ. 2. ప. 141, 142, 143; ఆ. 1. ప. 123.

భయానకరసము. ఆ. 2. ప. 155.

రౌద్రరసము. ఆ. 2. ప. 150

వీరరసము. ఆ. 2. ప. 151, 152, 153, 156; ఆ. 2. ప. 102.

బీభత్సరసము. ఆ. 2. ప. 153, 155. (దీనిలోఁ గబంధముయొక్కయుఁ, గోలాహలుని విశీర్ణపక్షతాదులయొక్కయు, వర్ణనము బీభత్సరసాత్మక మని గ్రహించునది.)

"రసౌ శృంగార బీభత్సౌ.........వైరిణౌ మిథః." యనుచొప్పున శృంగారబీభత్సరసములు, కేవలము పరస్పరవిరుద్ధము లగుటచే నతిసూక్ష్మముగ నిందు బీభత్సము చూపఁబడె నని యెఱుంగునది.

హాస్యరసము. ఆ. 2. ప. 3, 4; ఆ. 3. ప. 65, 66; ఆ. 5. ప. 122.

అద్భుతరసము. ఆ. 4. ప. 96; ఆ. 3. ప. 45, 46; ఆ. 2. ప. 82, 83, 98.

శాంతరసము. ఆ. 4. ప. 64; ఆ. 6. ప. 95.

వత్సలరసము. ఆ. 3. ప. 27 మొ. 32 వఱకు.

విప్రలంభశృంగారము. ఆ. 3. ప. 74 మొ. ఆ. 4. ప. 123 వఱకు.

మన్మథదశావస్థలు. ఆ. 3. ప. 94 మొ. 99 వఱకు; ఆ. 3. ప. 106.

సంభోగశృంగారము. ఆ. 6. ప. 77 మొ. 97 వఱకు. ఆ. 3. ప. 48 మొ. 70 వఱకు. (ఇంకను నాయికానాయకుల పరస్పరదర్శనాదులును సంభోగశృంగారములోనివే గాన నిం దియ్యది పెక్కుచోట్లఁ గలదు. విస్తరభీతిచే నుదాహరింపలేదు.)

ఉద్దీపనవిభావములు. ఆ. 3. ప. 46, 102, 111; ఆ. 5. ప. 73; ఆ. 6. ప. 72, 73, 74, 106.

సాత్త్వికభావములు. ఆ. 3. ప. 98, 100, 106, 111; ఆ. 4. ప. 81; ఆ. 6. ప. 79.

సంచారిభావములు. ఆ. 3. ప. 82 మొ. 93 వఱకు; ఆ. 3. ప. 106, 111, 118, 119; ఆ. 4. ప. 81; ఆ. 6. ప. 11, 16.

రసాభాసము. ఆ. 2. ప. 110 మొ. 140 వఱకు.

రసాభాసశబ్దము లోకవ్యవహారమున మిగుల నికృష్టమైన యభిప్రాయమున వ్యవహరింపఁబడు చున్నది. కాని యిది మనుచరిత్రాది ప్రబంధరాజములందును వర్ణింపఁబడియుండుటచే నది నికృష్టవర్ణనము కానేరదు.

"అనౌచిత్యప్రవృత్తత్వే, ఆభాసోరసభావయోః,
ఉపనాయకసంస్థాయాం, మునిగురుపత్నీగతాయాం చ.
బహునాయకవిషయాయాం, రతౌ తథానుభయనిష్ఠాయాం,
ప్రతినాయకనిష్ఠత్వే, తద్వ దధమపాత్రతిర్యగాదిగతే.
శృంగారేఽనౌచిత్య" మ్మను దర్పణసూక్తి (3-పరి. 247.) చొప్పున వసుచరిత్రములోని శుక్తిమతీకోలాహలసమాగమ వర్ణనమున ననుభయనిష్ఠరతియుఁ, దిర్యగాదిగతరతియు వర్ణింపఁబడెను గాన నది రసాభాస మని యెఱుంగునది. ఇట్టివర్ణనము కథానాయకవిషయమున నైనచో దుష్టమే యగును గాని యన్యవిషయమున దుష్టము కానేరదు. ఇయ్యది మూలకథలోనిదే యగుటచేఁ దదను

సరణార్థ మిందును వర్ణింపఁబడినది. ఇట్టివి వర్ణనీయములే కానిచో నాలంకారికులచే నేల యలంకారములుగ గ్రహింపఁబడును?

"రసభావా తదాభాసా భావస్య ప్రశమ స్తథా, గుణీ భూతత్వ మాయాంతి యదాలంకృతయ స్తదా రసవత్ప్రేయడూర్జస్వి సమాహిత మితి క్రమా" త్తనుచొప్పున నీరసాభాసాదులు గౌణములైనచోఁ బ్రేయః ప్రభృత్యలంకారములగు నని సాహిత్యదర్పణమునఁ (10. పరి. 753.) జెప్పఁబడియున్నది. పై నుదాహరించిన రసాదిస్వరూపములు నరసభూపాలీయమున మూఁడవ యాశ్వాసమునఁ జెప్పఁబడి యున్నవి.

పైవానికి గ్రంథవిస్తరభీతిచే దిక్ప్రదర్శనముగ వసుచరిత్రములోని పద్యసంఖ్య లుదాహరించితిని గాని శృంగారరసాలవాల మగు తత్ప్రబంధమునందలి ప్రతిపద్యము నేదో యొకదానికి లక్ష్యమయియే యుండు నని చెప్పవచ్చును.

## నాటకరీతులు

రామరాజభూషణుఁ డీవసుచరిత్రమునఁ గొన్నిచోట్లను వాక్యోపవాక్యములతోడనే కథ పట్టులను నాటకరంగములందువలె నడిపించెను. మఱియుఁ గిరికాదులదరిఁ గపటయతి వసురాజాదుల ప్రవేశములును మంజువాణి వసురాజున కగపడుట, హారమువేయుట మొదలైనవియును, హాతాదాక్షిప్తములుగ నద్భుతరీతిని సందర్భపఱచియున్నాఁడు. ఇంతియగాక సూచ్యార్థసూచనము, పాత్రప్రవేశసూచనము మొదలగు నాటకరీతు లనేకములు గలవు.

### పాత్రప్రవేశసూచనము. (పాత్రప్రవేశము.)

"తే. గంధగజయాన గీతప్రబంధకలన, నలరి యతి వియ్యమై వచ్చు నరిది మగువ
లార కనుఁగొంటిరే యను నాళివాక్య, మొకటి వినవైన నద వేళ యొదవె ననుచు.

ఉ. మేలు లతాంగి! నీపలుకు మెచ్చితి నే యతి వచ్చుజాడ యే
లీల నెఱింగి తమ్మ బహుళీకృతచాతురి మించు నీవిపం
చీలలితారవామృతము చిత్తము సోఁకినవార లీకళా
శాలిని జూచి దీవెన లొసంగక పోవరుసుమ్ము నావుడున్." (వసు. ఆ-2. 81-82.)

"చ. విని కలకాకుఘోష మొదవించు మదాళిని పక్షగౌరవం
బెనయ నదల్చి మంజుగతి నీవనజాతములో మదీయశై
లనములకెల్లఁ దోడయి మెలంగఁగ నాకలహంసి రాదొకో
జననివయస్య యంచు నగజాత మదిం దలపోయుచున్నెడన్.

ఉ. ఆకలహంసి వచ్చి యచలాత్మజఁ గాంచి కుమారి! తాపసా
నీకము నీ కమూల్యశుభనిర్వహణంబు ఘటిల్లఁ గల్పకా
నోకహసూనరాజము లనూనమనూక్తులతో నొసంగినం
గైకొని తల్లి నిన్బిలువఁగాఁ బనిచెఁ విరులిచ్చు వేడుకన్." (వసు. ఆ-3. ప-71-72.)

"మ. లలనా! యీయెలనాగఁ బెండ్లియగు వాలాయంబు చేదిక్ష్మా
తలనాథుం డిది సమ్మవేని నిజమంత్రశ్రేష్ఠి రప్పింతు నా
నలనాసత్యసమానుఁ జూడు మని పంతం బొప్ప మాయాజపా
కలనాదంభము పూని మాని దిశ లాకర్ణించి మఙ్గాయనన్.

"మ. ఇది పంథింపఁగ వేళయంచు వసురాజేంద్రుండు సీరంధ్ర నీ
రదవారప్రతిసీర వెల్వడిన తారాభర్తలీలన్ లతా
చ్ఛదసంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగ భ్రమ
న్మదభృంగీరుతి వంధిమాగధకథామాధుర్యముం దెల్పఁగాన్." (వసు. ఆ. 3. ప. 44-45.)

కొన్నియెడల సంస్కృతనాటకచ్ఛాయల ననుసరించియున్నాఁడు. నాయకుఁడు లతాంతరిత గాత్రుఁడయి నాయిక నీక్షించుచు వర్ణించుట.

"మ. లతికాసంవృతగాత్రుఁడై నిజకథాలాపంబు లాలించుభూ
పతి యచ్చో హితునేర్పు బోటివచనప్రాగల్భ్యముం గన్యయు
న్నతగోత్రోద్భవవైభవంబును మది న్వర్ణించి యూహించె ధ
న్యత నాతు క్తిమతీర్థురీజనితరత్నం బాత్మవిత్తంబుగాన్." (వసు. ఆ. 3. ప. 37.)

నాయిక నాయకునొద్దనుండి వెడలిపోవునపుడు ప్రేమసూచకముగ మిషకల్పించుకొని నాయకు నీక్షించుట.

"చ. కలికియు నానృపాలకునిఁ గ్రమ్మఱఁ జూచుచు నేఁగె నేర్పుతో
నలఘుపదాంగదధ్వనికి నంచలు మూఁగిన నిల్చి నెయ్యపుం
జెలువలఁ గూడఁ బిల్చుగతిఁ జిల్కుఁ బార్శ్వలతాంచలంబులన్
ఫలము దెమల్చురీతి నళిపంక్తికి మోము మలంచుకై వడిన్." (వసు. ఆ. 3. ప. 78.)

గిరికాసంఘటనావిషయమున నర్మసఖుఁడను విదూషకునిసహాయము వర్ణించుటయు నాటక మార్గమే యనవచ్చును.

"శృంగారస్య సహాయా విటచేటవిదూషకాద్యా స్స్యుః,
భక్తా నర్మసునిపుణాః, కుపితవధూమానభంజనా శ్శుద్ధాః.
... ... ... ... ... ...
కుసుమవసంతాద్యభిధః, కర్మవపు ర్వేషభాషాద్యైః,
హాస్యకర, కలహారతి ర్విదూషక స్స్యాత్ స్వకర్మజ్ఞః."

అని విదూషకలక్షణము సాహిత్యదర్పణమునఁ (3 పరి. 77, 79.) జెప్పఁబడియున్నది.

"చ. అన మునిరాజువల్కు వనితాజనతావినుతాభిధేయుఁడై
యొనరినగౌతముణ్ మునికులోత్తముఁ జెప్పఁగ విందువే కదా!
యనఘ తదన్వవాయకలశాంబుధిఁ బుట్టినవాఁడ గౌతమా
ఖ్య నెసఁగువాఁడ నేఁ బరమహాసరసప్రతిభానుభావుఁడన్." (వసు. ఆ. 2. ప. 91.)

నాటకములయందుఁ దఱచుగఁ గృత్యాదిని నాందియుఁ, దుదను బ్రశస్తి యను నిర్వహణ సంధ్యంగమును నిలుపఁబడును. ఇందును నట్లే వానిఛాయలు కొంతవఱకుఁ గలవు.

"శా. శ్రీభూపుత్త్రి వివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్వలీ
లాభివ్యక్తి వరాంఘ్రిరేణుభవకన్యాలీల యంచు న్మదిం
దా భావింప శుభక్రమాకలనచేఁ దద్రత్నముం గప్పు సీ
తాభామాపతి ప్రోవుతం దిరుమలేంద్ర శ్రీమహారాయనిన్."

ఇందుఁ దక్కిన కొన్ని నాందీలక్షణములె గాక భావ్యర్థసూచనము గొంతవఱకుఁ గలదు. సీతావివాహవర్ణనము, గిరికావివాహమును, రత్నములందలి కన్యకాస్ఫూర్తి కోలాహలునకు గిరికపుట్టుటను, రామపాదక్రమణము వసురాజపాదనఖక్షిప్త కోలాహలకథను సూచించుచున్నవి.

"సీ. ఆరాజు విమలవిఖ్యాతిచంద్రిక నిచ్చ రహిఁ గెక్క జాఱె జారప్రసంగ;
మాఘనుదానధారాపూర్ణవర్ష మర్వరఁ బర్వ డిగియె నవగ్రహార్తి;
యాలోకహితుప్రతాపాతపం బవిరతోదయరూఢిఁ దగ నింకె దస్యుపంక;
మాసద్గుణాబ్ధిచర్యామృతం బెల్లచో దయివారఁ దెరలె నామయవిభూతి;
తే. యమ్మహాశైలదమను రాజ్యమున నిట్లు, ఫలము లీనెడు చెట్లతోఁ బాలవెల్లి
కాన్పుపసితో నఖండభోగములతోడఁ, బ్రజలు గాంచిరి భూరివైభవసమృద్ధి."
(వసు. ఆ. 6. ప. 99.)

ఇయ్యది వసుచరిత్ర కథాభాగములోని తుదిపద్యము, ఇందు దేశసుఖస్థితిరూపశాంతి వర్ణింపఁబడెను.

"నృపదేశాదిశాన్తిస్తు ప్రశస్తి రభిధీయతే" యని ప్రశస్తి యను నిర్వహణసంధ్యంగమునకు లక్షణము సంస్కృతనాటకములలో నాందిలోని యాశీర్వచన మేకరాజవిషయక మయియుండదు. ప్రశస్తిలోని శాంతియు, నాశీర్వచనరూపముగ నుండును. ఇం దట్లుగాక శ్రవ్య ప్రబంధరీతి కవిరుద్ధముగ నుండుటకై కృత్యాది పద్యములోని యాశీర్వాదము కృతిపతివిషయకముగ వర్ణింపఁబడెను. కృత్యంతమునఁ గథానాయకుని సామర్థ్యాతిశయస్ఫూర్తికై దేశశాంతి సిద్ధమె యయినట్లు వర్ణితమయ్యెను. మఱియు దృశ్యకావ్యములందుఁ గథావస్తువు పురాతనమే యైనను నప్పుడు జరుగుచున్నట్లు వర్ణించుట యావశ్యకము గాన నం దాశీర్వాదరూపశాంతి యుండుట సహజముగ నుండును. శ్రవ్యకావ్యమందుఁ గథావస్తువు పూర్వకాలమున జరిగినట్లు వర్ణింపఁబడును గాన నందు దేశశాంతి సిద్ధించిన దని వర్ణించుటయె సరసముగ నుండును. ఇట్లిందు నాటకరీతు లనేకములు గలవు గాని గ్రంథవిస్తరభీతి నిట విపులముగ నుదాహరింపనైతిని.

# అయిదవ భాగము

## అలంకారములు

రామరాజభూషణునకు మొదటినుండియు ననఁగా నరసభూపాలీయరచనాకాలము నుండియు, శబ్దాలంకారప్రధానముగను నర్థద్వయఘటనా ప్రధానముగను గవిత్వము చెప్పుట యిష్టముగా నున్నట్లు కనుపట్టుచున్నది. అట్టియభిప్రాయము క్రమక్రమముగా వసుచరిత్రరచనాకాలమునకు ముదిరినది. శ్లేషకవనము హరిశ్చంద్రనలోపాఖ్యానమునఁ బరిణతమయిన దనవచ్చును. విజయనగరరాజుల యాస్థానమున కలంకారభూతులగు నష్టదిగ్గజము లని పేరుగాంచిన (అల్లసాని పెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి, మాదయ్యగారి మల్లన, పింగళి సూరన, రామరాజభూషణుఁడు, తెనాలి రామకృష్ణుఁడు) మహాకవుల ప్రబంధములలో మొదటఁ బ్రబంధరాజ మగుట మనుచరిత్రమును గథాసంవిధానవిషయమున నిరుపమానమగుటఁ గళాపూర్ణోదయమును ద్వ్యర్థికావ్య మగుట రాఘవపాండవీయమును మిగులఁ బ్రసిద్ధి నొందియుండ, "సమానానా ముత్తమశ్లోకోఽ స్తు" నన్నట్లుగ లోకోత్తరప్రతిష్ఠాలోలుపుఁడగు రామరాజభూషణుఁడు మనుచరిత్రమునకన్న మిన్నయనఁదగు వసుచరిత్రమును శ్లేషవిషయమున ననేకవిధముల రాఘవపాండవీయముకన్న నుత్కృష్టమగు హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించి వాసిగాంచె నని చెప్పుదురు. మఱియు నరసభూపాలీయ మూలమున సంస్కృతాలంకారగ్రంథమార్గములను విపులముగాఁ జూపి యాంధ్రభాషకుఁ గల లోపమును దీర్చినాఁడు. కళాపూర్ణోదయమువంటి కల్పితకథ గల గ్రంథము రచింప నిష్టములేక "కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము" లని యిట్లు నిరసించె ననియుఁ జెప్పుదురు.

సాహిత్యరసపోషణుఁడగు రామరాజభూషణుఁడు "ప్రాయేణ యమకే చిత్రే రసపుష్టి ర్న విద్యతే" యనుచొప్పున రసప్రతిబంధకములగు యమకచిత్రాలంకారములలోఁ జిత్రాలంకారములను రస భూయిష్ఠమగు నీవసుచరిత్రమునఁ జూపనేలేదు. "కావ్యాంతర్గడుభూతాయాసాతు నేహ ప్రపంచ్యతే" యని యిట్లు విశ్వనాథపంచాననుఁడు బంధములు గావ్యమునకుఁ బుండువంటి వని చెప్పియున్నాఁడు. ఇఁక యమకము బంధములయట్లు రసప్రతిబంధకము గాదు గాని కొంతవఱకుఁ గవితాధార నాపు నని చెప్పక తప్పదు. కావుననె వసుచరిత్రమునందు యమకాలంకార మంతప్రచురముగా నిలుపఁబడలేదు. శ్రుతిహితమై రసోపస్కారకమయి వెలయు ననుప్రాసాలంకార మిం దత్యధికముగా నిలుపఁబడినది. సింహావలోకన ముక్తపదగ్రస్తాదులు తఱచుగా నాశ్వాసాంతపద్యములలోఁ జూపఁబడినవి

"అనుప్రాస శ్శబ్దసామ్యం వైషమ్యేపి స్వరస్య.........య" త్తనుచొప్పునఁ బలుమాఱు హల్లులసామ్య ముండునట్లు చెప్పిన ననుప్రాసము.

"క. సమవర్ణయుగాధికమై, యమరిననియమంబు యమక మగు"

ననుచొప్పున నచ్చులును హల్లులును బూర్తిగ వచ్చినరీతినే మరల వచ్చిన యమకము. వసుచరిత్రమున నిది యధికముగాఁ గానరాదు.

"శా. నాళీకాకరతీరసారకదళీనారంగపూగావళీ

పాళీవాసిత మైన కోనఁ గని యాబాలోత్కానలోఁ గానలో

లాలిప్రేరకరత్నకోరకమయూఖాళీసమాలీఢ మా
కేళీధామముఁ గంటి భూరమణ ! యాకేళీనివాసంబునన్."  (వసు. ఆ. 2. ప. 29.)

ఇట్టి యానుషంగికానుప్రాసములు రచనాప్రతిబంధకములు గాక మిగుల రసపోషకములై యయి యుండును గదా !

"సీ. ఏపారు పొదరిండ్ల నాపాటలాశోకదీపార్చి కనకకలాప మరసె;
సాలావళులు దాఁటి యేలాలతావారబాలాతతి పరాగపటము లూడ్చె;
నానామధుపనవ్యగానామృతము మెచ్చి సూనాసవము లెల్లఁ జూఱ లిచ్చె
శంకారహితధీరహుంకారశుకభటాహంకారముల ఫలాహతి యొనర్చె;..."

(వసు. ఆ. 1. ప. 134.)

"ఉ. వేణి చలింపఁ గంపితనపీనమృణాళభుజాగ్రకంకణ
శ్రేణి నటింప లోలశఫరీనిబిరీసకటాక్షకాంతివి
స్ఫాణము చూప హంసకగణక్వణనంబులు మీఱ సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖశోభితయై కడు సంభ్రమించినన్."  (వసు. ఆ. 2. ప. 138.)

అని యిట్లు నియతములగు యతిప్రాసములను మాత్రము నిలిపియు, నతిమనోహరమగు తూఁగు వెలయునట్లు పద్యముల నడిపించు నేర్పు రామరాజభూషణునకే గల దని చెప్పవచ్చును.

"శ్లో. వాచం తదీయాం పరిపీయ మృద్వీం మృద్వీకయా తుల్యరసాం స హంసః,
తత్యాజ తోషం పరపుష్టఘోషే ఘృణాం చ వీణాక్వణితే వితేనే."

యని యిట్లు నైషధకావ్యమున శ్రీహర్షుఁ డానుషంగికానుప్రాసములతోఁ దాండవ మాడి యున్నాఁడు. అట్టి రీతులు శ్రీనాథుని యాంధ్రీకరణమున నంతగా నగపడవు. రామరాజభూషణు నకుఁ గల శ్రీహర్షుని కవితామార్గముల ననుసరించుటయందలి యభిరుచి యీవిషయమునను జూపఁ బడిన దని తోఁచుచున్నది.

ఇట్లె యర్థాంతరస్ఫోరకముగఁ గవిత్వము చెప్పు నభిరుచియు శ్రీహర్ష మార్గానుసరణలోలు పత్వమును వెల్లడినేయుచున్నది.

## శ్లేష, ధ్వని

శబ్దమునకు నియతమయినయర్థము వాచ్యార్థము. వాచ్యార్థమున కనుపపత్తిగల్గినప్పు డాయనుప పత్తిని నివారించుటకై గ్రహించునట్టి వాచ్యార్థసంబంధియగు నర్థాంతరము లక్ష్యార్థము. "గంగాయాం ఘోష" యనునప్పుడు గంగలో గొల్లపల్లె యుండదు గాన వాచ్యార్థము సరిపడదు. అప్పుడు గంగాయా మ్మను శబ్దమునకు వాచ్యసంబంధియగు గంగాతీరమం దనునర్థము గ్రహింపవలసియుండును. అదియే లక్ష్యార్థము. వాచ్యలక్ష్యార్థములచేఁ బ్రకరణాదివశమున నొకయర్థము స్ఫురించినపిదప వేఱొక యర్థము స్ఫురించినయెడల నది వ్యంగ్యార్థము. వాచ్యార్థమునకన్న వ్యంగ్యార్థము మనోహరముగా నున్నయెడల నదియె ధ్వని. వసుచరిత్రమున శుక్తిమతీకోలాహల సమాగమాదిస్థలములలో స్ఫురించు నాయికానాయకరూపాదు లగుమనోహరములయిన వ్యంగ్యములై ధ్వనులు. ఈవ్యంగ్యార్థము ప్రతిశబ్ద మునకును నర్థాంతరమున్నప్పుడె గాక వాక్యసందర్భమున సయితము స్ఫురించును. పయి నుదాహరించిన "గంగాయాం ఘోష" యనుచోట గంగాతీరమున గొల్లపల్లె గలదనిచెప్పక గంగలో గొల్లపల్లె యున్న దని చెప్పుటచేత నాగొల్లపల్లె గంగ కతిసమీపమున నున్నదనియు, నయ్యది మిగులఁ బవిత్రమైనదనియు,

నందు మిగులం జల్లఁగానుండు ననియు ని ట్లనేకార్థములు స్ఫురించును. అవి ముఖ్యార్థముకన్న మిగుల మనోహరముగ నున్నవిగాన ధ్వనులని గ్రహింపఁబడుచున్నవి. ఇట్టి ధ్వనులలోఁ గొన్ని కథాపాత్రములకు గ్రహింపరాక వినునట్టి సభ్యులకు మాత్రము గ్రహింపఁదగియుండును. ఇట్టివి శాకుంతలాదిదృశ్యకావ్యములలో మెండుగ నున్నవి. దృశ్యకావ్యరీతులుగల మన వసుచరిత్రమునందును నట్టి ధ్వనులు కొన్ని జాతులు గలవు.

"చ. అనుపమభాగ్యశాలి కచలాధిపమౌళికిఁ బుత్త్రిఁ డై జగ
జ్జనని కనుంగుఁదమ్ముఁ డయి శంకరు ముద్దుమఱందికట్టు యై
మను తనభాగధేయమహిమంబున మిన్నులుముట్టి వచ్చుధ
న్యుని నతనిన్ భజించి నదియున్ వినయంబున నోర యై చనన్." (వసు. ఆ. 2. ప. 109.)

ఇందులో "మిన్నులుముట్టి వచ్చు" ననుచోఁ బర్వత మాకాశమును దాఁకుచున్న దని కవియౌచిత్యపోషణమునకై నిలిపినధ్వని శ్రోతృమాత్రగ్రాహ్య మని గ్రహింపవలెను. ఈ యర్థమును గపటయతి గ్రహింపవలసిన యవసర ముండదు.

"క. నీతమ్ముల శుభవాసన, నీతలిదండ్రుల గభీరనిశ్చలగుణవి
ఖ్యాతియును దలఁచి మెలఁగుము, నాతల్లీ! కులవధూజనమతల్లిక వై." (వసు.ఆ.6. ప. 55.)

ఇచ్చట "నీతమ్ముల శుభవాసన" యను మొదలగుచోట్ల గిరికకుఁ గోలాహలుఁడు బుద్ధులు గఱపుటలోఁ దమ్ములవలె మంచిస్వభావముతోఁ బ్రవర్తింపు మను మొదలగు నర్థములె గిరికచే గ్రహింపఁదగినవి గానఁ బద్మసౌరభాద్యర్థాంతరము లౌచిత్యపోషణమునకై కవిచే నిలుపఁబడినవనియు, నవి శ్రోతృమాత్రగ్రాహ్యము లనియు గ్రహింపవలయును.

ఇఁక వ్యంగ్యార్థము వాచ్యార్థముకంటె మనోహరముగా నుండక ప్రస్ఫుటమై యుండుట మొదలగురీతులతో నుండునపు డది గుణీభూతవ్యంగ్య మనఁబడును.

"కావ్యం ధ్వని ర్గుణీభూతవ్యంగ్యం చేతి ద్విధా మతమ్,
వాచ్యాతిశయిని వ్యంగ్యే ధ్వని స్తత్కావ్య ముత్తమమ్. ... ...
అపరం తు గుణీభూతవ్యంగ్యం వాచ్యా దనుత్తమే వ్యంగ్యే,
తత్ర స్యా దితరాంగం; కాక్వాక్షిప్తం చ వాచ్యసిద్ధ్యంగమ్.
సందిగ్ధప్రాధాన్యం, తుల్యప్రాధాన్య మస్ఫుట మగూఢమ్,
వ్యంగ్య మసుందర మేవంభేదా స్త స్యోదితా అష్టౌ."

యని యిట్లు సాహిత్యదర్పణమునఁ జెప్పఁబడియున్నది. వసుచరిత్రమునఁ గపటయతివాక్యములలోని వ్యంగ్యములు గుణీభూతవ్యంగ్యము లని గ్రహింపవలయును.

"తే. పడఁతు లా రాజసచివుని..." అను మొదలగు (ఆ. 3. ప. 62.) పద్యములచే వ్యంగ్యార్థములు వెల్లడిచేయఁబడినవి. ఈవిషయము ముందు విపులముగా వ్రాయుచున్నాను.

రెండర్థములును కేవలము ప్రకృతములయిగాని కేవలమప్రకృతములయిగాని స్ఫురణవిషయమున సమానబలముగలవై ప్రకరణాదివశమున వాచ్యములె యయినయెడల నవి రెండును శ్లేషార్థములె యనఁబడును. రామరాజభూషణ విరచితమగు హరిశ్చంద్ర నలోపాఖ్యానములోని రెండర్థములును శ్లేషార్థములు. అదియె శ్లేషకావ్యము. అందు

"ఉ. వారిచరిత్రముల్ భువనవర్ణ్యము లైనవి వేఱె పేర్కొనన్
సారె జపార్చనాసమయసంగతి తప్పెడుఁ గాన నిప్పు డో
భూరివివేక! యానృపులపుణ్యకథల్ పదశక్తి నొందుగాఁ
గూరిచి తెల్పెదన్ దెలిసికొమ్మని సేర్పు దలిర్ప నిట్లనున్." (ఆ. 1. ప. 5.)

అను పద్యముచే రెండర్థములును బ్రకృత విషయములె యని స్పష్టపఱుపఁబడి యున్నది. ఇట్లు రెండర్థములును వాచ్యములె యగుటకంటె నొకటి ప్రకృతసందర్భమునకు సరిపడియుండఁగా వేఱొక యర్థము గూఢముగా నుండుట సుందరతరముగా నుండును. కావున నె రామరాజభూషణుఁడు ధ్వని ప్రధానమగు వసుచరిత్రమునఁ గేవల శ్లేషను దఱచుగా నుపయోగింపఁ డయ్యె.

"సీ. ఘనఘనాఘనలక్ష్మి నెనయు కొప్పిరుగడ నిరుగడఁ దరుణాబ్జకృతవతంస;
మురుచిత్రకాగ్నిశిఖోన్మేష మిరువంక నిరువంకఁ గుండలిస్ఫురితకర్ణ;
ముడివోనిమిన్కులీనెడుపేరు లిరుదెస నిరుదెసఁ గమలబంధురకరంబు;
నెఱిమించు చిఱుతవన్నియచేల మిరుమేన నిరుమేన రతిమనోహరవిభూతి;
తే. యమర నన్యోన్యవేషభేదాసహిష్ణు,భావవిభవంబుఁ దెలుపుచుఁ బరమమైత్రి
మగనిసామేన నిల్చిన యగతనూజ, ప్రధనజయ మిచ్చుఁ దిరుమలరాయమణికి."

(వసు. ఆ. 1. ప. 6.)

అను మొదలగు కొన్ని పద్యములందుమాత్రము ప్రకృతశ్లేషాదిశుద్ధశ్లేషాలంకారము లరుదుగా నున్నవి. నవీనాలంకారికులు వ్యంగ్యార్థము నంగీకరింపరు. ముఖ్యాముఖ్యవిభేదములేక యెన్ని యర్థములు స్ఫురించినను నవియెల్ల శ్లేషార్థములె యని వారిసిద్ధాంతము. మీఁద నుదాహరించిన "గంగాయాం ఘోష" యనుచోట నున్న ధ్వనులవంటి వానిని మాత్రమే ధ్వనులుగా నంగీకరింతురు.

"క. వసురా జర్యోత బలవ, ద్విస్ఫుమరపాదప్రసారదీర్ఘాచలుఁ డై
యెసఁగఁ గ వసుధాపరి కీర్ణసరిన్నిర్ఝరము తత్క్షణంబునఁ దిగిచెన్." (వసు. ఆ. 2. ప. 154.)

అను పద్యములోని సూర్యపరమైన యర్థము సైతము శ్లేషార్థమే యని వీరి యభిప్రాయము. ప్రాచీనాలంకారికులగు కావ్యప్రకాశకారాదులమతమునఁ బయి నుదాహరించినరీతి నయ్యది వ్యంగ్యార్థ మనియు నది వాచ్యార్థముకంటె మనోహరముగ నుండుటచే ధ్వని యనియు గ్రహింపవలయును.

నవీనాలంకారికులమతమున రెండర్థములును బ్రకృతములె యైనయెడలఁ బ్రకృతశ్లేష మనియు నప్రకృతములైనయెడల నప్రకృతశ్లేష మనియు నొకటి ప్రకృతము నొకటి యప్రకృతము నైన యెడల నుభయశ్లేష మనియు నిట్లు మూఁడువిధములుగ నీశ్లేషాలంకారము విభాగింపఁబడియున్నది. వీనిలోఁ బ్రకృత శ్లేషమును, నప్రకృతశ్లేషమును బ్రాచీనాలంకారికులకును సమ్మతములె యగును. ఉభయశ్లేషములోని యప్రకృతార్థము శ్లేషార్థముగా దనియు నది వ్యంగ్యార్థ మనియు వారి సిద్ధాంతము. ఇదియే సమంజసముగా నగపడుచున్నది. కావుననే మల్లినాథాదులగు వ్యాఖ్యాత లీ మతమునె యంగీకరించియున్నారు.

ప్రతాపరుద్రీయాది గ్రంథములలో నుభయశ్లేష మింకొకవిధముగాఁ జెప్పఁబడినది. ప్రకృతార్థ మొకటి యుండఁగా నుపమానాదివస్తుబోధకమగు విశేష్యము శ్లేషింపక తద్విశేషణ ముపమానోపమేయాది పక్షములకు రెండింటికిని సరిగ శ్లేషించునపు డుభయశ్లేష మని వీరి యభిప్రాయము. రామరాజభూషణుఁడు ప్రతాపరుద్రీయానుసారముగ నరసభూపాలీయమును రచించుటచే నిందును నిట్లే చెప్పఁబడినది.

"క. నిరతము శ్లిష్టవిశేష్యత, నరుదందును బ్రకృతములును నప్రకృతములున్
ధర నశ్లిష్టవిశేష్యము, లరయం బ్రకృతాప్రకృతము లవి యె ట్లన్నన్."

(నరస. ఆ. 5. ప. 162.)

నవీనాలంకారికులమతమునందువలె నుభయశ్లేషము (ప్రకృతాప్రకృతశ్లేషము) వీరిమతమున విశ్వనాథాదులధ్వనితో విరోధింపదు. ధ్వనివిషయమున విశ్వనాథాదులకును వీరికిని భేదములేదు. కాని వీరి ప్రకృతాప్రకృతశ్లేషమును విశ్వనాథాదు లుపమాశ్లేషాదికముగా నుదాహరింతురు.

"శా. భావం బెక్కుడ లేక వృత్తనియమాపాయంబుఁ జింతింప కెం
దే వర్తించి పరార్థవంచనలచే దీపించి మూర్ఖాళి సం
భావింపం గుకవిప్రణీతకృతి సామాన్యాకృతిం బూని పై
పై వన్నె ల్వచరింప దానిఁ దిలకింపం బోరు ధీరోత్తముల్."

(వసు. ఆ. 1. ప. 11.)

ఇట్టిచోట్లయందుఁ బ్రకృతాప్రకృతశ్లేష మనియె ప్రతాపరుద్రీయ నరసభూపాలీయాది గ్రంథాభిప్రాయము. మఱియు నిం దుపమాలంకారమును నుండుటచే నుపమాశ్లేషములకు నేకవాచకానుప్రవేశరూప మగు సంకర మని వీరి తాత్పర్యము. కాని యిందలి శ్లేషోపమలు పరస్పరసంబంధము గల్గియుండుటచేతను నందును నుపమాలంకారమె ప్రధానమైన దగుటచేతను నిట్టిచోట్లను శ్లేషోపమల కంగాంగిభావరూప సంకర మని విశ్వనాథపంచాననాదుల సిద్ధాంతము. ఇట్టిచోట్లయందు శ్లేషాలంకారము నంగీకరించినచో "నీముఖము చంద్రునివలె మనోజ్ఞముగా నున్నది" యను మొదలగు చోట్లయందును మనోజ్ఞతాదిసాధారణధర్మము లుపమానోపమేయములకు రెండిటికి సరిగ శ్లేషించుటచే (అర్థశ్లేషము) నిట్టిచోట్లయందును శ్లేషాలంకారమునె యంగీకరింపవలసివచ్చును. అ ట్లయినచో నిఁకఁ బూర్ణోపమాలంకారము దృష్టాంతరహితమె యగును.

"సకల కలేత్యాదౌ చ నోపమాప్రతిభోత్పత్తిహేతు శ్లేషః; పూర్ణోపమాయానిర్విషయాత్వా పత్తేః కమల మివ ముఖం మనోజ్ఞ మేత దిత్యా ద్యస్తి పూర్ణోపమా విషయ ఇతి చే న్న. యది సకలే త్యాదౌ శబ్దశ్లేషతయా నోపమా త త్కి మపరాద్ధం మనోజ్ఞ మి త్యాదా వర్థశ్లేషేణ." యని యిట్లు సాహిత్యదర్పణమునఁ జర్చింపఁబడియున్నది. ఇట్లె,

"సీ. వరసుమనోభవ్యతరులకావాల మత్యలఘుకలాపాళికలకు జరణి..."

(వసు. ఆ. 1. ప. 94.)

యను పద్యమునందును బ్రధానమయినదగు రూపకాలంకారముచే శ్లేషము బాధింపఁబడును.

"విద్వన్మానసహంసేత్యాదౌ శ్లేషగర్భే రూపకేఽపి మానసశబ్దస్య చిత్తసరోరూపోభయార్థకత్వేఽపి రూపకేణ శ్లేషో బాధ్యతే, సరోరూప స్యైవార్థస్య విశ్రామధామతయా ప్రాధాన్యాత్. శ్లేషేహ్యర్థద్వయస్యాఽపి సమకక్షత్వ" మ్మని యిట్లు విశ్వనాథపంచాననునిచేఁ జర్చింపఁబడినది. కాఁబట్టి యిట్టిచోట్లయందును శుద్ధశ్లేషాలంకారము కా దనుటయే లెస్స యని తోఁచుచున్నది.

శుక్తిమతిని గోలాహలుఁడు కామించి బలాత్కారముగా నుపభోగించినసందర్భ మర్థద్వయశ్రితమయియున్నది. మనుష్యరూపనాయికానాయక సమావేశపరముగ నొక యర్థమును నదీపర్వతసమావేశపరముగ నొక యర్థమును నిందు వెలయుచున్నవి. ఈరెండర్థములును శ్లేషార్థములా? లేక యొకటి వాచ్యార్థమును వేఱొకటి వ్యంగ్యార్థము నయియున్నవా! అ ట్లయిన నం దేది వ్యంగ్యార్థము? పయి సందర్భమునఁ గొన్నిచోట్ల మనుష్యపరమైనయర్థమును, మఱికొన్నిచోట్ల నదీపర్వతపరార్థమును బ్రధానముగ నగపడుచున్నవి. ఈవిషయ మిచట విమర్శింపవలసియున్నది.

బ్రహ్మదేవునిదర్శనమునకై మఱికొన్ని నదులతోఁ గలసి శుక్తిమతి వెడలుచుండఁగా మార్గమధ్యమున బ్రహ్మదర్శనము చేసికొనివచ్చుచున్న కోలాహలుఁ డెదురుపడి శుక్తిమతియొక్క చక్కఁదనము చూచి కామాయత్తుఁడై వెడలిపోయి వేఱొకసమయమున విరహము నోర్వఁ జాలక శుక్తిమతీనదిలోఁ వ్రాలి యామె నుపభోగించె నను వసుచరిత్రములోని కథాసందర్భమునందు బ్రహ్మదేవుని దర్శనమున కేఁగునపు డొకరికొక రెదురుపడినసందర్భమున శుక్తిమతీకోలాహలులు మనుష్యరూపములతో నున్నట్లును, పిదప వేఱొకసమయమున జరిగిన సమాగమసందర్భమున శుక్తిమతీకోలాహలములు నదీపర్వతరూపములతో నున్నట్లును నగపడుచున్నది. బ్రహ్మదర్శనమునకు శుక్తిమతి యేఁగుసందర్భము విమర్శింతము.

"సీ. అనుకూలఖేలనాయత్తజీవనమైత్రి నడరి నర్మద బోటి యై భజింప; ... ...

గీ. ... ... ... ... ...

అఖిలనదులును దనుఁ గొల్వ ననుదినంబు, నలువకొలువున కేఁగు నన్నది యతీంద్ర!"

(ఆ. 2. ప. 106.)

యను పద్యమునుబట్టి యప్పుడు శుక్తిమతి మనుష్యరూపమున నున్నదని యొప్పుకొనకుండినచో నర్మద, బాహుద, వేత్రవతి, సరస్వతి యను నదులు సేవించుటగాని బ్రహ్మలోకమునకు వెళ్లి మరలి వచ్చుచుండుటగాని సంఘటిల్లదుగదా!

మ. అలఘు శ్రీనిధి యానగేంద్రతనయుం డాసైకతశ్రోణి యొ

ప్పులు ఱెప్పార్పక చూచిచన్న మొదల......"

(ఆ. 2. ప. 112.)

నను పద్యమునుబట్టి కోలాహలుఁడును మనుష్యరూపమున నున్న ట్లంగీకరింపక తీరదు. లేనిచో "ఱెప్పార్పక చూచి" యను మొదలగునవి సందర్భింపవుగదా! కాఁబట్టి యీసందర్భమున నదీపర్వతరూపార్థమె యౌచిత్యపోషక మగు వ్యంగ్యార్థ మనియును మనుష్యరూపార్థమె ముఖ్యార్థ మనియు గ్రహింపవలయును.

ఇఁక శుక్తిమతిని గోలాహలుఁ డుపభోగించిన సందర్భములో నున్న

"కం. వసురా జయ్యెడ బలవ, ద్విస్మృమరపాదప్రసారదీర్ణాచలుఁ డై

యొసఁగఁ గ వసుధాపరికీర్ణ సరిన్నిర్ఝరము తత్క్షణంబునఁ దిగిచెన్." (ఆ. 2. ప. 154.)

అను మొదలగు పద్యము లరయఁగా నీపట్టున శుక్తిమతీకోలాహలములు నదీపర్వతరూపములతో నున్న ట్లంగీకరింపక తప్పదు. లేనియెడల నీరుపూనుటయు, నందువలనఁ బౌర్శ్వస్థజనపదంబుల కుపద్రవము సంభవించుటయు వసురాజు కాలందఁ నెగమీటుటయు, నట్లు మీటినపిదప నీటిపూనిక తీసిపోవుటయు నను విషయములు సందర్భపడవుగదా! కాన నిచట నదీపర్వతరూపార్థమే ముఖ్యార్థ మనియు నాయికా నాయక పరమగునర్థము వ్యంగ్యార్థ మనియుఁ గ్రహింపవలయును. అట్లయినచో నదీపర్వతములకు గిరికా వసుపదులు పుట్టుట ప్రకరణవిరుద్ధముగా నుండు నని శంకింపఁ బనిలేదు. మూలకథ ననుసరించి ముఖ్యార్థమును నడుపునపు డట్టివైరుధ్యము నెంచుట సరికాదు.

అట్లయినను ననుభవవిరుద్ధమగు నిట్టిసమాగమము పురాణములందువలెఁ గావ్యములందును వర్ణించుట యంతయుచితముగా నుండదని యెంచియే కావలయును రామరాజభూషణుఁడు మనుష్యపరమగు వ్యంగ్యార్థము ననుసంధించినాఁడు. కోలాహలుఁడు శుక్తిమతినిఁ జూచుట సంభవించుటకై ప్రస

దర్శనసందర్భము మూలాధికముగాఁ గల్పించినాఁడు. కావున నం దనుభవనమునకు సరిగ స్త్రీ పురుష రూపములె వర్ణింపఁబడెను. ఇట్లె కపటయతి గిరికవద్ద కేఁగినసందర్భమున యతిపరమగు నర్థ మొక టియు, నర్మసచివపరమగు నర్థ మొకటియు గలవు. వానిలో యతిపరమగు నర్థమే యా సందర్భ మున ముఖ్యార్థము. నర్మ సచివపరమగు నర్థము వ్యంగ్యార్థము.

"మఱియు...అమ్మౌని...తపోధనాకారంబు డించి యథాపూర్వవేషంబుతో రాజు నన్వే షించు క్రమంబునం గ్రమ్మఱ నేతెంచి...నిల్చు నవసరమున...

తే. పడఁతు లారాజసచివుని పలుకుబడియు, మోముచాయయుఁ గని తొంటి మునియెకాఁగ
నరసి మందాక్షమందమందాక్ష లగుచు, నగుచు భావించి రతనివాజ్ఞైపుణములు."

(వసుచరిత్ర. ఆ. 3. ప. 62-63.)

పయి గద్యపద్యములలో నర్మసచివరూపవ్యంగ్యార్థము వెల్లడిచేయఁబడినది గాన నిది గుణీ భూత వ్యంగ్య మని యెఱుంగునది.

ఈ సందర్భమున నర్మసచివుని మరలఁ బ్రవేశపెట్టుట రాజునకుఁ జుల్కఁదనముగా నుండుటచే నయ్యది యౌచిత్యపోషకముగా లే దని కొందఱు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. అట్లయినను నాయికావిషయమున నట్టి చుల్కఁదన మనౌచిత్యముగా నుండక రాజునకుఁ గల నాయికావిషయక గాఢానురాగమును, దత్ప్రాప్త్యుపాయాన్వేషణతత్పరతను సూచించుచు సరసముగనే యున్న దని తోఁచుచున్నది. అట్లు వెల్లడి చేయనియెడల నుద్బోధకము లేకుండుటచే నర్మసచివాదిరూప వ్యంగ్యార్థములు గిరికా మంజువాణీ ప్రభృతులు గ్రహింపఁ జాలియుండరు గదా!

"క. కోలాహలశైలాధిప, లీలాగతుఁ డైన పతి యతీశయతీంద్రున్
నీలాలకావలోకక,ళాలోలత నని వె నని తలంచిరి ముదితల్." (వసు. ఆ. 3. ప. 64.)

అను పద్యమే వ్యంగ్యమును వెల్లడిచేయుట రాజానురాగసూచనార్థ మను రామరాజభూషణ హృదయమును స్పష్టపఱచుచున్నది.

ఇట్టి యర్థాంతరము లన్నియు వ్యంగ్యార్థము లని ప్రాచీనాలంకారికుల మతము. నవీనాలంకారి కులు వీని నెల్ల శ్లేషార్థములే యందురు. ఒక యర్థముకన్న వేఱొక యర్థము స్ఫురణవిషయమున గూఢముగ నున్నదే యన్న నది గూఢశ్లేష యగుఁగాక యని వాదింతురు. "పర్యవసితే ప్రకృతార్థాభిధానే పశ్చాత్స్ఫురతీతి చేత్కామం గూఢశ్లేషోఽభవ" త్తని యిట్లు కువలయానందమునఁ జర్చింపఁబడియున్నది. కాని యీవిషయమును ఖండించి సాహిత్యదర్పణమున నైదవపరిచ్ఛేదమున విపులముగా విశ్వనాథుఁడు చర్చించియున్నాఁడు. అర్థాంతరస్ఫురణరూప మగు నిట్టి ప్రౌఢరచనను గావ్యజీవిత భూతధ్వనిగ సంభావించుట మాని కావ్యశరీరమున కనియతములగు నాభరణములవంటి యలంకారములలోఁ జేర్చి దాని విలువ తగ్గించుట స్వారస్యముగా నుండ దని తోఁచుచున్నది. చదు వరులు రెండర్థములును నియతముగఁ దెలిసికొనకున్నఁ గథాభాగము నడువనిరీతిగ నుండు సమాన బలముగల యర్థములు శ్లేషార్థము లని యనుట సమంజసముగా నుండును.

ఇట్టి శ్లేషస్ఫురణమునకు శబ్దములు ప్రధానమైన శబ్దశ్లేష మనియు, నర్థము ప్రధాన మైన నర్థ శ్లేష మనియు, శబ్దము విఱిగి శ్లేషించినచో సభంగశ్లేష మనియు, శబ్దము విఱుగకయే శ్లేషించిన నభంగ శ్లేష మనియు ని ట్లనేకవిధములగు భేదములు సంస్కృతాలంకారికులు చెప్పి యున్నారు. మఱియు శబ్దము నొక పక్షమున నొక భాషగను వేఱొకపక్షమున వేఱొకభాషగను నుండిన నది భాషాశ్లేష

మని సాహిత్యదర్పణమునఁ జెప్పఁబడి యున్నది. అట్టి భేదము కావ్యాలంకారచూడామణి నరసభూపాలీయములలో జూపఁబడకున్నను రాఘవపాండవీయమునఁ బింగళి సూరన వివరించియున్నాఁడు.

"సీ. ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష యొక్కొక్కచోట నొక్కొక్కచోట;
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట నర్థశ్లేష యొక్కొక్కతఱిని ముఖ్య;
గౌణవృత్తిశ్లేషఘటన యొక్కొకతఱి నర్థాన్వయము వేఱె యమరుచునికి;
శబ్దాన్వయవిభేదసంగతి యొక్కొక తఱిని... (రాఘవపాండవీయము. ఆ. 1.)

ఈరీతిని శ్లేషవిషయమున విజృంభించి పింగళిసూరన వాసిఁగాంచుటయకాక యది దుర్ఘటమనియు నాత్మోత్కర్షగర్భితముగా వర్ణించియున్నాఁడు.

"శా. రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతి కావ్యమెల్ల నగునే నోహో! యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగుఁ గబ్బం బద్భుతం బాంధ్రుం ద
త్తుం డెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్."
(రాఘవపాండవీయము. ఆ. 1. ప. 10.)

పయిరీతిని బింగళి సూరన "రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ రా" దని చెప్పి యూతఁడు స్వసమకాలికుఁడును, దనతోఁబాటుగ నష్టదిగ్గజములలో నొకఁడును నగు నల్లసాని పెద్దనార్యుని నుద్ఘాటించె ననియు నల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రమున రెండర్థముల పద్య మొక్కటియే గల దనియుఁ జెప్పుదురు.

"సీ. తొలుదొల్తఁ గమలమిత్త్రునివంక రూపాట దక్షాధ్వరధ్వంసి తన్నుఁ గనుటఁ;
బరివేషమిషమునఁ బాశంబుఁ దాల్చుటఁ గప్పు దేహమునందుఁ గానఁబడుట;
గాలవశంబునఁ గాని తోఁపకయుంట సతతనిష్ఠురగదాన్వితతఁ గనుటఁ;
బూని పాండుక్షేత్రమునఁ బ్రవర్తించుటఁ బ్రకటానురాగతారకుఁ డగుటను;
తే. నంతరం బెద్ది యాత్మలో నరసి చూడ, రాజ! నీకును నల ధర్మరాజునకును
బ్రాణిలోకంబు బాధలఁ బఱచు నపుడు: ధర్మపద మొక్క టెక్కుఁ డాధయ్యనందు."
(మను. ఆ. 3.)

పయిపద్యములోని యర్థద్వయఘటనాపైధుర్యమును సూరన యుద్ఘాటింపఁగాఁ బెద్దనార్యుని ప్రియశిష్యుఁ డగు రామరాజభూషణుఁడు రాఘవపాండవీయమున కన్న ననేకవిధముల మిన్నయగు హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించి వాసిగాంచె ననియుఁ జెప్పుదురు. ఇది యెంతవఱకు నిజమో చెప్పఁజాలము గాని రాఘవపాండవీయముకన్న హరిశ్చంద్రనలోపాఖ్యానము ప్రౌఢతరముగ నున్న దని మాత్రము దృఢముగాఁ జెప్పవచ్చును. దిగ్విజయము, వేఁట, మునిహత్య, శాపము, సంతతికై యత్నము, వీర్యశుల్కవివాహము, వనవాసము, యుద్ధము మొదలగు ననేక విషయములు రామాయణభారత కథా సామాన్యము లగుటచే రాఘవపాండవీయ రచన హరిశ్చంద్ర నలోపాఖ్యానమువలె దుర్ఘట మనఁ జనదు. మఱియు నర్థద్వయానుసంధానమునకై రాఘవపాండవీయమున రామాయణములో లేని నారదాగమనాదులును గల్పింపఁబడెను. ద్రౌపదీవిషయమున నియమ మేర్పఱుప భారతకథలో నిల్చిన నారదాగమనము నర్థాంతరఘటనకై రామాయణార్థమున రామ పరశురామ యుద్ధసందర్భమునఁ గవి నెలకొల్పి యున్నాఁడు. ఇచ్చట నారదాగమనవిషయమే గాక యనేక విషయములు నీర్మాలము లగపడుచున్నవి. హరిశ్చంద్ర నలోపాఖ్యానమునఁ గథాద్వయమున కంతగా

సామ్యము లేదు. అట్టి కథలను శబ్దశక్తిని జోడించుటలో రామరాజభూషణునికి శ్లేషకవనమునఁ గల పాటవము వ్యక్తమగుచున్నది. అయ్యది విశదీకరించుటకై యిచ్చట రెండు పద్యములుమాత్ర ముదాహరించుచున్నాను. రాఘవపాండవీయమునందువలెఁ గాక పేరులను శ్లేషించుటలో నయిత మిందు నిరంకుశప్రజ్ఞ యగపడుచున్నది.

"గీ. భువనసంత్రాణకీర్తితో బుధగణేయ, సత్కళారాజితో హరిశ్చంద్ర యనుచు
దేవతావర్గములు వినుతింప నలస, మాఖ్యఁ దగు సార్వభౌమైకముఖ్యుఁ డలరు."

(హరిశ్చంద్రనలోపాఖ్యానము. ఆ. 1. ప. 15.)

హరిశ్చంద్రపదమున కర్థాంతరసంఘటన తెనుఁగువాక్యమున దుర్ఘటమగుటచే నలపరమగు నర్థాంతరము పక్షమున దానిని సంస్కృతభాషలో నిల్పి యతిప్రౌఢిమతో సరిపెట్టియున్నాఁడు.

"సీ. ఎన్న నేరికిఁ దరంబే గురుసంగర విజయైకనిధులయి వెలయు నీన ;
లవసుమతీశ్వరుల యరీణగుణమణు లనుచు సారెకుఁ దదీయంబు లైన ;
నానావిపక్షఖండనధుర్యచాతుర్యములు మరున్మిత్రతాస్ఫురణములు మ ;
హార్యమతనయభావానుభావంబులు భువనసంభరణవైభవములును బ్ర ;
తే. కామఘనసత్కరణధామతామహత్వ, విలసనంబులు నొక్కటఁ దెలియఁ బలికెఁ
గౌశికానుగగీర్వాణగణము మదికి, సంభ్రమసమాకులత్వంబు సంభవింప."

(హరిశ్చంద్రనలోపాఖ్యానము. ఆ. 2. ప. 111.)

ఇప్పద్యంబున హరిశ్చంద్రకథాపక్షమగు నర్థమును నిర్వహించుకొనుచు నలకథాపరమగు నర్థమునందు సంస్కృతనైషధరీతి నతిప్రౌఢముగఁ బంచనైషధీవర్ణనము చేయఁబడెను. సంస్కృతనైషధమున నీపంచనైషధీసందర్భము పదుమూఁడవసర్గమం దంతటను బదునాల్గవసర్గమున మొదటి యిఱువది రెండు శ్లోకములవఱకును వర్ణింపఁబడినది. గ్రంథవిస్తరభీతిచే వానినన్నింటి నిట నుదాహరింపక తత్కల్పనారీతి నుదాహరించుచున్నాను.

దమయంతి నలునే వరించెద ననునిశ్చయముతో నున్న దని విని యింద్రాగ్ని యమవరుణులు నలుగురును స్వయంవరసభయందు నలునిరూపముతో నలునియొద్దనే కూరుచుండిరి. సరస్వతి వారిని వర్ణించి చెప్పుటలో నింద్రుని వర్ణించినపు డింద్ర నలపరముగ నర్థద్వయ ముండునట్లును, నిట్లె యితర దేవతలను వర్ణించునపుడును దత్తద్దేవతాపరముగాను, నలపరముగాను నర్థద్వయ ముండునట్లును నొక్కొకదేవతను నాలుగేసి శ్లోకములతో వర్ణించెను. దమయంతి నలుని గ్రహింపలేక దేవతలను బ్రార్థించి వారిప్రసాదమునఁ దెలివొంది నలుని వేఱుపఱచుట కవకాశము గల్గియున్న సరస్వతీవర్ణనములను విమర్శింపఁ గల్గి నలుని దేవతలనుండి వేఱుపఱచి గ్రహించెను. వానిలో నలవర్ణనమందును దేవతావర్ణనమందును బ్రతిశ్లోకమును నలుఁడు వర్ణింపఁబడియుండఁగా నలవర్ణనాపద్యచతుష్టయములో నొక్కొక్క శ్లోకమున నొక్కొక్క దేవతామాత్రము శ్లేషగుంభితముగా వర్ణింపఁబడుటచేత నలమహారాజితఁ డని గ్రహించుట కవకాశ మున్నది గదా! నలుఁడు లోకపాలాంశసంభూతుఁడు గానఁ బ్రతిపద్యమునందును గల లోకపాలనలపరరూపార్థద్వయము స్వారస్యముగ నుండును. దేవతాప్రార్థనానంతరమున నిట్టి విమర్శనమె దమయంతి చేసినట్టు కవి చెప్పియున్నాఁడు.

"శ్లో. ప్రసాద మాసాద్య సురైః కృతం సా సస్మార సారస్వతసూక్తి సృష్టేః,
దేవా హి నాన్య ద్వితర న్తి కిన్తు ప్రసద్య తే సాధుధియం దద న్తే." (స. 14. శ్లో. 8.)

"శ్లో. శేషం నలం ప్ర త్యమ రేణ గాథా యా యా సమర్థా ఖలు యేన యేన,
తాం తాం త దన్యేన సహాలగన్తీం తదా విశేషం ప్రతి సందధే సా." (స. 14. శ్లో. 9.)

"శ్లో. శ్లిష్యంతి వాచో యదమూ రముష్యాః కవిత్వశక్తేః ఖలు తే విలాసాః,
భూపాలగోలాః కిల లోకపాలాః సమావిశంతి వ్యతిభేదినోపి." (స. 14. శ్లో. 14.)

యని యిట్లు రామరాజభూషణుఁడు ద్వ్యర్థికావ్యమగు హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు నింత విపులముగా వర్ణింపకున్నను, బయినుదాహరించిన సీసపద్యమునందు సంస్కృతనైషధరీతిగనే యంచనలి నతిప్రౌఢముగ వర్ణించెను. పైసీసపద్యమునందు నలపరముగాను వేర్వేరుదేవతాపరముగాను నర్థద్వయ ముండునట్లుగ నొక్కొక్కవాక్యమున నొక్కొక్కదేవత వర్ణింపఁబడెను. సత్యనలవర్ణనవాక్యమున దేవతాచతుష్టయ పరముగాను నలపరముగాను నర్థపంచక ముండునట్లు వర్ణింపఁబడెను. ఈ యైదవవాక్యరీతి సంస్కృత నైషధరీతికన్నను ప్రౌఢముగా నున్నది. ఇట్లిదర్థములతో నలకథాపరార్థము వర్ణించియు హరిశ్చంద్రకథాపరమైన యర్థమునైతము లోపములేకుండ నిర్వహించెను. ఈసందర్భమున దమయంతి యిట్టిశ్లేషగుంభితవాక్యములవల్ల మొదట నలుని గ్రహింపలేక దేవతలను బ్రార్థించి వారిదయచే బుద్ధివికాసము నొంది సరస్వతీవాక్యముల విమర్శింపఁగల్గి నలుని గ్రహించి దేవతాకటాక్షమున నపుడు దేవతలందును నలునియందును గనఁబడిన దేవతా మనుష్యలక్షణ భేదములచే దృఢపఱచుకొని నలుని వరించినట్లు వర్ణింపఁబడెను.

"గీ. అపుడవరనిశ్చయంబుతో నవనిజాని, మణిజనాకులవినుతి సంపదలఁ దగ భ
జించి సుమనఃప్రసాదసంసిద్ధిచే న,నంతభూస్పర్శనవిచార మాత్మఁ బొడమ."
(హరిశ్చంద్రనలోపాఖ్యానము. ఆ. 2. ప. 112.)

"చ. అమరవరక్షమావరవరాంచితవృత్తులవింగడించి నే
ర్పమరఁగ... ... ..." (హరిశ్చంద్రనలోపాఖ్యానము. ఆ. 2. ప. 113.)

పయిపద్యములలో "ననంతభూస్పర్శనవిచారమాత్మఁ బొడమ" ననుదానికి సరస్వతీవాక్యములలోని నలేంద్రాదిపరార్థవిమర్శనము (అనంతభూ=అంతము సంభవము లేనివగు సరస్వతియొక్క, స్పర్శన=నలేంద్రాదులను స్పృశించువాక్యములయొక్క, విచారము=అర్థవిమర్శనము, ఆత్మన్=మనస్సునందు, పొడమన్ = అంకురింపఁగా, అమరవరక్షమావరవరాంచితవృత్తులన్ = దేవతామనుష్యలక్షణములచే, వింగడించి = వేఱుపఱచి,) మనసులో నంకురింపఁగా నని యర్థముచేసి యట్టిదేవతామనుష్యలక్షణములచేత నలుని వేఱుపఱచికొనె నని తఱువాతి పద్యభాగమున కర్థము చేయవలెను. ఇందు విమర్శన ప్రకారము ద్వ్యర్థికావ్యమున దుర్ఘటమగుటచే విడువఁబడె నని గ్రహింపవలెను. హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్యాత పైపద్యములకిట్లర్థము చేయకుండుట శృంగారనైషధమాత్రపఠనాజన్యమగు ప్రమాద మని తోఁచుచున్నది. ఇచట "ననంతభూస్పర్శనవిచార" మనఁగా నాకాశభూమిపాదస్పర్శనవిషయకమగు విచారమని వ్యాఖ్యాత యర్థముచేసియున్నాఁడు; దేవతాప్రసాదముచే నిట్టి విమర్శనమమాత్రమె గల్గియందువలన దేవతామనుష్యలక్షణములచే నలుని గ్రహించెననియే కవిహృదయ మైనచో దేవతలను నలుని వర్ణించిన సీసపద్యములో దేవతానలపరముగ శ్లేషించుట కేమి సార్థక్యము గలదు. అందును సత్యనలవర్ణన వాక్యమున నర్థపంచక ముండునట్లు రచించిన రచన కేమి ఫలము? దేవతలును నలునిరూపముతోన యుండఁగా దమయంతి దేవతలను బ్రార్థించి తత్ప్రసాదమున దేవతా మనుష్యలక్షణములను గనుపట్టి నలుని గ్రహించె నని వర్ణించినఁ జాలునుగదా! నలుని వేఱుపఱచుట కనువుగ శ్లేషల రచించియు నట్టిశ్లేషములను నిష్ఫలములుగఁ జేయునా?

ఇట్లే నూటపదుమూఁడవపద్యమున వ్యాఖ్యాతగ్రహించిన "యమరవరక్షమావరవరాంచితవృత్తు" లను పాఠమును విడిచి "యమరవరక్షమావరవరాంచితవృత్తుల" నని సవరించుట యుక్తముగా నున్నది. ఇట్లు సవరించినను హరిశ్చంద్రకథాపరమగు నర్థమునకు భంగములేదు. (అమరవరక్షమావరవరాంచిత వృత్తులన్ = దేవతాబ్రాహ్మణమాన్యములను, వింగడించి = వేఱుపఱచి.)

సంస్కృతనైషధమును దెనిఁగించిన శ్రీనాథుని శృంగారనైషధమున నీశ్లేషరచనలీసందర్భమున నిట్టి చాతుర్య మగపడదు. కాని సంస్కృతనైషధరీతిని శృంగారనైషధమునందును నింద్రాదిదేవతలను వర్ణించుటలోఁ బ్రతిదేవతను నొక్కొక్కపద్యముతో వర్ణించి యందుఁ దత్తద్దేవతాపరముగాను నల పరముగాను నర్థద్వయ ముండునట్లు వర్ణించెను.

(శృంగారనైషధము. ఆ. 5. ప. 166, 167, 168, 169.)

ఇట్టి వర్ణనములలో సంస్కృతగ్రంథములోని శ్లిష్టపదములె శ్రీనాథుఁడు తఱచుగా సంగ్రహించుచు వచ్చెను. అందును సత్యనలవర్ణనమున శుద్ధశ్లేషతో లోకపాలనలపరార్థద్వయమును శ్లిష్టక శ్లేషోపమలను నిల్పెను. ఇందును శ్లిష్టపదములు తఱచుగా సంస్కృతమునుండి సంగ్రహించినవే యగు చున్నవి.

"శ్లో. అత్యాజిలబ్ధవిజయప్రసవస్త్వయా కిం విజ్ఞాయతే రుచిపదం న మహీమహేంద్రః,
ప్రత్యర్థిదానవశతాహితచేష్టయాసౌ జీమూతవాహనధియం న కరోతి కస్య."

(స. 13. శ్లో. 27.)

"శ్లో. యే నామునా బహువిగాఢసురేశ్వరాధ్వరాజ్యాభిషేకవికసన్మహసా బభూవే,
ఆవర్జనం త మను తే నను సాధు నామ గ్రాహం మయా నల ముదీరిత మేవ మత్ర."

(స. 13. శ్లో. 28.)

"శ్లో. య చ్చండిమా రణవిధివ్యసనం చ త త్త్వం బు ధ్వాశయాశ్రిత మముష్య చ దక్షిణత్వమ్,
సైషా నలే సహజరాగభరా దముష్మి న్నాత్మాన మర్పయితు మర్హసి ధర్మరాజే."

(స. 13. శ్లో. 29.)

"శ్లో. కిం తే తథా మతి రముష్య యథాశయ స్స్యాత్ త్వత్పాణిపీడనవినిర్మితయే న పాశః,
కా స్నానవా నవతి నో భువనం చరిష్ణు ర్నాసౌ వముత్ర న రతా భవ తీతి యుక్తమ్."

(స. 13. శ్లో. 30.)

అను వీనికి శ్రీనాథుని యాంధ్రీకరణము సరిగా లే దని విశదమగుట కిచ్చట నయ్యది వ్రాయు చున్నాను.

"తే. నలిననేత్ర ప్రత్యర్థిదానవశతాహి, తాత్మచేష్టాగరిష్ఠత నరసి చూడ
నితఁడు జీమూతవాహనుఁ డింత నిక్క, మింపు పొంపిరివోవ వీక్షింపు మితని."

(శృంగారనైషధము. ఆ. 5. ప. 172.)

"వ. మఱియు నితండు పురుహూతుండునుంబోలె బహువిగాఢమఘవదధ్వరాజ్యాభిషేకవికస్వర తేజోవిరాజితుండు, నీశానమూర్తిభేదంబును, దండధరుండునుంబోలెఁ బరప్రాణోత్క్రాంతి దాన సమర్థశక్తిసంపన్నుండును, సంజ్ఞానందకుండును, వరుణుండునుంబోలెఁ బ్రతికూలపాత ప్రచారచటులవాహినీసహస్రసంసేవితుండును, బ్రచేతసుండును, నితనిం గనుంగొను మిప్పురుష పంచకంబునందు నీకుం గన్నిచ్చుకు వచ్చు నతని వరియింపుము..."

(శృం. నై. ఆ. 5. వ 173.)

పయివానిలోని వరుణనలసమానవిశేషణమునందలి శ్లిష్టపదములును సంస్కృతనైషధములోని

"సస్యందనైః ప్రవహణైః ప్రతికూలపాతం కా వాహినీ న తను తే పున రస్య నామ."

యనుదానినుండి సంగ్రహింపఁబడె నని గ్రహింపవలయును. ఇందుఁ "బ్రతికూలపాత" మను చోటఁ "బ్రతికూలవాత" యని ముద్రితమగు శృంగారనైషధమున గ్రహింపఁబడియున్నది. అయ్యది వరుణ పక్షమున స్వారస్యముగా లేదు. ఇఁకఁ బంచనైషధీవర్ణనములోని చాతుర్యమును విచారింతము.

పయిగీతపద్యమునందు నింద్రనలపరములగు రెండర్థము లున్నను భేదసూచకముగ నారోపణము చేసి రూపకాలంకారముతో వర్ణింపఁబడెను. ఇట్లే పయివచనమునందును పురుహూతాదివర్ణనాపరముగను

నలపరముగను నర్థద్వయ మున్నను హుతవహాదులతో నలునకు సామ్యము వర్ణింపఁబడెను. ఈసందర్భమున దమయంతి కెట్లు సందేహముగలైనో తెలియకున్నది. "తద్భిన్నత్వే సతి తద్గతభూయోధర్మవత్త్వముపమానత్వ" మ్మనుచొప్పున నుపమానము భేదసూచకముగదా! ఇట్టిస్థితిలో "వెలయఁగఁ బంచనైషధివిభేదము నేర్పఱుపంగలేక... ... ..." (శృం. నై. ఆ. 5. ప. 176.)

అని యిట్లు నలుని గ్రహింపలేకపోయె నని వర్ణింపఁబడియున్నది. సంస్కృతనైషధమున రెండర్థములును సంపూర్ణముగ శ్లేషగుంభితములగుటంజేసి నలుని వేఱుపఱచుకొనలేకపోయె ననుట యుక్తముగనున్నది గాని యిట్లుపమాశ్లేషము భేదమును వెల్లడిచేయుచుండఁగా నలుని గ్రహింపలేకపోయె ననుట యుక్తముగా నుండునా?

మఱియు నట్లు మొదట శ్లేషగుంభితములగు సరస్వతీవాక్యములను విమర్శింపఁజాలక దమయంతి దేవతల స్తుతియించి వారి ప్రసాదమున బుద్ధివైశద్యము నొంది సరస్వతీవాక్యములను వెనుక వ్రాసిన రీతిని విమర్శించి నలుని గ్రహించి దేవతాప్రసాదమునఁ దత్కాలమున దేవతలందు నగపడిన భూస్పర్శనాభావాదిలక్షణములు నలునియందు లేకుండుటచే స్థిరపఱచుకొనె నని సంస్కృతనైషధమున నతిసందర్భముగ నున్నది.

"ప్రసాద మాసాద్య సురైః కృతం సా సస్మార సారస్వతసూక్తిసృష్టేః,
దేవా హి నాన్య ద్వితర న్తి కిన్తు ప్రసద్య తే సాధుధియం దదంతే." (స. 14. శ్లో. 8.)
"శేషం నలం ప్రత్యమరేణ గాథా యా యా సమర్థా ఖలు యేన యేన,
తాం తాం తదన్యేన సహాలగన్తీం తదా విశేషం ప్రతిసందధే సా." (స. 14. శ్లో. 9.)
"పరస్య దారాన్ ఖలు మన్యమానై రస్పృశ్యమానా మమరై ర్ధరిత్రీమ్,
భక్త్యేవ భర్తు శ్చరణౌ దధానాం నలస్య తత్కాల మపశ్య దేషా." (స. 14. శ్లో. 16.)
"సురేషు నాపశ్య దవైక్ష దక్ష్ణో ర్ద్విమేష మూర్వీభృతిసమ్ముఖే సా..." (స. 14. శ్లో. 17.)
"నాబుద్ధ బాలా విబుధేషు తేషు క్షోదం క్షితే రైక్షత నైషధే తు..." (స. 14. శ్లో. 20.)
"స్వేదః... ... ...నలే తదాలోకి న దైవతేషు." (స. 14. శ్లో. 19.]
"సురేషు మాలా మమలా మపశ్య న్నలే తు బాలా మలినీభవన్తీం..." (స. 14. శ్లో. 20.)
"చిహ్నై రమీభి ర్నలసంవి దస్యా స్సంవాద మాప ప్రథమోపజాతా,
సా లక్షణవ్యక్తిభి రేవ దేవప్రసాద మాసాదిత మ ప్యబోధి." (స. 14. శ్లో. 22.)

అను నీసందర్భమును శ్రీనాథుఁ డాంధ్రీకరించుటలో సరస్వతీశ్లేషవాక్యవిమర్శనశక్తి దేవతాప్రసాదమునఁ గల్గె నని వర్ణింపలేదు. దేవతాలక్షణములగు ధరణీస్పర్శనాభావాదులు దేవతలు నలుగురయందుమాత్రము గనుపట్టుటంజేసి నలుని గ్రహించె నని చెప్పియున్నాఁడు. మఱియు నొక విశేషము గనుఁడు.

"క. మంచకమధ్యస్థితమ,ద్వంచకపంచకమునందు వరుసమెయిఁ బరీ
క్షించెద నే నొక్కించుక, పంచజనసుపర్వలక్ష్యపర్వశ్రేణిన్." (ఆ. 5. ప. 180.)
"వ. అనుచు నేవురం గలయం గనుంగొని యందు. (ఆ. 5. ప. 181.)
"మ. ధరణిం బొందని కోమలాంఘ్రికమలద్వంద్వంబులున్ ఘర్మశీ
కరయుక్తంబులు గానిఫాలములు వక్షఃకక్షోణులం బత్త్రకే
సరము ల్గందనిపూవుదండలు నిమేషవ్యాఖ్యగైకొనిదృ
క్సరసీజంబులు నల్వురందుఁ గనియెం గాంతాలలామం బొగిన్. (ఆ. 5. ప. 182.)

"వ. కని యైదవవాఁడు నిషధరా జగుట యెఱింగి, దేవతాప్రసాదంబులేక యేకార్యంబును ఫలింప నేరదు...అనుచు...దివిజసభాజనంబునకుం బ్రారంభించి...తత్ప్రసాదలబ్ధంబైన బుద్ధివైభవంబున నమర్త్యవిలక్షణంబులగు...చిహ్నంబులను సందేహంబు వాసి..." (ఆ. 5. వ. 183.)

అని యిట్లు శ్రీనాథుఁడు శృంగారనైషధమునఁ జెప్పియున్నాఁడు. దేవతలఁ బ్రార్థించి వారి ప్రసాదమున బుద్ధివైశద్యము నొందకముందే నలునిగ్రహించి పిదప మఱల దేవతాస్తుతి చేయ నేల? దేవతాప్రసాదమునకు ముందే యున్న బుద్ధివైశద్యమే పిదప దేవతాప్రసాదమునఁ గల్గెనని వర్ణించుటలో స్వారస్య మేమో తెలియకున్నది ?

పయిరీతి ననేకస్థలములందు శ్రీనాథుఁడు సంస్కృతనైషధము నాంధ్రీకరించుటలో నందలి మెఱుఁగులను సాధ్యమగునంతవఱకైన నేకారణముననో దీసికొనిరాఁ బ్రయత్నింపఁడయ్యె. అట్టి మెఱుఁగుల నీసందర్భమున నేగాక రామరాజభూషణుఁడు వసుచరిత్రమునం దనేకస్థలములలో యథాసందర్భముగఁ జూపియున్నాఁడు. వాని నీవఱకే యుదాహరించియున్నాను.

హరిశ్చంద్రనలోపాఖ్యానము ద్వ్యర్థికావ్యమెయయిన నిందును రామరాజభూషణుఁడు శ్రీహర్షకల్పనానుసృతియందలి యభిరుచిని జూపకపోలేదు.

"అముష్యవిద్యా రసనాగ్రనర్తకీ త్రయీవనీతాఽంగగుణేనవిస్తరమ్ .." (నై.స.1.శ్లో.5.)

అనుదాని ననుసరించి,

"సీ. ...తనరసజ్ఞామృతపాకవిద్యానిరూఢి

తే. కంగగుణజాతపరిణాహ మనువుపఱచి..."యనియు,(హరిశ్చంద్రనలోపాఖ్యానము.ఆ.1.ప.15)

"శ్లో. అచీకర చ్చారు హయేన యః భ్రమీ ర్నిజాతపత్త్రస్య తలస్థలే నలః,

మరు త్కిమద్యాఽపి న తాసు శిక్షతే వితత్య వాత్యామయచక్రచంక్రమా" (నై. స. 1. శ్లో. 74) న్ననుదాని ననుసరించి

"ఉ. నేమ మెలర్పఁగా గొడుగునీడ వహించు వసుంధరాస్థలీ
సీమనె యెక్కి యాడెను విచిత్రగతిం దురగోత్తమంబు నా
భూమివిభుండు తద్భ్రములువో యెడత్రెవ్వక యభ్యసించు వా
త్యామయచక్రచంక్రమవిహారములన్ సుడిగాడ్పు లీడ్చుచున్". (శృం.నై.ఆ.1.ప.90.)

"క. పలువగ తురగముల మహాబలచిత్రప్రౌఢిఁ ద్రోలి బహుచక్రశ్రీ
వెలయు మహావిభునరుఁడా, బలియుఁడు తనగొడుగునీడఁ బఱపుచు నడరున్."
(హరిశ్చంద్రనలోపాఖ్యానము. ఆ. 1. ప. 17.)

అనియు రచింపఁబడెను. వ్యాఖ్యాతమతముచొప్పున ద్వ్యర్థికావ్యమగుటచే నిట శ్రీనాథునిపద్యమునందువలె మూలములోని యభిప్రాయము సరిగా నిమిడియుండలేదు. కాని "మహాబలచిత్రప్రౌఢి" ననుదానిచే సుడిగాలులవలె నని యర్థముచేసిన బాగుగ నుండునని తోఁచుచున్నది. వ్యాఖ్యాత యట్లు చేయకుండుటకుఁ గారణ మేమో తెలియకున్నది. పయి శ్రీనాథునిపద్యమున సంస్కృతశ్లోకములోని పదములె ప్రయోగింపఁబడినవి. అది యాతని యాంధ్రీకరణమునఁ బ్రతిపద్యసాధారణమగు రీతియయియుండుటచే నిట వింత గాదు.

పయి నుదాహరించినరీతి మహావైభవము ననుభవించిన విజయనగరరాజుల యధికారము క్రమక్రమముగ క్షీణించి మన యాంధ్రలోకమున నానాటికి విస్మృతప్రాయ మయ్యెను.

చంద్రగిరికి రాజుగానున్న యీతఁడు శ్రీరంగరాయల చేతిక్రింది నాయకునిచే నిండియా గవర్నమెంటువారి కొక మైలు వెడల్పును నైదుమైళ్లు పొడవును గలప్రదేశము (క్రీ. శ.) 1639 వ సంవత్సరమున నీయఁబడె ననియు నందె సుప్రసిద్ధమైన ఫోర్టుసెంటుజార్జి యను చెన్నపురికోట కట్టఁబడె ననియు ఫర్గాటసెంపైరులో (221, 233 పుటలు) వ్రాయఁబడియున్నది.

అళియరామరాజు మనుమఁడు చినవెంకటపతిరాజున కౌరసపుత్త్రుఁడును, నళియరామరాజు సోదరుఁడు వెంకటాద్రికి మనుమఁ డగు గోపాలరాయనికి దత్తుఁడును నైన శ్రీరంగరాజె పైనుదాహరించిన శ్రీరంగరా జని గ్రహింపవలసియున్నది.

" ... ... ... ... ... ...

సర్వోర్వీం ప్రచకాస్తి సింధుపరిఖాం శ్రీరంగరాయాగ్రణీః. 48

గ్రహర్తుబాణచంద్రాఖ్యగణితే శకవత్సరే......" (శా. శ. 1569 క్రీ. శ. 1647)

శ్రీచంద్రగిరిరాజ్యస్థం ... ... ... ... ... 56

... ... ... ... ... ... ...

పుత్తూరుగ్రామరత్నం తత్ సర్వసస్యసమన్వితమ్,

శ్రీవిలాసపుర మితి ప్రతినామసమన్వితమ్. 59

... ... ... ... ... ...

శ్రీరంగరాయభూపాలో మాననీయో మనస్వినామ్,

సహిరణ్యపయోధారాపూర్వకం దత్తవాన్ ముదా." 63 యని యున్నది.

(నెల్లూరుజిల్లా దానశాసనముల మొదటిభాగము 60 వ పేజీ.)

ఈ శాసనములో నళియరామరాజ తిరుమలరాజవేంకటాద్రుల వంశముల మూఁడుశాఖలును వర్ణింపఁబడెను. ఈవంశములోని శ్రీరంగరాజులలో నితఁడె యాఱవవాఁడు. మఱియు నితనిచే దానము చేయఁబడిన యీ యుత్తూరు గ్రామము చంద్రగిరి మండలములోని దని పైశాసనములో నుండుటచేతను ఫర్గాటసెంపైరులోఁ జంద్రగిరి రాజగు నాఱవ శ్రీరంగరా జాస్థలము నిచ్చె నని చెప్పుటచేతను గాలసామ్యముచేతను నితఁడే యతఁ డని దృఢముగాఁ జెప్పవచ్చును.

వీరివంశస్థు లిప్పటికిని హైదరాబాదు నబాబులకుఁ బన్ను చెల్లించునట్టి యానెగొందిసంస్థానమున కధీశులయి యున్నట్లు ఫర్గాటసెంపైరులో (215 వ పుట) వ్రాయఁబడియున్నది.

## బట్టుమూర్తి లేక రామరాజభూషణుఁడు

రామరాజభూషణుఁడు లేక బట్టుమూర్తి యను నీతని జన్మస్థానము బట్టుపల్లె యనియు, నీ గ్రామము కవితాప్రవీణు లయి ప్రబంధాంకమువా రని ప్రసిద్ధిగాంచిన యీతని పూర్వులకుఁ గృష్ణరాయలచే నీయఁబడినదనియు శ్రీవీరేశలింగముపంతులవారు వ్రాసియున్నారు. ఈ గ్రామము బళ్లారి మండలములోని పాలమండలమునకు సమీపమున నున్న దని కొందఱును, గడపమండలములోని పులివెందల తాలూకాలో నున్న దని మఱికొందఱును జెప్పుచున్నట్లు వ్రాసియున్నారు. కొందఱు కృష్ణా మండలములోని మోదుకూరను గ్రామ మీ కవిజన్మస్థల మని చెప్పుచున్నారు గాని వీనిని నిర్ణయించుటకుఁ దగిన యాధారము లేవియు నగపడ వనియుం వ్రాసిరి.

రామరాజభూషణుఁడే బట్టుమూర్తి యని యింతకుముందు వ్రాసియేయున్నాను.(చూ. 51 పు.) ఇఁక బట్టుమూర్తి యను నామసామ్యముచేఁ గొందఱు భ్రమించి కాకమానిమూర్తియు నితఁడే యని యభిప్రాయపడిన ట్లీక్రింది చాటుపద్యము సూచించుచున్నది.

"ఆ. అల్లసానివాని యల్లికబిగిసొంపు, ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకుఁ
బాండురంగవిభుని పదగుంభనంబును, గాకమానురాయ నీ (కె కలదు) కుఁ దగుర."

బట్టుమూర్తి కృష్ణరాయల మెప్పించి యొక ముత్యాలహారమును బహుమాన మందఁగా దక్కిన కవులు మత్సరించి దానిని హరింపఁ దెనాలిరామకృష్ణునిఁ బ్రేరించి రనియు నతఁ డీపద్యముదో బట్టుమూర్తిని స్తుతించి యాహారము నాతనినుండి బహుమతిగాఁ గొనెననియు, మూర్తి కృష్ణరాయలసన్నిధి కేఁగి బ్రాహ్మణకవులందఱును మునుపటి మాత్సర్యమునువిడిచి తనకు లోఁబడిరని చెప్పుచు రామకృష్ణుఁడు తన్ను స్తుతించి చెప్పినపద్యమును జదువఁగా రాజు సంతోషించె ననియు మఱునాఁటి సభలో రామకృష్ణుఁ డాపద్యమున కర్థాంతరము చెప్పి బట్టుమూర్తి కంచుకమును దీయించి యాతని వీపుననున్న తామరను జూపి పరిహసించె ననియుఁ జెప్పుదురు. పైవిషయములు గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు తమ కవిజీవితములలో వ్రాసియున్నారు. ఈవిషయములు విశ్వసింపఁదగినవి కావనియు, రాజవాహన విజయపాంచాలీ పరిణయకర్తయు బ్రాహ్మణుఁడును నగు కాకమానిమూర్తి బట్టువంశజుఁడగు మూర్తికంటె నన్యుఁ డనియు వ్రాయుచు శ్రీపూండ్ల రామకృష్ణయ్యపంతులుగారు పరిహసించిరి.

పిదప శ్రీరామమూర్తిపంతులుగారు తెనాలిరామకృష్ణకవిగాథలలో నీయైతిహ్యము వాడుకలో నున్నరీతిని వ్రాసినంతమాత్రమున నది యపహాసనీయము గాదనియుఁ బ్రాస్తావికపద్యములవలెనే యన్యవిషయకమగు నీచాటుపద్యమును బట్టుమూర్తివిషయమునఁ దెనాలిరామకృష్ణుఁ డుపయోగించియుండ వచ్చు ననియు సమర్థించుకొనిరి. కాని యీ పద్యము కాకమాని మూర్తికృత మగు పాంచాలీపరిణయములో నున్న దనియు నీమూర్తి, బట్టుమూర్తి తెనాలిరామకృష్ణులకుఁ దరువాతివాఁ డనియు శ్రీ వీరేశలింగముపంతులవా రాంధ్రకవులచరిత్రములో వ్రాసియున్నారు. ఇది శ్రీరామమూర్తిపంతులవారి సమర్థనమునకు బాధకముగ నున్నది. అయినను గాకమానిమూర్తి తన కృతులను నరాంకితములుగఁ జేయకుండుటచేతను గవిత్రయము వారినిదప్పఁ దక్కిన యాంధ్రకవులను స్తుతింపకుండుటచేతను నీతనికాలము నిర్ణయింపఁ దగియున్నదా యని యాలోచింపవలసియున్నది.

అల్లసాని పెద్దనార్యుఁడు తన కొమారుఁడు చదువుకొనక తిరుగుచుండఁగాఁ జూచి శిక్షింప నందుమీఁదఁ బెద్దనార్యునిభార్య మీశిష్యుఁడగు బట్టువానిపాటి శ్లేషముక్కలు చెప్పుకొనుశక్తి కలుగకపోదు. ఏల శిక్షించెద రని పలికె ననువాడుక గలదు.

రామరాజభూషణుఁ డొకప్పు డీక్రిందిపద్యముతోఁ గృష్ణదేవరాయలను స్తుతించినట్లు వాడుక గలదు.

"ఉ. అబ్జముఖీమనోజనరసాధిపనందనకృష్ణ నీయశం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము నీపరాక్రమం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము నీవితీర్ణిమం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము చిత్ర మిద్ధరన్."

రామరాజభూషణుఁడు తిమ్మరసుపైఁ గోపించి గుత్తిలో విస్తరాకులు కుట్టుట చంద్రగిరిలో

మధుకరముచేసికొనుట మొదలగు నాతని బాల్యపు నీచస్థితిని వెల్లడించుచుఁ బద్యము చెప్పెదోడఁగి తిమ్మరసు ప్రార్థనచే మరల దానిని మళ్ళించెననియుఁ జెప్పుచు నీక్రిందిపద్యమును జదువువాడుక గలదు.

"శా. గుత్తిం బుల్లెలుగుట్టి చంద్రగిరిలోఁ గూడెత్తి పెన్గొండలో
హత్తిన్ సత్రమునందు వెండి బలుదుర్గాధీశుతాంబూలపుం
దిత్తున్ మోసి పదస్థు లైనఘనులం దీవించ దీవించెదన్
మత్తారాతియయాతి నాగమసుతున్ మంత్రీశ్వరుం దిమ్మరున్."

పయి యైతిహ్యములును జాటుపద్యములును రామరాజభూషణుఁడు కృష్ణదేవరాయలకాలము నందును నుండె ననియు నీతఁ డల్లసాని పెద్దనార్యుని శిష్యుఁ డనియు సూచించుచున్నవి. బట్టుమూర్తి యల్లసాని పెద్దనార్యుని శిష్యుఁ డని "ముప్రత్యయాభావస్యాల్లసాని పెద్దనార్యశిష్యేణ బట్టుమూర్తి మహాకవినా విరచితే వసుచరిత్రే" యను సాంధ్రకౌముదీగ్రంథములోని వాక్యము (ఆంధ్రకవుల చరిత్రము ద్వితీయభాగానుబంధము 197 వ పుట) స్పష్టపఱచుచున్నది. మఱియు బట్టుమూర్తి కృష్ణదేవరాయల యాస్థానమునందలి యష్టదిగ్గజములలో నొకఁ డను ప్రసిద్ధియుఁ గలదు.

పైవిషయముల నీక్రింద నుదాహరించు నుత్పలమాలికయుఁ గొంతవఱకు బలపఱచుచున్నది.

"ఉ. లొట్టయిదేటిమాట వెతలోభులతో మొగమోట యేల? తాఁ
గుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరపుర్వని యందు రే కదా
పట్టపురాజుపట్టి సరిపల్లెసరాసరి యాయతున్న నేఁ
దిట్టకమాన నామతము తీవ్రమహోగ్రభయంకరంబుగాఁ
దిట్టితినా మహోగ్రహమతిన్ మకరగ్రహజర్జరీభవత్
పట్టపుధట్టఘోలఫణిభర్త్రజహూత్కృతపర్జటస్ఫుటా
ఘట్టనధట్టనాలకవిఘట్టకనిర్గళరాజభృత్యకీ
చట్టచటార్భటీనయనజర్జరకీలలు రాలఁ గా వలెన్
జొట్టరికంబునన్ బోగడఁ జూచితినా రజితాద్రిధిత్యకా
పట్టణమధ్యరంగగతభవ్యవధూవదనానుషంగసం
ఘట్టశిరస్థగాంగఝరహల్లకజాలసుధాతరంగముల్
చుట్టుకొన న్వలెన్ భువనచోద్యముగా భయదంబుగా మఱిం
దిట్టితినా సభాభవనధిక్కృతభీమనృసింహరాడ్ద్విజా
తాట్టమహాట్టహాసచతురాస్యసముద్భ్రుకుటీశటీనటీ
కోట్టణరోమజాలహృతకుంఠితకంఠగభీరనాదసం
ఘట్టవిజృంభమాణగతిఁ గావలె దీవనపద్య మిచ్చి చే
పట్టితినా మణీకనకభాజనభూషణ భాసురాంబరా
రట్టతురంగగంధగజరాజదమూల్యఘనాతపత్త్రభూ
పట్టణభర్మహర్మ్యభటపంక్తి చిరాయు వనామయంబునై
గట్టిగఁ దోడుతో వెలయఁగావలె నెక్కువలీలఁ జూడుఁడీ
యట్టిటు మందమేలముల నందఱినింబలెఁ జుల్కఁజూచి యే
పట్టునసైనఁ గేరడము పల్కకుఁడీ పయివచ్చునందులన్.

గొట్టుదు దుష్కవిద్విరదకోటులఁ బంచముఖోద్భటాకృతిన్
బెట్టుదు దండముల్ సుకవిబృందముకే నతిభక్తి సారెకున్
గట్టితి ముల్లె లేఁబదియుఁ గాఁ గల నూటపదాఱు లెయ్యెడన్
రట్టడిబట్టుమూర్తి కవిరాయనిమార్గ మెఱుంగఁ జెప్పితిన్."

ఈపద్య మల్లసాని పెద్దనార్యుని కవిగండపెండేరవిషయక మగు నుత్పలమాలికకుఁ బ్రతిగా నగపడుచున్నది.

"ఉ. ప్రాఁతమెఱుంగులుం బసరుపూఁపబెడంగులు సూపునట్టి వా
కైతలు జగ్గునిగ్గు సెనఁగావలెఁ గమ్మనఁ గమ్మనన్వలెన్
ఖాతిరియుం బవల్మ అవురాని హొయల్ చెలియారజంబు ని
ద్ధాతరితీపులంబలెను దారసిలవ్వలె లోఁ దలించినన్
ఘాఁతిగఁ బైకొనవ్వలెను బైదలికుత్తుకలోని పల్లటీ
తూఁత లనవ్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్నిమే
ల్మోఁతల చన్నుదోయివలె ముచ్చటగావలెఁ బట్టిచూచినన్
ఘాతొడ సన్న మిన్నులమిటారపు ముద్దులగుమ్మ కమ్మనా
వాతెఱదొండపండువలె వాచవిగావలెఁ బంట నూఁదినన్
గాతల్లఁ దమ్మిచ్చూలిద్దొర కైవసపుంజవరాలి సిబ్బెపు
న్మేతెలి యబ్బురంపు జిగి నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బపొం
దూఁతలనున్న కాయసరిపోఁడిమి కిన్నెరమెట్లబంతిసం
గాతపుసన్నబంతిబయకారపుఁ గన్నడగౌళపంతుకా
సాతతతానతానలపసందివుటాడెడు గోటమీటుటల్
మ్రోఁతలునుంబలెన్ హరువు మొల్లము గావలె నచ్చతెన్గులీ
రీతిగ సంస్కృతంబు పచరించెడుచట్టు భారతీవధూ
టీతపనీయగర్భనికటీభవదాననపద్మసాహితీ
ధౌతికనాటకప్రకరభారతభారతసమ్మతప్రభా
పాతసుధాప్రపూరబహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మలయసంగతిచుంచువిపంచికామృదం
గాతతతేహితత్తహితహాథితధంధణుధాణుధింధిమి
వ్రాతనయానుకూలపదవారకుహూద్వహవారికింకిణీ
నూతనఘల్లఘల్లచరణనూపురఝుళిఝుళీమరందసం
ఘాతవియద్ధునీచకచకద్వికచోత్పలసారసంగ్రహా
యాతకుమారగంధవహహారిసుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁజేయవలెఁ జిల్లునఁ జల్లవలె న్మనోహర
ద్యోతకగోస్తనీఫలమధుద్రవగోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచిరప్రసరంబుగ సారెసారెకున్."

పయి యుత్పలమాలికల రచనను బట్టి చూడఁగా బట్టుమూర్తి యుత్పలమాలికయే మొదటి దనియుఁ, బెద్దన యుత్పలమాలిక దాని ధిక్కరించుచుండుటచే నిది తత్పరభావి యనియు స్ఫురించుచున్నది. కాన నిదియు బట్టుమూర్తి పెద్దనకాలముననుండి యుండు నని సూచించుచున్నది.

వసుచరిత్ర పీఠికలో (క్రీ. శ.) 1577 వ సంవత్సరమున జరిగిన పెనుగొండ యుద్ధము సూచింపబడుటచే బట్టుమూర్తి యంతకుఁ బయిగా జీవించియుండె ననక తీరదు. కాబట్టి (క్రీ. శ.) 1530 వ సంవత్సరమునకె చనిపోయిన కృష్ణరాయల యాస్థానమున బట్టుమూర్తి యుండుట యసంభవ మని కొంద ఱీ విషయమున సందేహించుచున్నారు. చిలుకూరి వీరభద్రరావుగారు జీర్ణకర్ణాట రాజ్యచరిత్రములో (232 వ పుట) రామరాజభూషణుఁడు కృష్ణదేవరాయలకాలములోనివాఁడు కాఁడని స్పష్టముగాఁ జెప్పియున్నారు.

బట్టుమూర్తి (క్రీ. శ.) 1500 వ సంవత్సరప్రాంతమున జన్మించి యున్నను గృష్ణరాయల యాస్థానమున నుండె నని చెప్పుట కవకాశ మున్నదిగదా! ఇట్టి స్థితిలో నితఁడు క్రీ. శ. 1580 వ సంవత్సరమునకుఁ బయిగా జీవించె ననుట యె ట్లసంభవ మగును? ఎనుబది తొంబది సంవత్సరములవఱకు జీవించినవా రిప్పుడును గలరని యెల్లరకును విదితమేగదా! అళియరామరాజు తల్లికోట యుద్ధకాలమునకుఁ దొంబదియాఱేండ్లవాఁ డని ఫర్గాటసెంపైరులో (203 వ పుట) నున్నది. అళియరామరాజు మొదటఁ గుతుబ్‌షాయొద్ద సేనానిగానుండి పిదపఁ గృష్ణరాయల నాశ్రయించె నని వీరభద్రరావుగారే వ్రాసియున్నారు. (జీర్ణకర్ణాటరాజ్యచరిత్రము 250 వ పుట) కృష్ణరాయలకాలమునందు యుక్త వయసులో నున్న యళియరామరాజు తల్లికోట యుద్ధకాలమునకును (క్రీ. శ. 1565) యుద్ధము చేయుటకుఁ దగినశక్తి గలిగియుండలేదా!

బట్టుమూర్తి యిట్లు మొదటఁ గృష్ణరాయల యాస్థానమునందు సన్మానింపఁబడి పిదప నరస భూపాలీయమును రచించెను. రామరాజు సభ నలంకరించి రామభూషణ బిరుదముం గాంచెను. పిదప వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములను రచించి వసుచరిత్రమును దిరుమలరాయలకును హరిశ్చంద్రనలోపాఖ్యానములను శ్రీరామదేవతకును గృతి యిచ్చి యిహపరములను సాధించుకొనెను.

"శా. శ్రీరామక్షితిపు న్మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణుం బహుసంస్కృతాంధ్రకృతులం బల్మాఱు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయవేదండాగ్రహారాదిస
త్కారం బందితి రామభూషణకవీ! ధన్యుండ వీ వన్నిటన్." (వసు. ఆ. 1. ప. 16.)

అను వసుచరిత్రములోని పద్యమును బట్టి చూడఁగా నీతఁ డింకను ననేక కృతులు రచించి నట్లు విశద మగుచున్నది.

బంగారమునకు వెలిగారమువలె నీమహాకవి కవితాధారకు సంగీతనైపుణి తోడుపడుటచే నీతఁడు బహిరంతస్స్ఫురద్రసము లగు పద్యములు రచింపఁ గలిగెను.

ఉ. తేనియలొల్కు మాటలును దీసినతీఁగెలుపోని కూర్పులున్
వీనులవిందుచేసెడు నవీనమృణాళమృదూక్తివైఖరుల్
తో నరుదెంచు వ్యంగ్యములతో నలరారెడు నైజభాషణల్
పూనక కూర్చు రామనృపభూషణనైపుణ మెన్న శక్యమే.

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి,
శ్రీవిజయనగరమహారాజావారి సంస్కృతకళాశాలాపండితుఁడు.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1965—2000 కాపీలు.

# వసుచరిత్ర విమర్శనానుబంధము



పాఠకమహాశయులారా, పండితాగ్రేసరులు స్వభావసులభమగు సమ్మోదముతో గ్రంథములఁ బ్రశంసించిన ప్రశంసనములను గ్రంథకర్తలు వెలయించుటెల్ల నావిమర్శకాగ్రగణ్యుల హృదయ వైశాల్యమును భాషావాఙ్మయసేవకులందు వారికిఁగల యవ్యాజకారుణ్యాతిశయమును వెల్లడించుటయే గాని వేఱొండు గానేర దనుతలంపున నారచించిన వసుచరిత్ర విమర్శనముపై విమర్శకాగ్రగణ్యు లొసంగిన యభిప్రాయములలోఁ గొన్ని ముఖ్యములగువాని నీద్వితీయ ముద్రణావసరమునఁ దొలు దొల్తఁ బ్రచురించుచున్నాఁడను.

విమర్శకాగ్రగణ్యులును బ్రకృతమున నాంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులును నగు మ-రా-శ్రీ, కట్టమంచి రామలింగారెడ్డి, ఎం. ఏ., వారు మ-రా-శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి వ్రాసిన జాబులోని యభిప్రాయాంశములు.



Yelwal Road,
Mysore. 24th March 1916.

Dear Sastrulu Garu,

Many thanks for your kindness in sending me Mr. V. China Sitarama Sastrulu's "Vasucharitra Vimarsanamu." For the last two days I have been looking into it with great pleasure and interest. It is a most scholarly and able commentary and reminds one of some of the finest achievements of Mr. Vedam Venkataraya Sastri. In Mr. China Sitarama Sastri, the Telugu world possesses a scholar of extraordinary power and grasp. He is a man of astonishing brilliance and I request you to convey to him my hearty appreciation of his genius

Yours sincerely,
(Sd) C. RAMALINGA REDDY.



వారు నాకుఁ బ్రత్యేకముగ వ్రాసిన యభిప్రాయాంశములు.

ఆర్యవర్యా!

తాము రచించిన వసుచరిత్ర విమర్శనమును శ్రీ వావిళ్ల వేంకటేశ్వరులుగారు పంపఁగాఁ జూచి నాకుతూహలమును అద్భుతానందమును దెలుపుచు వారి కిదివఱలోనే వ్రాసియున్నాను. ఆ యుత్తరమును వారు తమకుఁ బంపియుండవలసినది. లేనిచో వ్రాసి తెప్పించి చూడుఁడు.

మీ విమర్శనము అద్వితీయం బని తోఁచెడిని. ఒక్కవేళ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రుల వారికృతులు తుల్యములేమో! భాషాపరిశోధన మీవలె దీర్ఘముగను, అగాధముగను, సూక్ష్మముగను జేసినవారు అనేకులు లేరు. అనేకు లననేల! ఎవ్వరును లే రన్న నత్యుక్తియా! భాషావిషయక విమర్శనమునందు మీగ్రంథము నాకుంజూడఁ బ్రథమగణ్యంబు.

మద్రాసు
2-4-1916

క. రామలింగారెడ్డి.

---

4, మల్లి కేశ్వరులగుడివీథి,
జార్జి టౌను, మదరాసు.
11-2-1919.

శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారికి,—

వేదము వేంకటరాయశాస్త్రి నమస్కారపూర్వకముగా విన్నవించు క్షేమవార్త. ఉ. కు.

చిరకాలమునకుముందే మీరు నాకు ప్రీతిపూర్వకముగా నొసంగిన మీరచించిన వసుచరిత్ర విమర్శనగ్రంథమును ఇన్నాళ్లకిప్పుడు పరికింపఁగలిగితిని.

తొల్లి ఏకార్ణవమందు మునింగిపోయిన భూతధాత్రిని సముద్ధరించువాఁడై ఏకార్ణవమై నింగిని మ్రింగ సమకట్టుచున్న యామహేశ్వర ద్వితీయమూర్తిని త్రోచి ఎక్కడిసముద్ర మక్కడ నిమిడియుండునట్లు నిలిపిన యానారాయణతార్తీయీకావతారముంబోలె మీరు వసుచరితాది విమర్శన క్రియలో తదాశ్రితమై యనంతమై, బహురూపముల నున్న యభిప్రాయవ్యాభోగమును వేఱు పఱిచి విభజించి అవాంతరభాగము లేర్పఱిచి దానిదాని తావున దానిదాని నిలిపి వాఙ్మయప్రపంచమును అవ్యాకులముగా నుండునట్లు కావించితిరి. ఇందులకుఁగాక మఱియెందుల కానందింపఁ దగును. ఎక్కడను ప్రల్లదములేక సర్వమును ఉపాదేయవిషయబహుళమై యున్నది. ఇది నా యభిప్రాయము.

వే. వేంకటరాయశాస్త్రి.

---

ఆనందప్రెస్సువారు ముద్రించిన వసుచరిత్రమునకు సశేషపీఠిక వ్రాసిన కీర్తిశేషులైన శ్రీమాన్ తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు వేఱుగ వ్రాయకున్నను నాగ్రంథముపై సదభిప్రాయముతో నున్నవారేయని చెప్పవచ్చును. ఇందలి విషయములను వారు చాలవఱకుఁ బూర్తిగ నంగీకరించి రని చెప్పుటకు సందేహము లేదు. వేయేల! దానింజూచి యిదిగాని దీనిం జూచి యదిగాని కొన్నిస్థలములందు వ్రాయఁబడెనన్నంత సంబంధము సావధానముగా నా రెండు పీఠికలను జదివెడి పాఠకమహాశయులకుఁ దోఁచకమానదు. అంతపూర్తిగ నావిమర్శనమును వారు సిద్ధాంతముగ నెంచికొన్నందులకు వారియెడల నేను కృతజ్ఞుఁడ నగుచున్నాను.

వారి విమర్శనముకన్న నా విమర్శనము ప్రాచీన మని పాఠకమహాశయులకు విశదపఱుటకయి ఆనందప్రెస్సువారు నాకు లోఁగడవ్రాసిన యొకజాబు నిటఁ బ్రచురించుచున్నాను. పీఠికా రచనా కాలమధ్యమున శ్రీమత్తేవప్పెరుమాళ్లయ్యగారు పరమపదించినందున నానందప్రెస్సువా రీజాబు

నాకు వ్రాసియుండిరి. కావుననె యాపీఠికగూడ సశేషముగనే యుండిపోయినది. కాని యిట్టి గ్రంథము నేనే పూరించి మరల వేఱొకరికి వ్రాసియిచ్చుట సరి కాదని తలఁచి యట్లు పూరించుట కును సమ్మతింపఁ జాలనైతిని. నాకు వారు వ్రాసిన జాబియ్యది:—

R. VENKATESWAR & Co,

Ananda Press.

Proprietors of
The Madras Stationery Mart.
No. 383/13

Loane Square,
Madras, 11th Oct. 1922.

Vajjhalla Sitaramaiah garu,
Telugu Pandit,
Maharajah's College,
Vizianagaram.

Dear sir,

We send you herewith by book post 6 forms of Vasucharitra preface. We reqnest you to kindly to complete this by a form or two.

Yours faithfully,
(Sd.) R. Venkateswar and Co.

---

SRI RAMA VILASA GRANDHA NILAYAM,
Pithapuram, P. O. Godavari. 7-3-20.

ఆర్యవర్య,

తాము రచించిన హరిశ్చంద్ర నలోపాఖ్యానపీఠికను జదువుచుంటిని.

... ... ... ...

నేను మీ వసుచరిత్ర విమర్శనమును శ్రద్ధగా నిదివఱకే చదివియుంటిని. ఇప్పు డిది చదువు చున్నాఁడను. నేను పెద్దన్నకంటె రామరాజభూషణుఁ డధికుఁ డనువాఁడను కాను. రామరాజభూష ణుఁడు, బట్టుమూర్తియు నొక్కరనువాఁడను కాను. అయినను మీవాదము వినుటకు మనోహరముగా నున్నది. ఒక్కొక్కప్పుడు నానమ్మకములు బీటలువారిపోవున ట్లుండును. మీయభిప్రాయపోషణముగ మీరు వ్రాయుధోరణి యాంగ్లేయమురాని మన సంస్కృతపండితులు నేర్చుకొనవలసినదికదా !

మిమ్ము నే నెఱుఁగకపోయినను మీ యభిప్రాయములకు విరుద్ధములగు నభిప్రాయములు కొన్ని చోట్ల కలవాఁడనైనను మీవాదము, మీవిమర్శనములయం దధికాదరమును భక్తికలవాఁడను. ...

... ... ... ...

వంగూరి సుబ్బారావు.

కీర్తిశేషులయిన వంగూరి సుబ్బారావుగారు వ్రాసిన యీజాబులో "నేను పెద్దన్నకంటె రామరాజభూషణుఁ డధికుఁడనువాఁడను కాను. రామరాజభూషణుఁడు, బట్టుమూర్తియు నొక్కరనువాఁడను కాను" అని యిట్లు నాయభిప్రాయములందు వారికిఁగల వైమత్యము సూచింపఁబడినది. కాని రెండిటికిని దగిన కారణములను వారు వ్రాయరైరి. అందు మూర్తి రామరాజభూషణుల యైక్యమును గూర్చి వ్రాయవలసినంత వ్రాసియె యున్నాను. అట్టి నాయుక్తులను ఖండింపఁజాలు ప్రబల ప్రమాణములు చూపఁబడునంతవఱకును నాయభిప్రాయములను మార్చుకొన వలసిన ప్రసక్తి యగపడదు. ఇంక నాంధ్రకవితాపితామహునికన్న రామరాజభూషణుఁ డధికుఁ డని నేను వ్రాసినట్లు వ్రాసియున్నారు. ఈవిషయమున మాత్ర మించుకంత పాఠకమహాశయులకు విన్నవించుకొనవలసియున్నది.

శివకేశవులకుఁ దారతమ్య మెంచుటకుఁ దలపడినట్లే యమ్మహాకవులకుఁ దారతమ్య మెంచుటకుఁ దలపడుటగూడ సరి కా దనుట నిశ్చయము. కాని, యేవేని కారణములచే నట్లు తారతమ్య మెన్నుటకుఁ దలపడినపుడు మాత్ర మొకపక్షమున మాటలాడువారికి రెండవపక్షమునందలి లోపములు చూపకతీరదు గాన వారిలో నొకరి నించుక నిరసించినట్లు భాసిల్లకమానదు.

నిజముగా నమ్మహాకవుల తారతమ్యమునుగుఱించి ప్రసంగించుట నా కిష్టమే కాదు. కాని నేను వసుచరిత్ర విమర్శనము వ్రాయునాఁటికే కొందఱు విమర్శకులు 'మనువసురచనా విమర్శనా'ది గ్రంథములు వ్రాసి పెద్దనార్యునికంటె రామరాజభూషణుఁడు మిక్కిలియలంతి యని కొన్ని బలహీనములగు యుక్తులుచెప్పి ప్రసంగించియుండిరి. కవితారీతులందలి రుచులు భిన్నభిన్నములుగ నుండునుగదా!

ఆంధ్రభారతీమతల్లి కవిబ్రహ్మలరుచిభేదములనుబట్టి కావ్యాదర్శప్రదర్శిత పరస్పర విజాతీయమాధుర్యధుర్యరీతిద్వయముతో మొత్తముమీఁద ద్వైరూప్యమున మూర్తీభవించి యాంధ్రపాఠకమహాశయుల నెల్లఁ జొక్కించుచుండఁగా శబ్దశక్తికృతవ్యంగ్యవైభవము నెఱుఁగనట్టియుఁ జాలవఱకు సులభమార్గముననె విలసిల్లునట్టియుఁ గథానిర్వహణ చమత్కార కుతూహలముతో నలరునట్టియు మాధుర్యధుర్యమగునట్టియు నాంగ్లభారతిని సేవించిన కారణంబునను గొందఱపట్ల సంస్కృతాంధ్రభాషా సాహితీపటిమ చాలనికారణంబునను, వైదర్భీరీతిమాత్రప్రియులును గౌడీరీతిపరాఙ్ముఖులును నగు నాంధ్రపాఠకమహాశయు లధిక సంఖ్యాకులయి యాంధ్రదేశమునఁ బ్రముఖులయి యొసంగుటచే నేఁటికట్టి గౌడమార్గప్రధానములగు వసుచరిత్రాది మహాకావ్యములయం దరుచి మిన్నుముట్టవలసి వచ్చెను.

అట్టిస్థితిలో వసుచరిత్రమునందలి సారస్యమును జూపఁగడంగిన నాకుఁ బ్రతివాదులు వసుచరిత్రమునందు లోపము లనిచూపినవెగాక మఱికొన్నియు మనుచరిత్రలోఁగూడఁ గల వనియు, వసుచరిత్రమున గుణబాహుళ్యము గల దనియు వ్రాయక తప్పినదికాదు. అంతమాత్రమున నే నాంధ్రకవితా పితామహు నలంతిగఁ దలంచితి నని భావించుట న్యాయ్యము కాదు.

పరిశీలింపఁగాఁ బెద్దన రామరాజభూషణు లిద్దఱును నసాధారణ కవితాసామర్థ్యము కలవారు. వే యేల! నేఁటికిసైతము వారు మృతజీవులై వెలయుచుండుటయు వారిగ్రంథము లాంధ్రభాషను సేవించెడి పండితాగ్రేసరులకెల్ల గౌరవావహములై వెలయుచుండుటయు నమ్మహాత్ములకవిత [illegible]

త్తరగుణో త్తర మని వెల్లడింపఁజాలియుండు ననుటకు సందేహము లేదుగదా ! పరిశీలింపఁగా వీరిరువురకవితామార్గములును బరస్పరవిజాతీయము లగుటచే వీరి కవితల తారతమ్యము విమర్శించుట కేవలము నసంగత మనఁజనును.

ప్రసంగవశమున వీరి కవితారీతుల నిటఁ గొంతవఱకుఁ జూపుచున్నాఁడను. పెద్దన రామరాజభూషణులు తమతమ కవితాభిరుచుల నిట్లు కొంతవఱకు వెల్లడించి యున్నారు.

తే. ... ... ... ... ... ...

కృతిరచింపుము మాకు శిరీషకుసుమ, పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య.

(మనుచరిత్ర 1 ఆ. 14 పద్య.)

ఉ. పూఁత మెఱుంగులుం బలెను బూపబెడంగులు సూపునట్టి వా
కైతలు; జగ్గు నిగ్గు నెనగావలెఁ గమ్మన గమ్మన న్వలెన్;
రాతిరియుం బవల్ మఱపురానిహొయల్ చెలియారజంపుని
ద్దాతరితీపులుం బలెను దారసిల న్వలె లోఁ దలంచినన్;
బాఁతిగఁ బైకొనన్వలెను; బైదలి కుత్తుకలోనిపల్లటీ
కూఁతలన న్వలెన్; సొగసుఁగోర్కులురావలె నాలకించినన్;
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్నిమేల్
మూఁతల చన్నుదోయివలె ముచ్చట గావలెఁ బట్టి చూచినన్;
డాతొడ నున్న మిన్కులమిటారపుముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండువలె వాచవి గావలెఁ బంట నూఁదినన్; (పెద్దనార్య నుత్పలమాల)

... ... ... (చూడుఁడు 143 పుట, వసుచరిత్రవిమర్శనము)

సీ. నిజరూపమునకు వన్నియదెచ్చు వేఱొక్క బెళుకొందు ధ్వనిహీరకళిక లమర
ఛాయాంతరాలక్ష్యసహజతేజములైన లక్షణావైడూర్యలక్ష్మి లమర
రతులతోఁ దులఁదూఁగు రమణీయరసవిశేషములను గారుత్మతములు మెఱయ
గురుసువర్ణ గుణైకగుంఫితస్థితిఁ దాల్చు నాయకనాయకోన్నతులు చెలఁగ

తే. నిల నలంకారనికరంబు లిరవుకొలిపి, కమలభవగేహినీపరిష్కరణకరణ
యోగ్యములుగా నొనర్చిన భాగ్యనిధుల, భామహాదుల ననిశంబుఁ బ్రస్తుతింతు.

(నరసభూపాలీయము 1 ఆ. 18 ప.)

శా. భావం బెక్కడలేక వృత్తనియమాపాయంబుఁ జింతింప కెం
దే వర్తించి పరార్థవంచనలచే దీపించి మూర్ఖాళి సం
భావింపం గుకవిప్రణీతకృతిసామాన్యాకృతిం బూని పై
పై పన్నెల్ పచరింప దానిఁ దిలకింపం బోరు ధీరోత్తముల్. (వసుచరిత్ర 1 ఆ. 11 ప.)

శ్లో. "అస్త్యనేకో గిరాం మార్గః, సూక్ష్మభేదః పరస్పరమ్
తత్ర వైదర్భగౌడీయౌ, వర్ణ్యేతే ప్రస్ఫుటాంతరౌ."

అను దండాచార్యసూక్తిచొప్పునఁ బెద్దనార్యుని కవితారీతి స్వభావముద్రైకతానమై వర్ణ్యమానవస్తుచిత్రణతత్పరమై యౌచిత్యసంపన్నమై యుదారమయ్యుఁ గాంతిమంతమై సమాధిగుణ

భూషితమై ప్రసన్నమై మధుర మధురముగా నుండి చాలవఱకు వైదర్భి యనఁదగి యుండును. రామరాజభూషణుని కవితారీతి యన్ననో యర్థాంతరఘటనైకతానమై యాలంకారికప్రపంచప్రసిద్ధలోకోత్తరవస్తుచిత్రణచతురమై యుదారమై సమాధిగుణాలంకృతమై శబ్దార్థాలంకారబహుళమై మధుర మధురముగ నుండి చాలవఱకు గౌడి యనఁదగి యుండును. స్వర్ణకారుఁడు కుందనపుఁ బనిచేసి యందు మాణిక్యముల నందముగఁ బొదిగి యపూర్వాలంకారములను నిర్మించునట్లే రామరాజభూషణుఁడు శబ్దార్థశక్తికృతవ్యంగ్యగుంభితములగు భావవిశేషములను మిక్కిలి నేర్పుతోఁ జమత్కరించి వానిని మఱిమఱి సరిదిద్ది యపూర్వకావ్యాలంకారములను సృజించు శీలముగలవాఁడు. ఇట్టి విజాతీయకవితలకుఁ దారతమ్య పరీక్ష చేయుట పొసఁగునా ?

ఇంక నమ్మహాకవుల కవితాసారస్యము సహృదయులకు విశదపడుటకయి యిట నిరువుర కవితలను దిఙ్మాత్రముగఁ జూపి యందలి సారస్యము నెన్నికచేసి యంతటితో నీవిమర్శనానుబంధమును ముగించుచున్నాను.

ఉ. అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా,
గుబ్బ మెఱుంగుఁ జన్గవ గగుర్పొడువన్ మదిలోని కోర్కులా
గుబ్బతిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్.

ఉ. చూచి ఝళంఝళత్కటకసూచితవేగపదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లల నాడ నయ్యెడం
బూచిన యొక్క పోఁకనునుబోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయ పదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్.

మ. మునుమున్ బుట్టెడు కొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతం
జొనుపం గోర్కులు క్రేళ్లుద్రిప్ప మది మెచ్చుల్ ఱెప్ప లల్లార్ప న
త్యనుషంగస్థితి ఱిచ్చపాటొసఁగ నొయ్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్.

(మనుచరిత్రము. 2 ఆ. 28,29,30 ప.)

సంగీత రసాస్వాద పరవశయై యున్న స్వర్వేశ్యయుఁ బ్రగల్భయునగు వరూధినికిఁ గన్నిచ్చకు వచ్చిన కాంతుఁ డట్టి యేకాంత మోహన ప్రదేశమున హఠాత్తుగా నగపడునపు డామె తొలుదొల్త నత్యాశ్చర్యముతోడను నమందానందముతోడను నాతనిపై నెడతెగని యాలోకన పరంపరలఁ బఱపుటయుఁ, దోడనె సత్త్వోద్రేకమున శృంగారదేవతావిహారప్రధానరంగము లనఁదగు నామె కుచకలశములు పులకితములగుటయు, వెనువెంటనె వివిధరతోత్సవకౌతుకితములగు వాంఛలు క్రమ్ములాడుటయు, నట్టిసమయమున నవ్విలాసిని లేచి యొయ్యారపుఁ గులుకు నడలతోఁ దనమనంబున విహరించు దర్పకు విహారమును నిరూపించుచు నడయాడి నాయకుని సానురాగముగఁ జూచునపుడు మనోనిష్ఠమగు మదనావేశ మామె చూపులందుఁ బ్రతిబింబించుచుండ శంకా మోదాభిలాషాది భావకదంబము లొకటి నణఁచి వేఱొకటి సముద్రతరంగములవలె విజృంభించుటయు, స్వాభావసిద్ధము

తొసంగుచు నాయికయొక్క యాకారాశయముల క్షణక్షణ జాయమాన పరిణామముల నిరూపించుచు నట్టి వరూధినిని సహృదయహృదయములకుఁ దారసిల్లఁజేయుచున్నవి.

ఇంకఁ బయిరీతివి స్వభావసిద్ధముగ వస్తువును జిత్రించుటలోని పదార్థరచనావైఖరిగూడ నపూర్వమగుచుఁ బదరచనలోని జగ్గును, నర్థమునందలి నిగ్గును నెనయగునట్లె విలసిల్లుచున్నది.

అబ్బురపాటుతోడ నయనాంబుజములు వికసింప ననుసహోక్తిచే నాశ్చర్య మతిశయించు కొలఁదిని నేత్రములు వికసించుచునే యుండె నని ధ్వనించుచున్నది. కావుననే మున్ముందుఁగూడఁ "ప్రఫుల్ల నేత్రపద్మంబుల్" అని యిట్లు నేత్రవికాస మారంభించి ముగియకయేయుండెనని వర్ణింపఁబడెను. అట్లగుటచేతనే "తొంగలి ఱెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయి విస్తరిల్లు గన్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రు నటంచు నంగజుఁ డానవెట్టి కదియంగుఱి వ్రాసె ననంగ" అని యిట్లు సంభావింపనయ్యెను. మఱియు నాయకదర్శనముచే నాయికానయనాంబుజములు వికసిల్లె ననుటచే నాయికయందుఁ బద్మినీత్వమును నాయకునందుఁ బద్మినీనాయకత్వమును ధ్వనితము లగుచున్నవి. ప్రవరునితోఁ గాకున్నను మాయాప్రవరునితోనైన నాయికకు సమాగమము కవిచే సంఘటింపఁబడినందున నిట్టి ధ్వను లసంభవములు కానేరవు. పద్మవికాసముతో నేత్రవికాసమునకును నాశ్చర్య వికాసమునకును నభేదము నధ్యవసించుటచేతఁ బద్మబాంధవుని యాలోకనములచేఁ బద్మము లనివార్యముగ వికసించునట్లె నాయకదర్శనమున లజ్జావిదూరయగు నా ప్రౌఢనేత్రము లనివార్యముగ వికసింపసాగె నని ధ్వనించుచున్నది. ఆమె యాశ్చర్యమెడలేక వికసింపసాగె ననుటచే నాయకుని యదృష్టచరలోకోత్తరసౌందర్యాతిశయ ముత్తరోత్తరము మనోహర మగుచుఁ గన్పట్టసాగె నని ధ్వనితమగుచున్నది.

కాంతి వెల్లుబ్బుటచేఁ గనీనికలు వికసితోత్పలపంక్తులను గ్రుమ్మరించుచున్న వనుటచేత వరూధినీవరవరణ సూచక నీలోత్పలమాలికాసమర్పణము వ్యక్తమగుచున్నది. మఱియు నీలోత్పలనములు మదనసాయకములగుటచేఁ బ్రవరునిపై మోహజనకమగు మదనసాయకాసారము ప్రవర్తిల్లె నని తోఁచుచున్నది. (తత్తాదృశ మదనసాయక ప్రసారముచేఁ గూడఁ బ్రవరునిచిత్తము చలింపనైన లేదని మున్ముందు వర్ణించుట యుక్తముగనే యుండును. దానఁ బ్రవరునిజితేంద్రియత్వ మెంతయుఁ బరిపుష్టమగును.) మఱియుఁ గ్రుమ్మరింపఁగా ననుటచేతఁగూడ లజ్జావిదూర ప్రౌఢనాయికా ప్రయుక్తనిర్నిరోధాలోకన పరంపరా ప్రసారము ధ్వనించుచున్నది. పైరీతిని బ్రసరించెడి యాలోకనముల వర్ణనమెల్ల నాయకుని యదృష్టపూర్వాశ్రుతచర లోకోత్తర సౌందర్యమును నాయికారతిభావ విజృంభణమును విశదీకరింపఁ జాలియున్నది.

"నలకూబరసన్నిభు నద్ధరామరున్ జూచె" ననుటచే భూలోకమున నున్న యాదేవకాంతకు భూసురుఁడగు నాప్రవరుఁ డనురూపుఁ డనెడి సమాలంకారము ధ్వనించుచున్నది.

అవ్వరూధిని యట్లు సానురాగయై చూచినతోడనే లేచి మోహజనకముగ నటఁగులుకునడల నడయాడె నని వర్ణించు రెండవపద్యము సహృదయుల మనోదర్పణంబులం దట్టివిలాసిని యొయ్యారపు నడకలను బ్రతిబింబింపఁ జేయుచున్న దని చెప్పవచ్చును. వలుదయగు మామిడిచెట్టునొద్దనుండి లేచి పోయి సన్నని పోఁకచెట్టుచాటున నిల్చి యాలతాంగి నాయకుని సానురాగముగఁ జూడసాగె ననుటు

మిక్కిలి యుచితముగనున్నది. పూచినపోఁకచెట్టును జేరె ననుటచే వలపులంగులుకు నాయకు నవ్వరూధిని చేరఁగలదను కల్యాణోదర్క_త ధ్వనితమగుచున్నది.

ఆధవళాయతలోచన తన యాలోకనములనెడి సుధావీచికలచే నాతనికిని దనకును గలమధ్య ప్రదేశము నెల్ల వెల్లివిరియఁజేసె నని వర్ణించుటచేత నాయచ్చరమచ్చెకంటియొక్క కలశాబ్ధిసంభూతి గోచరింప "చిన్నివెన్నెలకందు వెన్నుఁదన్ని సుధాబ్ధిఁ బొడమినచెలువ తోఁబుట్టు మాకు" అను సందర్భము ప్రదర్శింపఁబడినట్లుగ విలసిల్లుచున్నది.

తొలుదొల్త బాహ్యేంద్రియములగు నాలోకనాదుల ద్వారాగా నంతరింద్రియమగు మానసమునకు తౌల్యాదులు గల్గుటయుఁ బిదప నట్టి యాంతరంగిక ధర్మము లాకారమునం దనఁగా నాలోకనాదులందుఁ బ్రతిబింబించుటయు సహజ మగుటచే "మునుమున్ బుట్టెడు..." అను మొదలగు మూఁడవపద్యములోని వర్ణన మెంతయు స్వభావసిద్ధముగా నున్నది.

స్వైర్వేశ్యయుఁ బ్రగల్భయు నగు వరూధినికిసైతము ప్రవరుని జగన్మోహనాకారము కంటఁబడి నపుడు మొట్టమొదట సంకోచ మంకురించెను. అట్టి యాంతరంగిక సంకోచముచే నాలోకనములకు నిర్ణిరోధప్రచారము సంభవింపమింజేసి యీషన్మాత్రనిరోధమును సైతము సైఁపఁజాలని యామెనయనములందు తౌల్య మతిశయించెను. తోడనె ప్రౌఢయగునామె కట్టి జంకు తీరుటంజేసి యామెనేత్రములు యథేచ్ఛముగా నా జగన్మోహనరూపమును జూడ నారంభించుటచేతఁ గల్గిన సమ్మోదాతిశయమింకను దనివితీర నాతని సౌందర్యవిశేషమును దిలకించుట కనువుపడునట్లుగ నామెనేత్రములకు విస్తీర్ణతను సంభవింపఁజేసెను. అట్లానందాశ్చర్యముల నోలలాడెడి యామె మానసమునందు వెనువెంటనె వివిధరతోత్సవకౌతుకితము లగు వాంఛలా గుబ్బు, కొనుచు నామె యాలోకనములందుఁ దుర్లింతలను వెలయఁజేసెను. తోడనె సంభావ్యమాన వివిధరతోత్సవప్రదానయోగ్య మగు నాతని మోహనాకారము మానసమున మెచ్చుకొనసాగెను. తాదృశప్రశంసాతత్పరత యామె కనుఱెప్పలను స్వభావసులభముగ నల్లలనాడించెను. తోడ్తోన ప్రశంసార్హ మగునట్టి దివ్యమంగళ విగ్రహము సన్నికృష్టమై యలరారుటం జేసి యామె కనులుసైతము స్తబ్ధములయ్యెను. అంతలోనె యాంతరంగిక వాంఛాకదంబము పెల్లుబ్బరేఁగుటచేత నామె చూపులం దొకానొకవిధ మగు నొయ్యార ముప్పతిల్లఁగా నాధవళాయతలోచన యాలోకనకాంతులు వెన్నెలలు కాయసాగెను.

వైరీతిని శంకా మోదాభిలాష శ్లాఘాది భావకదంబము క్షణక్షణము నొకటివెన్క నొకటి యుద్రేకించుచుండఁగాఁ దనమానసము నందలి క్షణక్షణ జాయమాన పరిణామమును వెల్లడించుచున్నట్టియు, నాశ్చర్యాతిశయముచే నంత కంతకును వికసించుచునే యున్నట్టియు నేత్రపద్మములతో నవ్విలాసిని కాంతుని జూడసాగె నని యిట్లు పెద్దనార్యుఁ డామదనపరవశ యగు వరూధిని సహృదయహృదయములందుఁ బొడకట్టునట్లుగ మిక్కిలి నేర్పుతోఁ జిత్రించియున్నాఁడు.

ఇంక రామరాజభూషణుని కవితారీతిని గొంత ప్రశంసించుచున్నాఁడను.

నాయికానాయకప్రథమసమావేశసందర్భమున రామరాజభూషణుఁడు మిక్కిలి నేర్పుతో నౌచిత్యమును బాటించెను. నాయకుఁడు లతాంతరితగాత్రుఁడై ప్రచ్ఛన్నుఁడై తత్తాదృశగిరికాజగన్మోహనరూపము నీక్షించుచు ననురాగపరవశుఁడై వినుచుండ నాయికయొక్క యున్నతగోత్ర

ద్యుతి, సంగీతసాహిత్యవిద్యాసంపత్తి, మున్నగు నుత్తమకన్యాలక్షణములను (మాయా) మానితో గిరికాసఖి చెప్పెడి మిషను గల్పించుకొని ప్రశంసించెను. అట్లే నాయికయెదుట నామె చెలులు (మాయా) మానితోఁ జెప్పెడి మిషను గల్పించుకొని నాయకుని ధీరోదాత్తతాది సద్గుణకదంబమును ప్రశంసించి, యాతఁడు గిరిక ననతికాలములోఁ బెండ్లియాడఁగలఁడని భావిని ధ్యానించి తెలిసి యా (మాయా) మాని చెప్పినట్లును నందులకు సఖు లౌత్సుక్యముం జూపఁగా నమ్మాని తనమంత్రప్రభావమున నాజగన్మోహనాకారుఁడగు వసురాజు నటకు రప్పించినట్లును సందర్భపఱిచి నాయికామానసము నందుమ ననురాగబీజములను వెదచల్లెను.

ఇచటి రతిభావము పరస్పరానురక్తులగు నాయికానాయకు లాలంబనముగఁ గలదగుటం జేసియు, నాయిక ముగ్ధయుఁ గులపాలికయు నగుటం జేసియుఁ, బరమపవిత్రమును నీతి బోధకమును నగుచు నిష్కళంకశృంగారరసరూపమున సహృదయస్వాదయోగ్య మగుచున్నది. ఇట్టి సందర్భమున వసురాజును గిరిక యాలోకించిన యాలోకనములను రామరాజభూషణుఁ డీక్రిందిరీతిని వర్ణించెను.

సీ. తలిరుఁబ్రాయమువాని వలరాజు నలరాజు నలరాజుఁ దెగడు సోయగమువానిఁ
బసిఁడిచాయలవానిఁ బగడంబు జగడంబు జగడంబు గల మోవిసొగసువానిఁ
దళుకుఁ జెక్కులవానిఁ దులకింపు పలుకెంపు పలుగుంపు లొలయు నవ్వొలుకువానిఁ
జికిలిచూపులవాని సిరిమించు దొరయించు దొరయించు కాంచనాంబరమువాని
తే. నొఱపు గలవాని మకుటకేయూరహార, కటకకుండలచాకచక్యములవాని
నమ్మహీజానిఁ గని లేచి యమితవినయ, సంభ్రమము దోఁప నిలిచి రబ్జాతముఖులు.

చ. అనుపమకాంతివైభవసమన్వితు నా వసురాజుఁ గాంచు ప
ద్మినిసరసాంతరంగమున మించె వినూతన రాగకందళం
బొనరె నఖండవాసనలు నుత్కలికల్ వికసిల్లె నల్ల న
ల్లన నిగిడెం బ్రమోదతరళస్మితు లై తమిఁ జూపుతుమ్మెదల్.

చ. తొలుదొలుత న్విలోలగతిఁ దొంగలి ఱెప్పలనాని కర్ణకుం
డలరుచి ధాళధళ్యముల డాఁపున నల్లన పొంచిమించు లై
వెలువడి పూర్ణచంద్రు పయి వెన్నెలపుల్గుల చాలువ్రాలు లీ
లల విభుమీఁద వ్రాలె నవలా నవలాలితదృష్టిజాలముల్.

క. వసుధాసుధాంశుఁ బొదవుచు, వెస మరలుచు మరలి మగుడ వెడలుచు లలనా
లసమానదృష్టిజాతము, లసమాంబకు చిత్రశరము లై విలసిల్లెన్.

(ఇచటి లసమానశబ్దము శానచ్ ప్రత్యయాంతము కాదు. ఇంక చానస్ ప్రత్యయాంతము)

చ. వనజదళాయతాక్షి నిడువాలికచూపనిమేషవృత్తి నా
ఘనునవకంబుపైఁ బొలసి కాంత తదీక్షణజాలకంబుపై
గొనినఁ ద్రపాబ్ధిఁ గ్రుంకియును గోరికఁ గ్రమ్మఱఁ గూడఁబాఱు మో
హనగుణశక్తినివ్వటిలునవ్వలరాయనినేర్పు పెంపునన్.

తే. కౌతుకముపూని యొండొరులఁగాంచఁదివురు, చంచలాక్షికిఁ బలికి నేత్రాంచలములు
గూర్చెవలరాచయొజ్జ గోర్కులు దలిర్ప, నదిగదా భావిశోభనవ్యంజకంబు.

(వసుచరిత్రము - 3 ఆశ్వా. 46,48—52)

ఇందు మొదటిపద్యము ఛేకానుప్రాసవృత్త్యనుప్రాసాంత్యానుప్రాసయమకపాదార్థముక్తపద గ్రస్తాదిబహువిధ నియమకలితవివిధశబ్దచిత్రచిత్రిత మై శ్లేషసమతాసౌకుమార్యమాధుర్యాదిగుణ సముల్లసితమై యలరుచున్నది.

ఈసందర్భమునందలి నాయిక ముగ్ధయుఁ గులపాలికయు నగుటచే ననురక్తయై యున్నను మనుచరిత్రమునందలి స్వైరిణియగు వరూధినివలె నాయకుఁడు కంటఁబడినదిమొదలుగ గాఢాను రాగముతో నెడతెగని యాలోకనపరంపరల నాతనిపైఁ బ్రసరింపఁజేయుట యుచితముకాదు. కావు ననే రామరాజభూషణుఁడు ముగ్ధయగు గిరికయొక్క యనురాగ లాలితములగు దృష్టులల్లనల్లన విగిడి నాయకునిపైఁ బ్రసరింపఁ గొంకి పొంచిపొంచి బయలువెడలుచు మరలుచు రతిభావవిజృంభణ పారవశ్యమున నెట్టకేలకు నాయకునిపైఁ బ్రసరించె ననియు నపుడు నాయకుఁడు దన్ను సాభిలాష ముగ నీక్షించుచున్న విషయము గోచరమగుటచే నాయిక లజ్జాపరవశయై యట్టినాయకునకు సమ్ముఖ ముగ నాలోకనములను బ్రసరింపఁజేయలేక మరలించియుఁ దుదకు మన్మథోద్రేకపరవశయై దన్ను సాభిలాషముగఁ జూచునాయకున కభిముఖముగఁ దనదృష్టులను బ్రసరింపఁజేసె ననియు నిట్లుగ సహజ ముగను నుచితముగను బ్రౌఢముగను వర్ణించెను.

48 పద్యము:—నిరుపమానలావణ్యశాలియగు వసురాజును గాంచిన తోడనె పద్మినీజాతి స్త్రీయగు గిరికమానసమున నభూతపూర్వమగు ననురాగ మంకురించె ననియు, వెనువెంటనె తాదృశాను భవ వాసనాజన్యములగు స్తంభ రోమాంచ స్వేదాదు లుప్పతిల్లె ననియు, దోడ్తోడనె తత్ప్రాప్తి విషయక త్వరారూపౌత్సుక్యము విజృంభింపసాగెననియు, వెన్వెంటనె తాదృశ మనోహరప్రాప్తి విషయకహర్షముచేఁ జంచలములగు భ్రమరసదృశ నీలాతినీలదృష్టుల నాతనిపై నిగుడసాగె ననియు (లేదా భ్రమరసదృశము లగుదృష్టు లల్లనల్లన నిగుడసాగె ననియు) నిట్లు రామరాజభూషణుఁడు ప్రాకరణికవసురాజవిషయకగిరికానురాగమును మిక్కిలి యుచితముగ వర్ణించినాఁడు.

అనుపమకాంతివైభవశాలికి వసురాజ (వసు=కిరణ)ు పేరు సమర్థమగుచున్నది. అట్టి లావణ్య శాలి యగుటనే పద్మినీనాయికకు దర్శనమాత్రమున ననురాగ మంకురించెనను స్వారస్యము విలసిల్లు చున్నది. పద్మిని యంతరంగము సరసమనుట మిక్కిలి యుచితముగ నున్నది. గిరిక కన్యయుఁ గులపాలి కయు నగుటచేఁ బ్రప్రథమమునఁ గల్గుననురాగ మంకురప్రాయమనుట మిగుల ననురూపముగ నున్నది. కావుననే యట్టిలజ్జావతియగు ముగ్ధదృష్టు లల్లనల్లన వసురాజుపైఁ బ్రసరింపసాగెననుట మిగుల నుచి తమై సహజమై యలరారుచున్నది.

ఇందు వసురాజసంబంధి నిరుపమానకాంతివైభవరూపోద్దీపనవిభావముచేతను, గిరికానిష్ఠస్తంభ రోమాంచస్వేదాదిరూపసాత్త్వికభావములచేతను, నౌత్సుక్యప్రమోదచాపల్యాదిసహాయభూతసంచారి భావములచేతను, సానురాగవీక్షణరూపానుభావములచేతను, నాలంబనవిభావభూత వసురాజవిషయక గిరికారతిరూపస్థాయిభావము పరిపుష్టమగుచు శృంగారరసరూపమున సహృదయాస్వాదయోగ్య మగు చున్నది.

మఱియుఁ బైరీతిని రసప్రతీతి సాధనసామగ్రి నెల్లను బూర్ణముగ వర్ణించుటచేతను, నందలి రాగశబ్దము రతిరూపస్థాయిభావవాచక మగుటచేతను, నట్లెయందలి వాసనాశబ్దము వాసనాజన్యసాత్త్వికభావలక్షకమగుటచేతను, దరంగవాచకమగునుత్కలికాశబ్దము తరంగసదృశసంచారిభావలక్షకమగుటచేతను శృంగారరసలక్ష్యభూతమగు పైపద్యము "విభావేనానుభావేన వ్యక్తస్సంచారిణా తథా, రసతామేతి రత్యాదిః స్థాయిభావస్స చేతసామ్" అను రససామాన్యలక్షణమును స్ఫురింపఁజేయుచున్నది.

పయిపద్యమునందుఁ బద్మినీసూర్యపరమగు ధ్వన్యర్థముగూడఁ గలదు. నిరుపమాన తేజశ్శాలి (కాంతి=తేజము) యగు నాసూర్యుని (వసు=కిరణ) గాంచినతోడనే పద్మినియొక్క. మరందయుక్తమగు నంతరంగమున ననఁగాఁ గళికామధ్యమున వినూతనమగు రాగకందళ మనఁగా భ్రమరనినాద మార్భటమయ్యెను. మరందపానపారవశ్యమునఁ దుమ్మెదలు పద్మము ముకుళించునపుడు పైకిరాఁజాల కుండుటచేఁ గోరకములలోనుండి పోయిన వనియు, నపుడు ప్రభాతమగుటచేఁ బద్మవికసనారంభప్రథమక్షణమునం దట్టి వికసనారంభమును గ్రహించి బహిర్గమనప్రాప్త్యవకాశజనితానందమునఁ గళికలో రొదసేయ సాగె ననియుఁ దాత్పర్యము. (ఇచట వ్యాఖ్యాత లీమార్గమునఁ బోక సూర్యదర్శనోత్తరక్షణమునఁ బద్మలతకు మూలమగుదుంపలో మొలక లేచె ననియు, నది వెనువెంటనె పరిమళించి మొగ్గ దొడిగె ననియు, నక్కారణమున దానిపైఁ దుమ్మెదలు వ్రాలె ననియు నిట్లసంభవముగ నర్థముచేయుట చింత్యము) అటు వికసన మారంభింపఁగనే యట్టియీషద్వికసితకమలకోరకములనుండి పరిమళము లుద్గమింపసాగెను. అట్టి దరవికసితకోరకములనుండి బహిర్గమనాపేక్షను జూపునట్టి ప్రమోదచలితము లగు భ్రమరములెట్టెటో సందుచేసికొని యల్లనల్లన వెలికి నిగుడసాగెను.

పైపద్మినీభాస్కరపరవస్తుధ్వనిచే నప్పటి గిరికావీక్షణములకుఁ దాదృశభ్రమరములతో సౌపమ్యము ధ్వనించుచున్నది. కాఁగా సూర్యునిగాంచినతోడనె పద్మినికెట్లనివార్యమగు వికాసము కల్గునో యట్లె వసురాజును గాంచినతోడనె గిరికకును ననివార్యమగు ననురాగమొదవె ననియుఁ, బద్మినీభాస్కరులకువలెనె గిరికావసురాజులకు సైతము దాంపత్యము బహుజన్మసిద్ధమె యనియు, ("సతీచ సాధ్వీ ప్రకృతిః స్థిరాపి పుమాంసమభ్యేతి భవాంతరేష్వపి") భ్రమరములను బద్మమాకుళ్యము ప్రతిబంధించుచున్నను నవిపద్మదళము లించుకవీడుట సందుచేసికొని తమితో నెట్టెటో పైకి వెడలు నట్లె గిరికాసానురాగవీక్షణములు, లజ్జావిజృంభణము ప్రతిరోధించుచున్నను ననురాగప్రేరితము లై ప్రమోదౌత్సుక్యపరవశము లై యెట్టెటో వసురాజుపైఁ బ్రసరింపసాగె ననియు నిట్లుపమాధ్వనివైభవము విలసిల్లుచున్నది. కావున నీయుపమాధ్వని గిరికాలజ్జావైభవమును వసురాజువిషయకగిరికానురాగమును వ్యక్తపఱచుచుఁ బైనుదాహరించిన రసధ్వని నెంతయుఁ బరిపుష్టముఁ గావించుచున్నది.

ఈసందర్భమున వసురాజు వచ్చుచున్న క్షణములలోనె గిరిక హఠాత్తుగా నాతనిఁ గాంచె నని మాత్రమే గ్రహింపవలెనుగాని యీమె యాతఁడు వచ్చి కూర్చున్నపిదప నాతనిపయి నిలుకడగాఁ దన దృష్టిని బ్రసరింపఁజేసెనని గ్రహింపరాదు. అట్లు గ్రహించునెడల, రాజెట్లును గిరికవైపు చూచుచునే యున్నాఁడుగాన నట్లు చూచుచుండుట నీక్షించియు ముగ్ధయగుగిరిక యాతనిపయి నిర్నిరోధముగ దృష్టులను బ్రసరింపఁజేసె నని యంగీకరింపవలసి వచ్చును. ఆట్లయినచో 49—52 పద్యము [illegible] తములు కావలసివచ్చును. కావుననే కవి వసురాజుఁగాంచు పద్మినియంతరంగమున రా[illegible] పిదప నామెదృష్టులు "అల్లనల్లన నిగిడెం బ్రమోదతరళస్థితులై" అని మిక్కిలి [illegible] చెప్పినాఁడు.

49:—"తొలుదొలుతన్......" కాటుకకన్నులనుండియుఁ గనీనికలనుండియు బయలువెడలునవగుటంజేసి నీలాతినీలములుగను, ధవళాయతలోచనములనుండి బయల్వెడలునవగుటంజేసి ధవళధవళముగను గాంతాదృష్టులు వర్ణింపఁబడుట సంప్రదాయసిద్ధమె యగుటచేఁ బైపద్యమున నీలాతినీలదృష్టిప్రసారమును వర్ణించి యించు ధవళాలోకనములప్రసారమును వర్ణించుచున్నాఁడు. వెనుక నుదాహరించిన మనుచరిత్రపద్యములలోఁగూడ నిట్లె వర్ణింపఁబడె నని గ్రహించునది.

ప్రమోదప్రేరితము లయ్యు ముగ్ధయగు నాగిరికయవలోకనములు లజ్జానిరోధమునఁ దొలుదొల్త నావాల్గంటిఱెప్పల నానుకొని నిల్చినిల్చి పిదప ననురాగబలమున వెలికివచ్చి మరల లజ్జాపరవశము లగుచుఁ గర్ణకుండలగతవజ్రకాంతులలో డాఁగిడాఁగి మరల ననురాగోద్రేకమున నతిశయించి సంపూర్ణచంద్రునిపయి వెన్నెలపుఱుఁగులు వ్రాలురీతిని వసురాజుమీఁద వ్రాలెను. ఇచట విభుమీఁద వ్రాలె నని యిట్లు సామాన్యముగఁ జెప్పఁబడినను నుపమానవాక్యములోని పూర్ణచంద్రశబ్దస్వారస్యముచే నవ్విభుముఖముపైనె యామెదృష్టులు ప్రసరించె నని రామరాజభూషణహృదయము నెన్నఁ నగును. అనన్యాస్వాద పరములగు చకోరము లెట్లు చంద్రికనే యాస్వాదించునో యట్లే యనన్యాస్వాదపరములగు కన్యయైన గిరికదృష్టులును వసురాజుమోమునందె యత్యంతాసక్తితోఁ బ్రసరించె నని యిందలి యౌపమ్యము విశదీకరించుచున్నది.

ఇందు నవోఢ భర్తృశయనాగారమునఁ బ్రవేశించునపుడు లజ్జానిరోధమునఁ గొంకుచు వెనుదీసి సఖ్యాదు లవలంబముగా నిల్చుచు నట్టిసఖ్యాదులలాలనమున నెట్టెటో శయనగృహమున నడుగిడి తుదికి రత్యుద్రేకపారవశ్యమున నాథుం గవయు ననువస్తువు ధ్వనితమగుచున్నది. దానిచేనట్టి నవోఢతో గిరికాదృష్టుల కౌపమ్యము ధ్వనించుచున్నది. అట్టియుపమాధ్వనియు గిరికా లజ్జానురాగములనె పరిపుష్టత నొందించుచున్నది.

మఱియు నిందలి వ్రాలె నను ప్రయోగముయొక్క స్వారస్యముచే నవోఢ నాథునిసన్నిధికిఁ బోవునపు డెట్లు లజ్జాపారవశ్యమున నొడలు మఱచి నాథునిపై వ్రాలునో యట్లే యాలజ్జావతిదృష్టులు సైతము విభునిమీఁద వ్రాలె నని స్ఫురించుచున్నది. అనఁగా గిరికాదృష్టు లెట్టెటో రాజుం దరిసి యటఁ జొక్కెనే గాని యాతఁడు సాభిలాషముగఁ దన్నుఁ జూచుచున్నవిషయమును గ్రహింపఁగల్గునంతటి నిలుకడగా నింకను బ్రసరింప లే దని భావము.

ఇట దృష్టులు కర్ణకుండలకాంతులలో డాఁగె ననుటచే గిరికా నేత్రములు కర్ణాంతవిశ్రాంతములని వ్యక్తమగుచున్నది.

"50:—వసుధాసుధాంశు..." ఆగిరికయొక్క లజ్జానురాగములు హోరాహోరిగ నొనర్చు పోరాటమున ననురాగవిజయవశమున నామెదృష్టులు వసురాజుపైఁ బ్రసరింపఁబోవుచు నంతలోఁ గల్గు లజ్జావిజయవశమున వెనుకకు మరలుచు వెన్వెంటఁ గల్గుననురాగవిజయవశమున మరల వసురాజుపైఁ బ్రసరింపఁబోవుచు నుండెను. ఆమె లజ్జానురాగము లిట్లు సమతులారోహముగఁ బోరుచున్నట్లు వర్ణించినను "మరల మగుడ వెడలుచు" నని తుది ననురాగమునకే విజయమిచ్చుట యెంతయుఁ బ్రౌఢముగా నున్నది. ఇట్లు గిరిక దృష్టులు గతాగతములతో నాందోళించుచుండెనే గాని యింకను నిలుకడగా వసురాజుపైఁ బ్రసరించియుండలేదు. కావుననె 51, 52 పద్యములు సుసందర్భము లగుచున్నవి.

మోహజనకము లగుటచేత నామె యాలోకనములు మదనసాయకములవలె భాసిల్లెను. మదనుని సామాన్యసాయకములకు సైతము బయల్వెడలిన వెనుక మరలుటగాని యెదురుదగిలి వెనక్కుఁ దూలినపిదప మరల వెడలుటగాని లేదు. కావున నె యట్టి గతాగతములు గల గిరికావీక్షణరూప మదనసాయకములు చిత్రశరములై విలసిల్లెను. సామాన్యకాంతావీక్షణములకన్న లజ్జామంథరవీక్షణము లెక్కుడు మోహజనకము లని కవి హృదయము. అసమాంబకుఁ డనఁగా నిరుపమానములగు శరములు గలవాఁ డనియు నర్థము లభించును గాన నట్టివాని కట్టి యసాధారణశరము లుండుటయు వింత గాదని స్వారస్య మెన్నఁదగును.

“51—వనజదళాయతాక్షి......” ఆగిరికయొక్క దీర్ఘమైనట్టియు వాఁడియగునట్టియు నాలోకన మావసురాజుచక్కఁదనముపై నిర్నిమేషముగఁ బ్రసరించి యపు డాతనివీక్షణ సమూహము పైకొనఁగా లజ్జాసముద్రములో మునిఁగియు నా మదనుని నేర్పుపెంపున సాభిలాషముగ మరల నా రాజు చక్కఁదనముపైఁ బ్రసరింపసాగెను.

“దృష్టాదర్శయతి వ్రీడాం సమ్ముఖం నాభిపశ్యతి, ప్రచ్ఛన్నం వా భ్రమంతం వా తిర్యక్తం పశ్యతి ప్రియమ్” అనుచొప్పున ననురక్తయగు ముగ్ధ ప్రథమసమావేశమున, నాయకుఁడు తనవైపు చూడనపుడు మాత్రమె యాతనివైపు చూచుచుండుటయు, నాతఁడు తనవైపు దృష్టిని బఱపుచున్నట్లు తాఁ జూచినతోడనె తనదృష్టిని మరలించుటయు సహజము. ప్రకృతమున గిరిక తనదృష్టి నింతదనుక నిలుకడగా వసురాజుపైఁ బ్రసరింపఁజేసియుండనందున నాతఁడు తనవైపు చూచుచున్నదియు లేనిదియు గ్రహింపలేదు. ఇప్పటి కనురాగప్రాబల్యమున నొడలు మఱచి నిలుకడగాఁ దన దృష్టిని వసురాజుపైఁ బ్రసరింపఁజేయుటకు సాహసించినది. కాని యంతలో నతఁడు తన్ను సాభిలాషముగ నీక్షించుచున్న విషయమును గ్రహించినందున మరల లజ్జాపరవశయై తనదృష్టిని మరలించెను. ఇట్టిస్థితిలో గిరికాదృష్టి మరల రాజుమీఁదికి బ్రసరింపఁ బోవుట సహజముకాకున్నను నాశల రాజు నేర్పుపెంపునంజేసి మరల నాయకునిఁ గూడుట కనఁగా నాతనిపైఁ బ్రసరించుటకుఁ బాఱ ననఁగా బయలుదేఱెను. ఇట్లగుటచే నింకను గిరిక వసురాజును నిలుకడగఁ జూడలేదను స్వారస్యము విలసిల్లుచున్నది.

మఱియు నిందు “అనిమేషవృత్తి” అను మొదలగుపదములకుఁ గల మత్స్యాద్యర్థాంతరముల మహిమచే గిరికాదృష్టికి మత్స్యముతో నభేదము రంజిల్లునట్లుగ శ్లిష్టాశ్లిష్టశబ్ద నిబంధనరూపకాలంకారము వెలయు నట్లర్థాంతరమును గ్రహింపనగును. కాఁగా మత్స్యము (అనిమేష) మేఘము యొక్క (ఘన) క్రొత్తనీటికై (నవ, కంబు)గఁదట్టి యంతలో జాలరియొక్క (వల, రాయని = వల గలవాని) వల (జాలకంబు) తనపైఁబడఁగా నాచేప నీటిలో మునిఁగియుఁ గ్రొత్తనీటిమీఁది యభిలాష పారవశ్యముచే (కోరికల్) జాలరివలలోఁ బడుట కనువగు నన్నవిషయమును స్మరింపక మరల మీఁది కెగఁబ్రాఁక నుంకించు నను రూపకార్థము లభించుచున్నది. ఇట్టి రూపకము గిరికావీక్షణ మత్స్యోపమ్యాశ్రితోపమాగర్భ మగుటంజేసి “క్రొత్తనీటికిఁ జేప యెగఁదట్టువిధమున వసురాజు సోయగమునకై యామెదృష్టి నిగుడసాగె ననియు, నంతలో జాలరి వల వేయఁగా నాచేప యా జాలకమునకు దొరకకుండ నీటిలో మునిఁగెడిమాడ్కిని గిరికాదృష్టియు వసురాజసాభిలాష ప్రతి

వీక్షణ మెదిరి పైకొనఁగా నద్దానికి దొరకక లజ్జామగ్న మయ్యె ననియు, వెన్వెంటనే యాచేఁప క్రొత్త నీటిపైఁ గల యభిలాషపారవశ్యమున జాలరివలభీతిని మఱచి మరలఁ బైకెగఁబ్రాఁకు చాడ్పున నాగిరిక వీక్షణము సైతము వసురాజు సోయగము నీక్షించుచు నభిలాషచే లజ్జను గణింపక యాతని పైఁ బ్రసరింపఁ దివిరె ననియు నిట్లు ధ్వన్యర్థవిశేషములు లభించి గిరికా లజ్జావైభవమును నామె రతిభావవిజృంభణమును బరిపుష్టములఁ గావించుచున్నవి.

52:—"కౌతుకముపూని......" కౌతుకముతో నొకరినొకరు చూచుటకు యత్నించు నట్టి యాగిరికా వసురాజులకోర్కులు సఫల మగునట్లుగ మదనుఁ డను శృంగారోపాధ్యాయుండు వారి దృగంచలములను సంఘటించెను. అట్టి బాహ్యసంభోగశృంగారరూప పరస్పరసాభిలాషావలోకన మెగదా యచిరభావి యగు నాభ్యంతరసంభోగశృంగారరూపశోభనకార్యమునకు వ్యంజక మగును. మున్ముందు వ్రాయఁబోవువిధమున గిరికావసురాజుల వివాహసంస్కారరూపవ్యంగ్యార్థమును ఘటించుటనుబట్టి చూడఁగా నీసందర్భములోని గిరికా వసురాజుల పరస్పరాభిముఖసాభిలాషవీక్షణమును బాహ్యసంభోగశృంగారముగ నెన్నుటయె కామరాజభూషణహృదయ మని విశదమగుచున్నది. అదియె యాలంకారిక సమయానుకూలముగను గన్పట్టుచున్నది. "విప్రలాంభోఽథసంభోగ, ఇత్యేష ద్వివిధోమతః............(211)" "దర్శనస్పర్శనాదీని, నిషేవేతే విలాసినౌ, యత్రానురక్తావన్యోన్యం, సంభోగోఽయముదాహృతః" (225-) (సాహిత్యదర్పణము. 3 పరిచ్ఛేదము) అని యిట్లు విప్రలంభసంభోగభేదములచే శృంగారము రెండు విధము లనియు, నాయికానాయకు లన్యోన్యానురక్తులయి సేవించు పరస్పరాలోకనము సైతము సంభోగశృంగారమే యనియు నాలంకారికులసమయమై యున్నది.

ఇటఁ గౌతుక మనఁగా గిరికాపక్షమున నుత్కంఠ యనియు, వసురాజపక్షమున నభిలాషమాత్ర మనియు నర్థము చేయవలయును. 'ఒండొరుఁ గాంచఁ దివురు' అనుచో గిరికాపక్షమున "నావలకు నిలుకడగాఁ జూచియుండ కుండుటచే సావధానముగ వసురాజును జూచుట కుత్కంఠతో యత్నించు" అనియు, వసురాజు పక్షమున "నుత్తరోత్తరము నభిలాష మధిక మగుచుండుటచే నింకను నాగిరికను జూచుటకు యత్నించు" అనియు, నభిప్రాయమును గ్రహింపవలెను. అట్లు గిరిక సోత్కంఠయై యుండుటచే నామె దృష్టులు లజ్జానిరోధమునఁ జలితము లయ్యెను. కాన నచటి "చంచలాక్షికి" అనుపదము సాభిప్రాయముగ వెలయుచున్నది.

నేత్రాంచలము లనఁగాఁ గన్నుల కొంగు లని వాచ్యార్థము. కావున నది బాధితమగుటచే వానికి దృగంతము లనఁగాఁ గటాక్షము లని లక్ష్యార్థమును గ్రహింపవలెను. అట్లు గ్రహించినపుడు వారొండొరు నెడతెగక చూచుకొని రనియు, నట్లు చూచుకొనుటలో వారి దృక్కిరణము లేకధారగా నేకీభవించిన వనియు, వ్యంగ్యార్థవిశేషములు లక్షణాప్రయోజనముగ లభించును.

మఱియు నిందు, "వైవాహికదీక్షార్థకకంకణములను (కౌతుకము) ధరించి వివాహనేపథ్యము (గిరికాలజ్జారూపమగు) చాటున నుండుటచేఁ బరస్పరావలోకనాభిలాషులగు నావధూవరులకు (గిరికావసురాజులకు) వారి మనోరథములు సఫలము లగునట్లుగ వారి యుత్తరీయముల యంచులను (నేత్రాంచలములను) మన్మథుఁడను బ్రహ్మ (పురోహితుఁడు) ముడివేసెను. అట్టి వస్త్రగ్రంథితోడ

యచిరభావియగు గర్భాధానార్థకతత్సమావేశరూపశోభనకార్యమునకు వ్యంజకమగును!" అను వస్తు విందు ధ్వనించుచున్నది. అట్టి వస్తుధ్వనిచే గిరికా వసురాజుల పరస్పరావలోకనసంఘటనమునకు వైవాహిక వస్త్రగ్రంథితో నౌపమ్యము ధ్వనితమగుచున్నది. అట్టి యుపమాధ్వనిచే గిరికా వసురాజుల పరస్పరాభిముఖావలోకన మెడతెగక ప్రవర్తిల్లెననియు వారి వైవాహికసంస్కారము మన్మథబ్రహ్మచే (పురోహిత) నెరవేర్పఁబడుటచే ముగ్ధయుఁ గులపాలికయు నగు గిరికపక్షమున నట్టి సమ్ముఖావలోకన మౌచిత్యభంగము నొదవింప నేర దనియు, వారి దాంపత్యము విధిచోదితవివాహసంస్కారఘటిత దాంపత్యమువలెఁ బవిత్రమై చిరస్థాయియై సుశ్లోకమూలమై వివిధాభివృద్ధులఁ బడయఁ గలదనియు నిట్లనేకార్థవిశేషములు లభించుచున్నవి.

పైరీతిని గ్రహించినకొలఁదిని నిమ్మహాకవులకవితలలో నభిప్రాయవిశేషములు లభించుచునే యుండును. గనిలోని రత్నములను గ్రహించుటలో గ్రహీతలశక్తియే కొఱవడునట్లుగ నిమ్మహాకవుల భావనల నెన్నుటలో విమర్శకులప్రతిభ మొక్కవోవలసినదేగాని యాదలి యనంతాద్భుతాశయములకుఁ గొఱంత యుండనేరదుగదా! పైనుదాహరించిన మనుచరిత్ర వసుచరిత్రపద్యములకు వ్యాఖ్యానము చేయుటలో వ్యాఖ్యాతలు స్వారస్యములను జూపలేదు సరేగదా యనేక స్థలములలో నపమార్గములను బోయి యసంగతార్థములను సైతము వ్రాయుచువచ్చిరి. కావున విమర్శకాగ్రగణ్యు లట్టి లోపము తీఱునట్లుగ నిట్టి మహాగ్రంథముల కుత్తమవ్యాఖ్యానము లొనరింతురుగాక.

విజయనగరము.
16-10-1927.

ఇట్లు సుజనవిధేయుఁడు,
వఝల చినసీతారామస్వామిశాస్త్రి.

---